# వాడుక తెలుగులో అపప్రయోగాలు

**Prof. R. SRI HARI**
Head, Dept. of Telugu
University of Hyderabad.
Hyderabad.

ప్రచురణ :
వరరుచి పబ్లికేషన్స్
హైదరాబాద్.

VADUKA TELUGULO APAPRAYOGALU
By Prof. R. SRI HARI
Head. Dept. of Telugu, University of Hyderabad,
Hyderabad - 500 046

Copies : 1000

Price : Rs. 50/-

1995

For Copies :

R. Anantalaxmi,
16-2-836/F/2, Madhavanagar,
Saidabad, Hyderabad - 500 659.
Phone : 4069999

Printed at :

Padmavathi Art Printers,
1-1-517/B/1,
New Bakaram, Gandhinagar,
Hyderabad - 500 380.
Phone : 7611413.

# ప్రరోచన

సంస్కృతాంధ్రాలకు అతి సన్నిహితమైన సంబంధం ఉంది భాషావిషయకంగా చూస్తే సంస్కృతప్రభావం తెలుగుమీద ఎంతగానో ఉందని చెప్పవచ్చు. వివిధ రంగాల్లో, వివిధ ప్రక్రియల్లో నేడు వాడుకలో ఉన్న తెలుగుభాషలో సంస్కృతపదాలు అత్యధికసంఖ్యలో ఉండడం మనం గమనించవచ్చు. భాషాభివృద్ధికీ, కొత్త భావాల ఆవిష్కరణానికీ ఇది ఎంతగానో దోహదం చేస్తుంది. ఆంగ్లభాష కూడా గ్రీక్, లాటిన్ మొదలైన ఎన్నోభాషల పదాలను గ్రహించి సుసంపన్నం కావడంవల్లే ఆ భాషలో ఈనాడు ఏ విషయాన్నైనా మనం సులభంగా ఆవిష్కరించగలుగుతున్నాం. ఇతర భాషాపదాలను గ్రహించే విషయంలో మడిగట్టుకొని కూర్చునే పద్ధతి ఏ మాత్రమూ అభిలషణీయం కాదు- అది భాష ఎదుగుదలను దెబ్బతీస్తుంది కనుక. తెలుగుభాష కూడా నేటికీ సంస్కృత భాషాపదాలను అసంఖ్యాకంగా గ్రహిస్తూ, నూతనంగా కొన్నింటిని కల్పించుకుంటూ ఎన్నెన్నో కొత్త విషయాలను ఆ భాషలో ఆవిష్కరింపజేయగలుగుతుంది. సంస్కృతభాషా పదాలను తెలుగులో వాడకూడదనే నియమమే చేస్తే సంస్కృత పదాలను అసలే వాడకుండా మామూలు నిత్యవ్యవహారాన్ని మనం నడుపుకోగలమేమో కాని శాస్త్ర విషయాలను తెలుగులో చెప్పుకునే అవకాశం సాధ్యం కాదేమో! ఉదాహరణకు అక్షరం, పదం, వాక్యం, ప్రత్యయం, నామం, క్రియ, ధాతువు, విభక్తి, పురుష, సమాసం, తత్సమం. తద్భవం, కారకం, శబ్దం, అర్థం మొదలైన సంస్కృత పదాలను వాడకుండా మనం తెలుగులో వ్యాకరణ శాస్త్ర విషయాలను చర్చించుకోగలమా! అలాగే సంస్కృత పారిభాషిక పదాలను వాడకుండా ఏ శాస్త్ర విషయాలనైనా చర్చించుకోవడం కూడా అంత సులభం కాదేమో!

ప్రభుత్వ పరిపాలనకు సంబంధించిన వ్యవహారంలో కూడా సంస్కృత పదాల వాడుక మనకు అనివార్యమౌతుంది. కొన్ని పదాలను పరిశీలించండి.

శాసనసభ - ప్రధానమంత్రి - ముఖ్యమంత్రి - రాజ్యాంగం - కార్యాలయం - సచివాలయం - లోకసభ - రాజ్యసభ - మండలపరిషత్తు - కార్య నిర్వాహకవర్గం - న్యాయమూర్తి - న్యాయస్థానం - కారాగారం మొ॥

ఒకనాడు సాహిత్యావసరాలకు మాత్రమే వాడబడే తెలుగు నేడు వివిధ రంగాలకు విస్తరించింది. పత్రికలు, రేడియో, టీవీ మొదలైన ప్రచారసాధనాలు, ప్రభుత్వ పరిపాలన వ్యవహారం, కళాశాలాస్థాయివరకు తెలుగు మాధ్యమంలో విజ్ఞానశాస్త్రం మొదలైన అన్ని అంశాల బోధన - వీటి మూలంగా నేడు తెలుగు భాషకు పూర్వంకంటే వాడుక ఎంతో పెరిగింది. ఈ కారణంగా తెలుగులో సంస్కృత పదాల వాడుక కూడా విపరీతంగా పెరిగింది. ఉదాహరణకు పత్రికా రంగం తీసుకొండి. ఆంగ్లంలోని అనేక పదబంధాలను తెలుగులో చెప్పవలసి వచ్చినపుడు వాటికి పత్రికా రచయితలు సంస్కృత పదబంధాలు కల్పించుకోవడం కనిపిస్తుంది. కొన్ని ఉదాహరణలు పరిశీలించండి:

| | | |
|---|---|---|
| Summit Meeting | - | శిఖరాగ్ర సమావేశం |
| Five Year Plan | - | పంచవర్ష ప్రణాళిక |
| Non-aligned Countries | - | అలీన దేశాలు |
| Emergency | - | అత్యవసర పరిస్థితి |
| Minorities | - | అల్పసంఖ్యాక వర్గాలు |
| desarmament | - | నిరాయుధీకరణ |
| Tripartite discussion | - | త్రైపాక్షిక చర్చ |
| Three Language Formula | - | త్రిభాషా సూత్రం |
| National Integration Council | - | జాతీయ సమగ్రతామండలి |
| Closed door Meeting | - | జనాంతిక సమావేశం |
| Fast unto death | - | ఆమరణ నిరాహారదీక్ష |
| National Council | - | జాతీయమండలి |
| Dying declaration | - | మరణవాఙ్మూలం |
| Midday Meals Scheme | - | మధ్యాహ్న భోజన పథకం |

ఈ పదబంధాలన్నీ పత్రికా రచయితలు కల్పించుకున్నవే కాని సంస్కృతంలో అంతకుముందే ప్రసిద్ధమైనవి కావు. ఇంత చక్కని సంస్కృతపదబంధాలను సృష్టించి, వ్యాప్తిచేసి సంస్కృత భాషకు పరోక్షంగా జీవం పోస్తున్న పత్రికా రచయితలను మనం అభినందించాలి. పై పదబంధాలను కల్పించుకోవడానికి తెలుగు కన్నా సంస్కృతభాషే ఎంత బాగా నప్పుతుందో గమనించవచ్చు.

అలాగే తెలుగు మాధ్యమంలో వివిధ శాస్త్ర విషయాలు చెప్పవలసిన అవసరం ఏర్పడుతున్న ప్రస్తుత సందర్భంలో ఆంగ్ల పారిభాషిక పదాలనెన్నింటినో తెలుగులోకి తెచ్చుకోవలసివచ్చినపుడు మనం సృష్టించుకున్న పదాలలో దాదాపు తొంభైయైదు శాతంపైగా సంస్కృతపదాల రూపంలోనే తెచ్చుకోవడం జరుగుతుంది. తెలుగు అకాడెమీవారు ప్రచురించిన 'సామాన్య భాషాశాస్త్రం' (1978) చివర ఇచ్చిన పారిభాషిక పదకోశంలో తెలుగు పారిభాషిక పదాలుగా ఈయబడిన దాదాపు 400 పదాల్లో ఒక్క 'రొద' అనే పదం మాత్రమే తెలుగు పదం. తక్కిన పదాలన్నీ సంస్కృతపదాలే. ఇతర శాస్త్రాలకు సంబంధించిన పారిభాషిక పదాల్లో కూడా ఇంచుమించు ఇదే స్థితి కనిపిస్తుంది. దీన్నిబట్టి తెలుగువాడుకతోపాటు సంస్కృతపదాల వాడుకకూడా తెలుగులో క్రమంగా పెరుగుతున్నదన్న విషయం సువిదితమే

ఐతే సంస్కృతభాషా పదాలను తెలుగులో తత్సమాలుగా వాడుకుంటున్నపుడు సంస్కృతభాషా నియమాలను అతిక్రమించకుండా ఉండాలి. ఈ నియమం ప్రతి భాషకూ వర్తిస్తుంది. ఉదాహరణకు ఆంగ్లంలో independent, independance అనే రెండు పదాలున్నాయి. వీటిని తెలుగులో తత్సమాలుగా ప్రయోగించినపుడు దేశానికి independance వచ్చిందనీ, దేశం independent అయిందనీ అనాలి. కాని, దీనికి భిన్నంగా దేశానికి inedpedant వచ్చిందనో, దేశం independence అయ్యిందనో అంటే తప్పు. విశేష్యం ప్రయోగించాల్సినచోట విశేషణాన్నీ, విశేషణం ప్రయోగించాల్సినచోట విశేష్యాన్నీ ప్రయోగించడం ఇక్కడ జరిగిన వ్యాకరణ నియమభంగం తెలుగులో దేశానికి స్వతంత్రమొచ్చిందనే ప్రయోగంలో విశేషణమైన స్వతంత్రశబ్దాన్ని విశేష్యార్థంలో ప్రయోగించడం ఇలాంటిదే.

అవసరాన్నిబట్టీ, ఇతర కారణాలనుబట్టీ ప్రచారసాధనాలైన పత్రికల్లోనూ, విద్యారంగంలోనూ-ప్రధానంగా శాస్త్రవిషయాలను వివరించేప్పుడు - సంస్కృత పదాల వాడుక అత్యధికంగా కనిపిస్తుంది. అంతేకాకుండా, మామూలు వ్యవహారంలో కూడా సంస్కృతపదాల నెన్నింటినో వాడుతున్నాం. కాని కొన్ని, సందర్భాల్లో వీటిని సంస్కృతభాషా నియమాలకు వ్యతిరేకంగా ప్రయోగించడం కనిపిస్తుంది. ఈలాటి నియమభంగం తెలుగు వాడుకలో కనిపించే వివిధ భాషా పదాల్లోకంటే సంస్కృతభాషాపదాల ప్రయోగంలోనే ఎక్కువగా జరిగినట్లు కనిపిస్తుంది. వందలకొద్ది సంస్కృత అపప్రయోగాలు మనకు తెలుగులో కనిపిస్తాయి. దీనికి కారణం సంస్కృత వ్యాకరణ నియమాలు ప్రయోక్తలకు సరిగా తెలియకపోవడమే.

ఈ విధంగా తెలుగు వాడుకలో వినిపిస్తున్న సంస్కృత అపప్రయోగాల్లో కొన్ని, ప్రయోక్తలకు అపప్రయోగాలని తెలియదు. అపప్రయోగాలని తెలిసినా అవి ఎలా వ్యాకరణ నియమాలకు విరుద్ధాలో తెలియదు. అప్పుడప్పుడు జిజ్ఞాసువులు, అధ్యాపకులు, విద్యార్థులు కొందరు ఈ అపప్రయోగాల వ్యాకరణ విరుద్ధతను వివరించవలసిందిగా కోరుతూఉంటారు. నాకు తెలిసింది చెప్పి వారి సందేహాలను తీర్చడం జరుగుతుంటుంది. ఐతే, ఇలాటి అపప్రయోగాల వ్యాకరణ విరుద్ధతను గూర్చి తెలుపుతూ ఒక గ్రంథం రాసి ప్రకటిస్తే అందరికీ ఉపయుక్తంగా ఉంటుందన్న ఉద్దేశం కలిగింది. దాని ఫలితమే ఈ గ్రంథం.

ఈ గ్రంథంలో సుమారు 300 పదాలను గురించి వివరించడం జరిగింది. ఈ పదాలన్నీ సంస్కృత వ్యాకరణ నియమాల ప్రకారంగా సాధువులు కావు. ఐతే, వీటిలో కొన్ని మాత్రం బాగా చెలామణిలో ఉన్నాయి. వాటిని కాదనడం నా ఉద్దేశం కాదు. ఇందులో వివరింపబడిన పదాలన్నీ ఎలా వ్యాకరణ విరుద్ధాలో తెలియజేయడమే నా ఉద్దేశం.

అపప్రయోగాలు అనే సరికి వ్యాకరణరీత్యా అసాధువులనే అర్థం వస్తుంది. ఐతే ఈ గ్రంథంలో వివరింపబడ్డ పదాలలో కొన్ని వ్యాకరణరీత్యా సాధువులైన పదాలు కూడా ఉన్నాయి. ఐతే, వాటిని వాడుతున్న అర్థాల్లో మాత్రం అవి అపప్రయోగాలనే చెప్పవలసి ఉంటుంది. ఉదా:- స్వతంత్రం (స్వాతంత్ర్యం అనే

అర్థంలో), జాగృతం (జాగృతి అనే అర్థంలో), మహిళాబాధితులు (బాధితలైన మహిళలు అనే అర్థంలో), మత్స్యకారులు (చేపలను పట్టేవారనే అర్థంలో) మొ॥ అర్థరీత్యా ఇవి కూడా అపప్రయోగాలే కనుక ఇలాటి పదాలను కూడా ఇందులో చేర్చడం జరిగింది.

సంస్కృతంలోని వ్యాకరణ నియమాలు సరిగా తెలియకపోవడం ఈ అపప్రయోగాలకు ప్రధాన కారణం కనుక, ఆయా పదాలను గురించి చర్చించేప్పుడు పాణినీయ నియమాలను ఉదాహరిస్తూ వివరించడం జరిగింది. ఈ నియమవివరణ సంస్కృతవ్యాకరణ పరిచయం లేనివారికి కొంత ఇబ్బంది కలిగించవచ్చేమో! ఐనా, విషయాన్ని శాస్త్రీయంగా చెప్పాలన్న ఉద్దేశంతో ఈ విధమైన వివరణ చేయడం జరిగిందని గమనించగోరుతాను.

ఇందులో చేర్చాల్సిన ప్రయోగాలు ఇంకెన్నో ఉన్నాయి. గ్రంథం పెరిగి పోతుందన్న భయంతో వాటినన్నింటినీ ఇందులో చేర్చలేకపోయినాను.

గ్రంథం చివర ఒక అనుబంధం చేర్చబడింది. ఇందులో ఆయా అర్థాల్లో ఏర్పడే తద్ధితాంత రూపాలను, అవి ఏర్పడిన పద్ధతిని సూత్రపూర్వకంగా నిర్దేశించడం జరిగింది. ఇది కొన్ని తద్ధితాంత రూపాలను అర్థం చేసుకోవడానికే కాక వాటి ప్రయోగంలో పొరపాట్లు చేయకుండా ఉండడానికి కూడా ఉపకరిస్తుందని భావిస్తాను.

ఈ గ్రంథం జిజ్ఞాసువులకు ఏమాత్రం ఉపకరించినా నా కృషి సార్థకమైనట్లుగా భావిస్తాను.

వ్రాత ప్రతిని చూసి తొందరగా ముద్రించండని పదే పదే ప్రోత్సహిస్తూ ఈ గ్రంథం తొందరగా వెలుగులోకి రావడానికి కారకులైన మిత్రులు, సహాధ్యాపకులు డా. ముదిగొండ వీరభద్రయ్యగారికి కృతజ్ఞతలు.

యువ సంవత్సర
వైశాఖ బహుళ చతుర్థి
18.5.1995.

—ఆర్. శ్రీహరి

# వాడుక తెలుగులో అపప్రయోగాలు

## అంతర్బహిర్పోరాటం :

అంతర్బహిర్ అనే సంస్కృత పదానికి పోరాటం అన్న తెలుగు పదంతో సమాసం చేస్తే వైరిసమాసమౌతుంది. ఆ సమాస దోషాన్ని అంగీకరించినా మళ్ళీ సంధి దోషం తప్పడం లేదు. ఎందువల్లనంటే రేఫకు శ్వాసాక్షరాలు పరంగా ఉన్నప్పుడు రేఫ విసర్గగా మారాలి. (చూ: 'ఖరవసానయోర్విసర్జనీయః' అష్టాధ్యాయి-8-3-15) ఆ శ్వాసాక్షరాలు సంస్కృత పదానికి చెందినవైనప్పుడే రేఫ విసర్గగా మారాలి. కాని ఎట్లాగూ వైరి సమాసదోషం చేస్తున్నాం కనుక తప్పులో మరో తప్పు అన్నట్లుగా రేఫను విసర్గచేసి అంతర్బహిఃపోరాటం అని అంటే కనీసం పదం శ్రుతిహితంగానైనా ఉంటుంది. ఏమైనా ఇలాంటి పదాలను పరిహరించడం మంచిది.

## అంతర్కళాశాల :

అంతర్ కళాశాలల వక్తృత్వపు పోటీ మొదలైన సమాసపదాల్లో 'అంతర్ కళాశాల' అనే పదబంధం వినబడుతుంది దీనికి 'కళాశాలల మధ్య' అని ప్రయోక్త ఉద్దేశించిన భావం. Inter - Collegiate అన్న ఆంగ్ల పదబంధానికి సమానార్థకంగా వాడబడుతుందన్న మాట. ఈ పదంలో రెండు అనౌచిత్యాలు కనిపిస్తున్నాయి. ఒకటి 'మధ్య' అనే అర్థం ఉన్న 'అంతర్' అనే పదాన్ని కళాశాలా శబ్దానికి ముందు వాడడం. మధ్య అనే అర్థం కలిగిన Inter అనే శబ్దాన్ని ఆంగ్లంలో నామవాచకానికి ముందుచేర్చి Inter - Collegiate మొదలైన విధంగా

ప్రయోగించే అవకాశం ఉన్నా సంస్కృత సమాసాల్లో ఆ విధంగా ముందు ప్రయోగించడం వ్యాకరణ సమ్మతం కాదు. కళాశాలా శబ్దానికి చివర చేర్చి 'కళాశాలాంతర్' అని అనవలసి ఉంటుంది. 'అంతర్ కళాశాల' అనే పదం వ్యాకరణ రీత్యా అసాధువేమీ కాదు. కాని దానికి 'లోపలి కళాశాల' అనే అర్థమే కాని కళాశాలల లోపల, కళాశాలల మధ్య అనే అర్థం రాదు. ఉదాహరణకు అంతర్గృహం,అంతరింద్రియం, అంతరాత్మ మొ॥ పదాల్లో లోపలిగృహం, లోపలి ఇంద్రియం, లోపలి ఆత్మ అనే అర్థాలే కాని గృహం లోపల, ఇంద్రియం లోపల, ఆత్మ లోపల అనే అర్థాలు రావు కదా! కనుక ఆ అంతర్ శబ్దాన్ని ముందు చేర్చి 'అంతర్ కళాశాల' అని వాడడం ఉచితం కాదు. మరో అనౌత్యమేమంటే - రేఫకు శ్వాసాక్షరాలు పరంగా ఉంటే రేఫ విసర్గగా మారాలి. (చూ: ఖరవసానయోర్విసర్జనీయః. అష్టాధ్యాయి. 8-3-15) అన్న నియమం ప్రకారం అంతర్‌లోని రేఫ విసర్గగా మారి 'అంతఃకళాశాల' అని కావాలి. ఐనా కళాశాలల మధ్య అనే ఉద్దిష్టార్థం రాదు కనుక ఈ గొడవలేమీ లేకుండా 'కళాశాలల వక్తృత్వపు పోటీ' అని అంటే సరిపోతుంది. ఇక్కడ కళాశాలల అన్న పదానికి లక్షణచే కళాశాలా విద్యార్థుల అని అర్థం చెప్పుకోవచ్చు.

Inter అన్న ఆంగ్ల పదానికీ, అంతర్ అనే సంస్కృత పదానికి శబ్దసామ్య ముండడంవల్ల Inter అన్న శబ్దాన్ని అంతర్ అని అనువదించడమో, లేక Inter-Collegiate అన్న ఆంగ్ల సమాస సాదృశ్యాన్నిబట్టి అంతర్ శబ్దాన్ని ముందు వాడడమో జరిగి ఉంటుంది.

ఇట్లే అంతర్జాతీయ, అంతర్దేశీయ, అంతర్రాష్ట్రీయ మొదలైన పదాలు (అంతర్రాష్ట్రీయ అనేది తప్ప) వ్యాకరణరీత్యా దుష్టాలు కాకపోయినా జాతులమధ్య, దేశాల మధ్య, రాష్ట్రాలమధ్య ఇత్యాద్యర్థాల్లో మాత్రం దుష్టాలే. ఇక అంతర్రాష్ట్రీయ అన్న పదం మాత్రం వ్యాకరణ

రీత్యా కూడా దుష్టమే. సంస్కృతంలో రేఫకు రేఫ పరంగా ఉన్నప్పుడు తొలి రేఫ లోపించాలన్న నియమం (చూ: రో రి; అష్టాధ్యాయి 8-3-14) ఉంది. దీని ప్రకారం అంతర్‌లోని రేఫ లోపించి తత్పూర్వ స్వరానికి దీర్ఘం (చూ: ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః; అష్టాధ్యాయి 6-3-111) వచ్చి 'అంతారాష్ట్రియ' అని కావలసిఉంటుంది. ఇంత అవస్థపడినా పైన నిరూపించిన విధంగా దీనికి రాష్ట్రాలమధ్య అనే అర్థం మాత్రం రాదు.

### అకస్మాత్తుగా :

సంస్కృతంలో 'అకస్మాత్' శబ్దం అవ్యయం. అవ్యయాలు ఏవో కొన్ని తప్ప సాధారణంగా తెలుగులో తత్సమాలుగా ప్రయోగింపబడవు. కాని అకస్మాత్, సాక్షాత్, హఠాత్ మొదలైన కొన్ని అవ్యయాలు అకస్మాత్తుగా, సాక్షాత్తుగా, హఠాత్తుగా ఇత్యాదిగా ప్రయోగింపబడటం కనిపిస్తుంది. వీటిని విశేషప్రయోగాలుగా గ్రహించాలి.

### అక్షింతలు-అక్షింతలు :

పెండ్లి మొదలైన శుభ కార్యాల్లో వాడే పసుపు లేక కుంకుమ కలిపిన బియ్యపు గింజలనే అర్థంలో ఈ పదాలను వాడుతున్నాం. సంస్కృతంలో ఈ అర్థంలో 'అక్షతాః' అని అంటారు. దీన్ని తెలుగులో తత్సమంగా వాడితే 'అక్షతలు' అని అనాలి. మూల పదంలో లేని అనుస్వారం, క్షకారంలోని అకారం ఇకారంగా మారడం ఈ పదాల్లో కనిపించే విలక్షణత. "సుందరి యక్షింతల బొట్టునుం బసుపు మోదం బొప్పఁ దాల్పందగున్" - అని రుక్మాంగద చరిత్రలో (4-89) అక్షింతలు అన్న శబ్దానికి ప్రయోగం కనిపిస్తుంది.

### అగణితప్రతిభాశాలి :

సుప్రసిద్ధ గణితశాస్త్రవేత్త రామానుజం గురించి ఈ శీర్షికతో ఒక వ్యాసం ప్రచురింపబడింది. వ్యాసకర్త, అగణిత ప్రతిభాశాలి అనే

పదాన్ని గణింప శక్యం కాని ప్రతిభ కలవాడు అనే అర్థంలో ప్రయోగించి ఉంటాడు. కాని, ఈ పదబంధం ఈ అర్థాన్ని ఇవ్వదు. అగణిత అంటే గణింపబడని అని అర్థం కనుక, ఈ పదానికి గణింపబడని ప్రతిభ కలవాడనే అర్థమే వస్తుంది. గణింప శక్యం కాని ప్రతిభ కలవాడనే అర్థం రాదు. ఈ అర్థంలో అగణ్యప్రతిభాశాలి అని అనడం యుక్తం. లేదా దీనికి వ్యతిరేక లక్షణచే 'గొప్పగా గణింపబడిన' అనే అర్థం చెప్పుకొని సమర్థించుకోవాలి.

## అగ్నిమాపకదళం :

అగ్ని, మాపక, దళ అనే మూడు పదాలతో ఏర్పడ్డ సమాస పదం ఇది. ఇందులో అగ్ని శబ్దం, దళ శబ్దం సంస్కృత శబ్దాలు కనుక సమాసంలో ఆ రెంటి మధ్య చేరిన మాపకశబ్దం కూడా సంస్కృత పదమే అని అనుకోవాలి. లేకపోతే దుష్ట సమాసమౌతుంది కదా! మాపకశబ్దాన్ని సంస్కృతపదంగా భావిస్తే దానికి సంస్కృతంలో 'కొలిచేది' అనే అర్థం కనుక అగ్నిమాపకదళం అన్న పదానికి అగ్నిని కొలిచే దళం అనే అర్థమే వస్తుంది కాని, అగ్నిని ఆర్పే దళం అనే అర్థం రాదు. కనుక, మాపక శబ్దాన్ని సంస్కృత పదంగా గ్రహించ కూడదన్నమాట.

ఐతే, మరీపదం ఎలా ఏర్పడినట్లు? తెలుగులో ఆర్పివేయడమనే అర్థంలో మాపు (మాయునట్లు చేయు) అనే ప్రేరణార్థక క్రియ ఉంది. దానిపై కర్త్రర్థంలో సంస్కృత పదాలపై చేర్చే ణ్వుల్ (అక) ప్రత్యయం చేర్చి, ఆర్పివేసే అనే అర్థం కలిగిన మాపక శబ్దాన్ని సృష్టి చేసి, సమాసపదంలో దూర్చినారన్నమాట. కాని, సంస్కృత ధాతువులమీద మాత్రమే చేర్చవలసిన ణ్వుల్ (అక) ప్రత్యయాన్ని 'మాపు'

అనే తెలుగు ధాతువుమీద చేర్చి 'మాపక' శబ్దాన్ని సృష్టించడమూ, దాన్ని సంస్కృత పదాల మధ్యన చేర్చి సమాసం చేయడమూ వ్యాకరణ విరుద్ధమైన అంశం.

ఏమైనా అగ్నిమాపక దళమనే శబ్దాన్ని ఇంత తెలివిగా సృష్టించి ప్రజల నాలుకలపై నర్తించే విధంగా చేసిన వ్యక్తి ప్రతిభను మెచ్చుకోవచ్చు కాని, వ్యాకరణ మెరిగిన హృదయం మాత్రం ఈ ప్రయోగాన్ని హర్షించదు.

**అధిగమించు :**

దాటడమనే అర్థంలో వాడుతున్న తత్సమక్రియ. సంస్కృతంలో అధి ఉపసర్గ పూర్వకమైన గమ్ ధాతువుకు పొందడమనే అర్థమే కాని, దాటడమనే అర్థం లేదు. కాని, తెలుగులో ఈ పదాన్ని దాటడమనే అర్థంలో వాడుతున్నాం. అతిగమించు అనే అతి ఉపసర్గ పూర్వకమైన గమ్ ధాతువుకు అతిక్రమించిపోవు, దాటు అనే అర్థాలు ఉన్నాయి. అతిగమించు అనే పదాన్నే పొరపాటున తెలుగులో అధిగమించు అని వాడుతున్నామేమో!

**అధీనం :**

అధీనమనే పదం వ్యాకరణరీత్యా సాధువే. కాని, ఆ పదం వాడుతున్న సందర్భం తప్పు. అధీనమనేది ధర్మివాచకం. వశమైనది అని అర్థం. ఇది విశేషణం. విశేషణానికి ముందెప్పుడూ షష్ఠీవిభక్తి పొసగదు. కాని, 'పోలీసుల అధీనంలో' ఇత్యాదిగా వాడుతున్నాం. దీనికి సంస్కృత నియమం ప్రకారం పోలీసులకు అధీనమైన దానిలో అనే అర్థమే వస్తుంది కాని, పోలీసుల Control లో అనే అర్థం రాదు. Control అనే అర్థం రావాలంటే 'అధీనత' అని అనాలి. అంటే-ధర్మవాచకం వాడవలసిన చోట ధర్మివాచకం వాడుతున్నామన్నమాట.

అధీన శబ్దానికే అధీనత అనే అర్థం ఉందన్న భ్రమ ఇలాంటి ప్రయోగాలకు కారణం. ఐతే, తెలుగులో కొన్ని ధర్మివాచక పదాలను ధర్మవాచకాలుగా వాడడం కనిపించే అంశమే.

**అధ్వర్యం, ఆధ్వర్యం :**

ఆధిపత్యం అనే అర్థంలో వాడబడుతున్న శబ్దాలు. అధ్వర్యు శబ్దం మీద భావార్థంలో అణ్ ప్రత్యయం వస్తే వైష్ణవం, శాంభవం, శాత్రవం మొదలైన శబ్దాల్లాగా ఆధ్వర్యవం అని ఏర్పడుతుంది. ఉకారాంత శబ్దాల మీద అణ్ ప్రత్యయం వచ్చినపుడు ఉకారం 'అవ'గా మారుతుంది కనుక. యజ్ఞంలో అధ్వర్యుడు ప్రధానుడు. అతడు చేసే పని ఆధ్వర్యవమన్నమాట. ఆధ్వర్యవమన్న మాటను వికృతం చేసి అధ్వర్యం, ఆధ్వర్యం ఇత్యాదిగా తప్పుగా ఉపయోగిస్తున్నామన్నమాట.

**అనుకూలవతి :**

అనుకూలత గలిగిన స్త్రీ అనే అర్థంలో దీన్ని వాడుతున్నాం. ఇందులో అనుకూల, వత్ అనే రెండు పదాలున్నాయి. అనుకూల శబ్దం ధర్మివాచకం కనుక దీనికి అనుకూలురు అని అర్థం వత్ శబ్దానికి కలిగిన అని అర్థం. కనుక అనుకూలవతి అంటే అనుకూలు(డు)రు కలిగిన స్త్రీ అనే అర్థమే వస్తుంది కాని, అనుకూలత కలిగిన స్త్రీ అనే అర్థం రాదు. ఈ అర్థంలో 'అనుకూల' అంటే సరిపోతుంది. ఆనుకూల్యవతి అని కూడా అనవచ్చు. మనుచరిత్రలో 'అనుకూలవతి నాదు మనసులో వర్తించు కులకాంత మదినెంత కుందునొక్కొ' (2-17) అనే పద్య పాదంలో అనుకూలవతి అనే పదం ప్రయుక్తమైంది. ఈ పదానికి 'అనుకూలగతి' అనే పాఠాంతరం ఉన్నట్లుగా పండితులు భావిస్తున్నారు.

### అనుయాయుడు :

అనుసరించేవాడనే అర్థంలో దీనికి వాడుక ఉంది. సంస్కృతంలో అనుపూర్వక యా ధాతువుపై కర్త్రర్థంలో ణిని (ఇన్) ప్రత్యయం వస్తే అనుయాయిన్ అని అవుతుంది. అనుయాయీ అనేది దీని ప్రథమైక వచన రూపం దీనికి తెలుగులో అనుయాయి అనేది తత్సమ రూపం. అనుయాయుడు అని కాదు. సంస్కృతంలో 'అనుయాయ' అనే అకారాంతరూపం ఉంటే తెలుగులో అనుయాయుడు అనే రూపం ఏర్పడ్డానికి వీలుంటుంది. కాని, సంస్కృతంలో 'అనుయాయ' అనే అకారాంత శబ్దం లేదు కనుక తెలుగులో అనుయాయుడు అనే తత్సమ రూపం యుక్తం కాదు.

### అపరిచయత్వీకరణ :

Defamiliarisation అనే ఆంగ్లపదానికి సమానార్థంగా సృష్టింపబడిన తెలుగుపదం. అపరిచయం అనే అర్థంలో అపరిచయత్వమనే పదం వాడబడింది. అపరిచయమనేది భావార్థకపదం. దానిమీద మళ్ళీ భావార్థంలో త్వప్రత్యయం రావడం వ్యాకరణ విరుద్ధం. కనుక అపరిచయీకరణ అనో అపరిచితత్వీకరణ అనో అంటే సరిపోతుంది. అపరిచయ శబ్దాన్ని పరిచయం లేనివాడనే అర్థంలో నఞ్ పూర్వక బహువ్రీహిగా భావిస్తే అది ధర్మివాచకం కావచ్చు కనుక దానిపై భావార్థంలో త్వ ప్రత్యయం చేర్చి అపరిచయత్వమనే పదాన్ని భావ వాచకంగా సాధించవచ్చు. కాని, ఈ ద్రవిడ ప్రాణాయామ పద్ధతిని ఆశ్రయించడం కన్నా సులభంగా అపరిచయీకరణ అంటేనే యుక్తంగా ఉంటుంది.

### అపురూపం :

ఆశ్చర్యం, వింత అనే అర్థాల్లో ఈ పదాన్ని వాడుతున్నాం. ఇందులోని రూపశబ్దం సంస్కృత శబ్దం. అపు అనే శబ్దం సంస్కృత

శబ్దం కాదు. తెలుగు శబ్దం కూడా కాదు. అపు శబ్దానికి అర్థమేమిటో కూడా తెలియరాదు. ఇలాంటి శబ్దం రూపశబ్దంతో సమసించడం విలక్షణంగా కనిపిస్తుంది. అపరూపమనే సంస్కృత శబ్దం అపురూపంగా మారిందనడానిక్కూడా వీలులేదు. అపరూప శబ్దానికి దుష్ట రూపమని అర్థం. మరి అపురూప శబ్దానికి వింత అని అర్థం కదా!

అపూర్వరూపమనే శబ్దం అపురూపంగా మారి ఉండవచ్చేమో!

**అభ్యంగనం :**

అభి పూర్వక అంజ్ ధాతువుపై భావార్థంలో ల్యుట్ (ఇది 'అన'గా మారుతుంది.) రాగా అభ్యంజనమనే శబ్దం ఏర్పడుతుంది. (అభి+అంజ్+అన=అభ్యంజన) కాని, వ్యవహారంలో అభ్యంగన అనే శబ్దం వినబడుతుంది. అభ్యంజన శబ్దంలోని జకారం గకారంగా మారిందన్న మాట. ఇలా జకారం గకారంగా మారాలంటే ధాతువుకు పరంగా ఘిత్తైన (ఘకారమిద్వర్ణంగా కల) ప్రత్యయం కానీ, ణ్యత్ ప్రత్యయం కానీ ఉండాలి. (చూ: చజోః కుఘిణ్ణ్యతోః, అష్టాధ్యాయి 7-3-52) ఇక్కడ అభ్యంజ్ ధాతువుకు పరంగా ఉన్న ల్యుట్ (అన) ప్రత్యయం ఘిత్తు కాదు కనుక ఇందులోని జకారం గకారంగా మారదు. కనుక అభ్యంగన అనే రూపం వ్యాకరణసమ్మతం కాదు.

అభిపూర్వక అంజ్ ధాతువుపై భావార్థంలో 'ఘ' ప్రత్యయం (భావే 3-3-18) వస్తే అప్పుడు ధాతువుకు ఘిత్తు పరంగా ఉంటుంది కనుక, ధాతువులోని జకారం గకారంగా మారి 'అభ్యంగ' అని కావచ్చు. (అభి+అంజ్+ అ>అభ్యంజ్ + అ>అభ్యంగ్ + అ= అభ్యంగ)

కనుక తలంటు అనే అర్థంలో అభ్యంజనం అని కానీ, అభ్యంగం అని కానీ వాడడం యుక్తం.

**అయిష్టం :**

సంస్కృత వ్యాకరణం ప్రకారం ఈ పదం దుష్టమైనా తెలుగు నాలుకకు బాగా ఇష్టమైన పదం. న, ఇష్ట అనే రెండు సంస్కృత పదాలతో ఏర్పడిన సమాసపదం. ఇష్టం కానిది అని దీని కర్థం. వ్యతిరేకార్థకమైన నఞ్కు అజాది పదాలతో సమాసం చేసినపుడు నఞ్లోని 'న్' లోపించి (నలోపో నఞః - అష్టాధ్యాయి 6-3-73) నకారం ఆగమంగా వస్తుంది. ఉదా: న+ఇతర>అ+ఇతర>అ+న్+ఇతర= అనితర; ఇలాగే నఞ్కు ఇష్ట శబ్దంతో సమాసం చేసినపుడు 'అనిష్టం' అనే రూపం ఏర్పడాలి. (న+ఇష్ట > అ+ఇష్ట > అ+న్+ఇష్ట = అనిష్ట) కనుక అయిష్టమనే పదం వ్యాకరణసమ్మతం కాదు.

అ+ఇష్టం అనే చోట అవర్ణం తరువాతి తాలవ్య ఇకారాన్ని ఉచ్చరించేప్పుడు యకారోచ్చారణం సహజం కనుక అయిష్టమనే రూపం ఏర్పడి ఉండవచ్చు. లేదా, తెలుగులోని యడాగమం ప్రభావం కారణం కావచ్చు. ఏమైనా సాంస్కృతిక సమాసం మధ్యలో తెలుగు దనం ప్రవేశించడం భాషాలక్షణం కాదు కదా!

**అర్ధరాత్రి :**

ఏకదేశాన్ని తెలిపే పదం పూర్వపదంగా ఉన్నపుడు రాత్రి శబ్దంపై సమాసాంతంగా అచ్ ప్రత్యయం రావాలని వ్యాకరణ నియమం. (అహస్సర్వైక దేశ సంఖ్యాత పుణ్యాచ్చ రాత్రేః-అష్టా. 5-4-87) ఈ నియమం ప్రకారం 'అర్ధరాత్ర' (అర్ధ+రాత్రి+అ=అర్ధరాత్ర) అని కావాలి. దీనికి అర్ధ రాత్రం అనేది తత్సమరూపం. అకారాంతంగా ప్రయోగించాల్సిన శబ్దాన్ని ఇకారాంతంగా ప్రయోగిస్తున్నామన్నమాట.

**అసభ్యకరంగా :**

అసభ్యంగా అనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాం. అసభ్యం కరోతీతి అసభ్యకరం అని దీని వ్యుత్పత్తి. కనుక, అసభ్యకరంగా

అంటే అసభ్యాన్ని కలిగించేదిగా అనే అర్థం వస్తుంది. అతడు అసభ్యకరంగా మాట్లాడినాడు అంటే అసభ్యాన్ని కలిగించేవిధంగా మాట్లాడినాడని భావం. అసభ్యంగా మాట్లాడడం ఉంటుంది కాని, అసభ్యాన్ని కలిగించే విధంగా మాట్లాడడం ఉండదు కదా? కనుక, అసభ్యకరంగా అనే బదులు అసభ్యంగా అనడం యుక్తం. లేదా అసభ్యతాకరంగా అని కూడా అనవచ్చు.

## అహోరాత్రులు :

రాత్రింబవళ్ళు అని అర్థం. సంస్కృతంలో అహశ్చ రాత్రిశ్చ అనే ద్వంద్వ సమాసంలో అహోరాత్రి శబ్దంపై 'అ' ప్రత్యయం వచ్చి అహోరాత్ర అని అవుతుంది. ('అహః సర్వైకదేశ సంఖ్యాతపుణ్యాచ్చ రాత్రేః' అని పాణినీయ సూత్రం. 5 4-87)దీన్ని తెలుగులో తత్సమంగా వాడినప్పుడు అహోరాత్రం - అని అకారాంతరూపమే కావాలి కాని అహోరాత్రులు/అహోరాత్రుళ్ళు అని ఇకారాంతరూపం ఏర్పడదు.

## ఆదర్శవంతం :

Model అనే అర్థంలో దీన్ని వాడుతున్నాం. ఆదర్శమంటే Model అని అర్థం కనుక ఆదర్శవంతం అంటే Model కలది అనే అర్థం వస్తుంది. 'వాని జీవితం అందరికీ ఆదర్శమైంది' అంటే సరి పోతుంది. ఆదర్శవంతమైంది అనడం యుక్తం కాదు. ఇలా అంటే ఆదర్శమైంది అనే అర్థం కాక ఆదర్శం కలది అనే అనుచితమైన అర్థం, అప్రాకరణికమైన అర్థం వస్తుంది. ఐతే, ఈ పదాన్ని ఆదర్శం-(ఆదర్శాలు) కలది అనే అర్థంలో ప్రయోగించినపుడు మాత్రం తప్పేమీ లేదు.

**ఆపేక్ష :**

కోరిక అనే అర్థంలో దీన్ని వాడుతున్నాం. సంస్కృతంలో ఈ పదాన్ని 'అపేక్షా' అని అంటారు. ఈ శబ్దంలోని తొలి అకారం దీర్ఘం కాదు కనుక తెలుగులో దీన్ని తత్సమంగా వాడేప్పుడు అపేక్ష అనే అనాలి కాని ఆపేక్ష అని అనరాదు. కాని, కొందరి వాడుకలో ఆపేక్ష అని వింటున్నాం. అపేక్ష (కోరిక) ఎక్కువైనపుడు దాన్ని వ్యక్తీక రించడం కోసం హ్రస్వం దీర్ఘమై ఉంటుందేమో!

**ఆధునీకరణం :**

Modernisation అనే అర్థంలో కొందరి వాడుకలో ఈ పదం కనిపిస్తుంది. ఇప్పుడు అనే అర్థం కలిగిన 'అధునా'శబ్దంపై సంబం ధించినదనే అర్థంలో 'కాలాట్ఠఞ్' అనే సూత్రంచేత ఠఞ్ ప్రత్యయం (ఇది ఇకగా మారుతుంది.) రాగా ఆదివృద్ధిచే ఆధునికం అని అవు తుంది. దీనికి ఇప్పటిది - ఈ కాలానికి సంబంధించింది అనే అర్థం వస్తుంది. Modern అనే విశేషణ పదానికి 'ఆధునికం' అనేది సమా నార్థకపదం కనుక Modernisation అనే అర్థంలో 'ఆధునికీకరణం' అని వాడాలి. ఆధునీకరణమని కాదు. అధునా అంటే ఇప్పుడు అని అర్థం కనుక ఆధునీకరణమనే శబ్దానికి ఇప్పుడుగా చేయడమనే అర్థమే వస్తుంది. ఇక్కడ ఉద్దిష్టమైన అర్థం ఇప్పటిదిగా చేయడమనే కాని ఇప్పుడుగా చేయడమని కాదు. కనుక ఆధునీకరణమనే బదులు ఆధునికీ కరణమని వాడడం యుక్తం. అధునా శబ్దంలోని అవర్ణానికి పరంగా వృద్ధికి కారణాలైన ప్రత్యయాలు (కిత్తు, ఞిత్తు, ణిత్తులైనవి.) లేనందు వల్ల ఆదివృద్ధిచే ఆధునం అని కావడానికి కూడా వీలు లేదు. అప్పుడు ఆధునీకరణమనే రూపం ఏర్పడదు కదా!

**ఆశీస్సు :**

ఆఙ్ పూర్వక శాస్ ధాతువుపై క్విప్ ప్రత్యయం రాగా శాస్‌లోని ఆకారానికి ఇకారం ఆదేశంగా వచ్చి ఆశిస్ అని ఏర్పడు

తుంది. (క్వౌ చ శాస ఇత్వం భవతీతి వ్యక్తవ్యమ్; వా.) ప్రథమైక వచనంలోనూ, తక్కిన హలాది విభక్తుల్లోనూ శకారంమీది ఇకారం దీర్ఘంగా మారుతుంది. ఉదా : ఆశీః, ఆశీర్భ్యామ్ మొ॥ అజాది విభక్తుల్లో హ్రస్వ ఇకారంగానే ఉంటుంది. ఉదా: ఆశిషౌ, ఆశిషః, ఆశిషమ్ మొ॥ ఐతే తెలుగులోకి ఈ శబ్దాన్ని తెచ్చుకునేప్పుడు మాత్రం ఆశిస్ అనే పదాన్నే ప్రాతిపదికగా తీసుకోవాలి. అప్పుడు తెలుగులో 'ఆశిస్సు' అనే రూపమే ఏర్పడుతుంది కాని, ఆశీస్సు అని కాదు. ఐతే, సంస్కృతంలో ప్రథమైకవచనంలో ఆశీః అని ఔతుంది కనుక ఆ రూప సాదృశ్యంతో తెలుగులో 'ఆశీస్సు' అనే దీర్ఘసహిత రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది. సూర్యరాయాంధ్ర నిఘంటువు, శబ్దరత్నాకరం 'ఆశీస్సు' అనే దీర్ఘంతో కూడిన రూపాన్నే చూపడం పరిశీలించదగిన అంశం.

### ఆసాంతం :

చివరి వరకు అనే అర్థంలో దీన్ని వాడుతున్నాం. ఈ అర్థంలో 'సాంతం' అంటేనే సరిపోతుంది. సాంతం అంటే చివరతో కూడింది అని అర్థం. అంటే మొత్తం అని భావం. సాంతం చదివినాడు, సాంతం విన్నాడు అని తెలంగాణాలో దీనికి బహుళ ప్రచారం ఉంది. సాంతం అంటేనే సరిపోతున్నప్పుడు ఆ (దీనికి వరకు అని అర్థం) అనే పదం చేర్చి ఆసాంతం అనడం అనవసరం. తప్పు కూడా. ఆసాంతం అంటే అంతంతో కూడిన దానివరకు అనే అర్థం వస్తుంది. ఈ అర్థం ఇక్కడ పొసగదు కదా!

### ఆసురీగుణాలు :

అసుర సంబంధమైన గుణాలు అని అర్థం. ఇందులో ఆసురీ శబ్దం గుణాలు అనే పదానికి విశేషణం. విశేషణ, విశేష్యాలు ఒకే

లింగంలో ప్రయోగింపబడాలని వ్యాకరణ నియమం. గుణ శబ్దం పుంలింగం కనుక దానికి విశేషణంగా వాడబడిన అసుర శబ్దం పుంలింగంలోనే ఉండాలి, ఆసురీ అని స్త్రీలింగ రూపంలో ఉండకూడదు. కనుక ఆసుర గుణాలు అని అనడం యుక్తం. చూ: దైవీ గుణాలు.

**ఆహ్వానితులు :**

ఆహ్వానింపబడ్డవారు అనే అర్థంలో వాడబడుతున్న పదం. ఆఙ్ పూర్వకమైన హూధాతువుపై కర్మణ్యర్థంలో క్త ప్రత్యయం వస్తే 'ఆహూతులు' (ఆ+హూ+త=ఆహూత) అని కావాలి. ఆహ్వానితులు అని కాదు. ఐతే, ఆహ్వానం అనే పదాన్ని తారకాది గణంలో చేర్చి 'తదస్య సంజాతమితి తారకాదిభ్య ఇతచ్' అనే సూత్రంచేత ఆహ్వాన శబ్దంపై కలవారు అనే అర్థంలో ఇతచ్ ప్రత్యయం చేర్చి (ఆహ్వాన+ఇత = ఆహ్వానిత) ఆహ్వానిత అనే రూపాన్ని స్నేహిత మొదలైన శబ్దాల మాదిరిగా సాధించుకోవచ్చు. దీనికి ఆహ్వానం కలవాళ్ళు అని అర్థం.

**ఇష్టాగోష్ఠి :**

'ఇష్టులతో గోష్ఠి' లేక 'ఇష్టమైన గోష్ఠి' అనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం. ఇందులో ఇష్ట, గోష్ఠి అనే రెండు పదాలు ఉన్నాయి. వీటికి సమాసం చేసినప్పుడు 'ఇష్టగోష్ఠి' అనే అవుతుంది కాని ఇష్టాగోష్ఠి అని కాదు. 'ఇష్టురాండ్రతో గోష్ఠి' అనే అర్థంలో మాత్రం 'ఇష్టాగోష్ఠి' సాధువే కావచ్చు. ఇష్టులతో గోష్ఠి లేదా ఇష్టమైన గోష్ఠి అనే అర్థంలోమాత్రం ఇష్టగోష్ఠి అనేదే సాధురూపం.

**ఈశాన్యం :**

పూర్వోత్తర దిశల నడిమి మూల అనే అర్థంలో ఈ పదం తెలుగుదేశ మంతటా వాడుకలో ఉన్నది. ఇది వ్యాకరణ సమ్మతం

కాని పదమంటే అందరికీ ఆశ్చర్యం కలుగవచ్చు. దిక్కులమధ్యలో ఉండే మూలలకు ఆయా దేవతావాచక శబ్దాలతో ఏర్పడిన సంస్కృత పదాలే వాడుకలో ఉన్నాయి. ఉదా:- ఆగ్నేయం (అగ్ని దేవతగా కలది), వాయవ్యం (వాయువు దేవతగా కలది), నైరృతి (నిరృతి దేవతగా కలది), ఈశాన్యం (ఈశానుడు దేవతగా కలది) ఈ అర్థాల్లో తెలుగుపదాలు వాడుకలో కనిపించవు.

ఈ పదాల్లో ఒక్క ఈశాన్య శబ్దంలో తప్ప తక్కిన అన్ని శబ్దాల్లో ఆదివృద్ధి కనిపిస్తుంది. ఈశానుడు దేవతగా గల దిక్కు అనే అర్థంలో 'సాఽస్య దేవతా' (అష్టాధ్యాయి 4-2-24) అనే సూత్రంచేత ఈశాన శబ్దంపై అణ్ ప్రత్యయం, తరువాత ఆదివృద్ధి, స్త్రీ ప్రత్యయంగా జీప్ (ఈ) వచ్చి ఐశానీ అని కావాలి. (ఈశాన+అణ్, ఐశాన+జీప్= ఐశానీ) కనుక, దీనిని తత్సమంగా వాడినప్పుడు ఐశాని అని వాడాలి. ఈశాన్యం అని కాదు.

ఐతే, వాయవ్యం అనే శబ్ద సాదృశ్యంతో ఈశాన్య శబ్దం వాడుక లోకి వచ్చి ఉంటుంది. ఉచ్చారణ సౌలభ్యం కూడా మరో కారణం కావచ్చు ఈశాన్యం అనేది వ్యాకరణ సమ్మతంకాని కారణంగానేమో శబ్ద రత్నాకరం కానీ, సూర్యరాయాంధ్ర నిఘంటువు కానీ దీన్ని పేర్కొలేదు. ఆర్య వ్యవహారదృష్టం కనుక దీన్ని నిఘంటువుల్లో పేర్కోవడం యుక్తమే.

**ఉక్రోశం :**

ఆవేశం, కోపం మొదలైన అర్థాల్లో వాడుతున్న పదం. శకారం అచ్చ తెలుగులో ఉండదు కనుక ఇది సంస్కృత పదమై ఉండాలి. కాని, సంస్కృతంలో ఈ పదం కనిపించదు. కనుక ఇది ఉత్‌పూర్వకమైన క్రుశ్ ధాతువు నుండి ఏర్పడిన 'ఉత్క్రోశ' శబ్దమన్నమాట. మొర

పెట్టడం, అరవడం అని అర్థం. ఈ పదంలో తకారాన్ని లోపింపజేసి తప్పుగా ఉక్రోశమని వాడుతున్నాం. ఒక్కొక్కసారి ఉత్క్రోశపు ఆధిక్యాన్ని ప్రకటింపజేయడానికో అన్నట్లు దీన్ని 'ఉక్రోషం' అని మూర్ధన్యషకారంతో వాడడం కూడా కనిపిస్తుంది.

గర్హించడమనే అర్థంలో ఉపక్రోశమనే శబ్దం ఉంది. 'ఉపక్రోశో జుగుప్సా చ కుత్సా నిందా చ గర్హణే' అని అమరం. (1.6.13) ఇందులోని పకారం లోపించి ఉక్రోశ అనే రూపం ఏర్పడిందేమో! అప్పుడు కోపమనే అర్థాన్ని అర్థవిపరిణామంగా భావించవచ్చు

లేదా ఆక్రోశ శబ్దసామ్యాన్నిబట్టి ఉత్క్రోశ శబ్దంలోని తకారం లోపించి 'ఉక్రోశ' అని ఏర్పడి ఉండవచ్చు.

## ఉదహరించు :

'ఉదాహరణంగా చెప్పు' అనే అర్థంలో ఈ పదం వాడబడుతుంది. ఇది ఉత్, ఆ అనే రెండు ఉపసర్గలు కల హృధాతువు నుండి ఏర్పడిన రూపం. (ఉత్+ఆ+హరించు=ఉదాహరించు) ఆ అనే ఉపసర్గ దీర్ఘం కనుక ఇందులోని దకారంమీద అకారం కాకుండా దీర్ఘ ఆకారముండడమే యుక్తం. కనుక ఉదహరించు అని కాక 'ఉదాహరించు' అని ప్రయోగించడం భాషాలక్షణం.

## ఉదారపూరిత :

ఇటీవలే ప్రచురితమైన జే. పి. ఎల్. గ్విన్ గారి 'A Telugu English Dictionary' అన్న నిఘంటువులో ఈ పదం కనిపించింది. దీనికి benovolent అనే అర్థం ఈయబడింది. సంస్కృతంలో ఉదార శబ్దం ధర్మి వాచకం. అంటే, ఔదార్యం కలవాడని అర్థం. కనుక ఉదారపూరిత అనే పదానికి ఉదారులతో కూడిన, నిండిన అనే అర్థమే

వస్తుంది కాని ఔదార్యంతో నిండిన అనే అర్థం రాదు. ఈ అర్థంలో ఔదార్యపూరిత అనేది సాధురూపం. ధర్మివాచక శబ్దాన్ని ధర్మవాచకంగా వాడడం ఈ పదంలోని దోషం.

**ఉధృతం :**

ఉత్ - ధృతం అనే రెండు పదాల కలయికవల్ల ఏర్పడిన పదం. సంధిలో ఉత్‌లోని తకారం దకారంగా మారి ఉద్ధృతం (ఉత్ + ధృతం > ఉద్ + ధృతం = ఉద్ధృతం) అనే పదం ఏర్పడుతుంది. ఉత్ + హృతం అనే పదాల కలయికవల్ల కూడా తకారం దకారంగానూ, హకారం ధకారంగానూ మారి ఉద్ధృతం అనే రూపం ఏర్పడవచ్చు. (ఉత్ + హృతం>ఉద్ + హృతం>ఉద్ + ధృతం= ఉద్ధృతమ్.) ఈ ప్రక్రియను గమనిస్తే ఈ పదాన్ని 'ఉద్ధృతం' అనే విధంగా రాయాలని స్పష్టమౌతుంది. కాని, నేటి పత్రికల్లో 'ఉధృతం' అనే అసాధురూపమే ఉద్ధృతంగా దర్శనమిస్తుంది. శబ్ద వ్యుత్పత్తి తెలియకపోవడం ఈ దోషం చేయడానికి కారణం.

**ఉపబలకం :**

సమర్థకం, అనుబంధమైన బలం అనే అర్థాల్లో బాగా వాడుకలో ఉన్న పదం. ఉపబల శబ్దంమీద కప్రత్యయం రాగా ఏర్పడిన శబ్దంగా భావించవచ్చు. సంస్కృతంలో బహువ్రీహి సమాసాల్లోనూ (వ్యూఢోరస్క మొ॥), అల్పార్థంలోనూ (వృక్షక మొ॥), స్వార్థంలోనూ (బాలక మొ॥) నామవాచకాలపై కప్రత్యయం చేరుతుంది. ఉపబలక శబ్దంలోని క ప్రత్యయాన్ని బహువ్రీహిలో వచ్చిన క ప్రత్యయంగా భావిస్తే ఉపబలం కలది అనే అర్థమే వస్తుంది కాని, 'ఉపబలమైంది' అనే అర్థం రాదు. పూర్తిగా విరుద్ధమైన అర్థం వస్తుందన్నమాట. ఉప అనే దానికే ఆల్పార్థం ఉంది కనుక మళ్ళీ ఆ అర్థంలో 'క' ప్రత్యయం

రావడం యుక్తం కాదు. స్వార్థంలో వచ్చిన కప్రత్యయంగా భావించ డానికి కొంత వీలున్నా ఉపబల మొదలైన పదాలమీద స్వార్థంలో కప్రత్యయం వచ్చిన రూపాలు భాషలో కనిపించవు. కనుక, ఉపోద్బలకమనే పదం గ్రాహ్యంగా కనిపించదు.

ఈ పదానికి సమర్థకమని అర్థం కనుక ఇందులోని ఉపోద్బల శబ్దాన్ని ధాతువుగా భ్రమించడం వల్ల సమర్థక మొదలైన శబ్దాల సాదృశ్యంతో ఈ రూపం ఏర్పడి ఉండవచ్చు. లేదా బహువ్రీహి శబ్దాల సాదృశ్యం కూడా కారణం కావచ్చు.

ఉపోద్బలక శబ్దం కూడా ఉపబలక శబ్దంలాంటిదే. ఇందులో ఉత్ అనే ఉపసర్గ అధికంగా ఉంది.

## ఉపాధ్యాయిని :

ఉపాధ్యాయురాలు అనే అర్థంలో వాడబడుతున్న పదం. ఉపాధ్యాయ శబ్దానికి స్త్రీలింగ రూపమన్నమాట. వ్యాకరణరీత్యా ఈ పదం అసాధువు కాకపోయినా మనం వాడుతున్న అర్థంలో మాత్రం అసాధువే. సంస్కృత వ్యాకరణం ప్రకారం ఈ పదానికి ఉపాధ్యాయు (డు)లు కలిగిన స్త్రీ (ఉపాధ్యా(యః) యాః అస్యాః (అస్తి) సంతి ఇతి) అనే అర్థమే వస్తుంది. ఉపాధ్యాయురాలనే అర్థం రాదు. కనుక, ఉపాధ్యాయురాలనే అర్థంలో ఈ పదం వాడడం తప్పు. సంస్కృతంలో ఉపాధ్యాయాని అనే పదం ఉంది. ఐతే, దానికి ఉపాధ్యాయుని భార్య అని అర్థం (మాతులోపాధ్యాయయో రానుగ్వా - వార్తికం) ఉపాధ్యాయు రాలని కాదు.

ఉపాధ్యాయురాలనే అర్థంలో ఉపాధ్యాయ, ఉపాధ్యాయి అనే పదాలను వాడాలి. "ఉపాధ్యాయా ప్యుపాధ్యాయీ స్యాదాచార్యాఽపి చ స్వతః" అని అమరం. (2-6-14) ఐతే, ఉపాధ్యాయి అన్న పదానికి

ఉపాధ్యాయుని భార్య అనే అర్థం కూడా వచ్చే ప్రమాదం ఉంది కనుక ఉపాధ్యాయురాలనే అర్థంలో 'ఉపాధ్యాయ' అనడం శ్రేష్ఠం.

**ఊహాలోకం :**

సంస్కృతంలో ఊహ శబ్దం అకారాంత పుంలింగమే కాని ఆకారాంత స్త్రీలింగం కాదు. 'అధ్యాహార స్తర్క ఊహః' అని అమరం. సంస్కృత సమాసంలో శబ్ద ప్రాతిపదిక రూపమే పూర్వరూపంగా నిలుస్తుంది. కనుక ఊహాలోకం అనికాక ఊహలోకం అని అనాలి. కాని వ్యవహారంలో 'ఊహాలోకం' అన్న పదం బాగా ప్రచారమైంది.

'ఊహ' అనే సంస్కృత పుంలింగ శబ్దాన్ని తెలుగులో 'ఊహ' అని స్త్రీ సమ శబ్దంగా తత్సమీకరించుకుంటాం. కనుక సమాసం చేసేప్పుడు పూర్వపదంగా ప్రయోగించాల్సిన ఊహ శబ్దాన్ని స్త్రీలింగ శబ్దంగా - అంటే ఆకారాంత శబ్దంగా ఊహించుకోవడమే 'ఊహాలోకం' అన్న ప్రయోగానికి కారణం కావచ్చు.

**ఏహ్యభావం :**

అసహ్యించుకునే లక్షణం అనే అర్థంలో వాడుకలో ఉన్న పదం. ఇందులో భావం అనేది సంస్కృతం. ఏహ్య అన్నది సంస్కృత పదం కాదు. తెలుగు పదం కూడా కాదు. ఐనా ఈ పదం ముచ్చటగా భావ శబ్దంతో ముడిపడి వ్యవహారంలోకి వచ్చింది. అసహ్య భావం అన్న పదమే క్రమంగా ఏహ్యభావంగా మారిందేమో! ఆలోచించాలి.

**ఏకాకితనం :**

ఒంటరితనం అని అర్థం. ఏకాకి అనే శబ్దంపై భావార్థంలో 'తన' ప్రత్యయం చేరి 'ఏకాకితనం' ఏర్పడింది. ఏకాకి అనేది సంస్కృత పదం. తనం అనేది తెలుగు ప్రత్యయం. ఇలా సంస్కృత పదం మీద తెలుగు ప్రత్యయం చేరడం వ్యాకరణ విరుద్ధం. ఏకాకిత,

ఏకాకిత్వం అని సంస్కృత ప్రత్యయాలు చేర్చుకుంటే సరిపోతుంది. వారసత్వం, బానిసత్వం మొదలైనచోట్ల తెలుగుపదంమీద సంస్కృత ప్రత్యయం వస్తే ఇక్కడ సంస్కృతపదం మీద తెలుగుప్రత్యయం వచ్చిందన్నమాట

## ఏకైక :

ఏకైక దినపత్రిక, ఏకైక మాసపత్రిక మొదలైనచోట్ల ఏకైక అనే పదం వినబడుతుంది. దీనిని ఒకే ఒక (మరొకటి లేదు) అనే అర్థంలో వాడుతున్నాం. కాని, సంస్కృతంలో ఏకైక అనే పదానికి ఒక్కొక్క అనే అర్థమే కాని ఒకే ఒక అనే అర్థం లేదు. 'ఏకైక మక్షరం ప్రోక్తం మహా పాతక నాశనమ్' ఇత్యాది వాక్యాల్లో ఏకైక శబ్దానికి ఒక్కొక్క అనే అర్థమే కాని ఒకేఒక అని కాదు కదా!

ఒకేఒక అనే తెలుగు పదానికి ఏకైక అనేది సమానార్థక పదంగా భావించి వాడుకలోకి తెచ్చి ఉంటారు. కాని, ఒకే అనేచోట ఉన్న అవధారణార్థం ఏకైక అనే సంస్కృతపదంలో కొరవగా ఉంది. అందువల్ల ఒకే ఒక అనే అర్థం వచ్చే వీలులేదు. కాని సంస్కృతంలో ఏకశబ్దానికి ముఖ్యమైన, ప్రధానమైన అనే అర్థంకూడా ఉంది. ఉదా:- వ్యవసాయైక జీవులు, శ్రమైక జీవులు మొ॥ ఏకైక అనే పదంలో తొలి ఏకశబ్దానికి ప్రధానమైన అనే అర్థం చెప్పుకుంటే 'ముఖ్యమైన ఒకటి' అనే అర్థం వచ్చే అవకాశం ఉంది. ముఖ్యమైన ఒకటి అనే అర్థం ఒకే ఒక అనే అర్థానికి సన్నిహితమే కదా! 'స్థితస్య గతిశ్చింతనీయా.'

## ఐక్యత :

ఏకస్య భావః ఐక్యమ్. ఏకత అని అర్థం. ఏక శబ్దం మీద భావార్థంలో ష్యఞ్ (య) ప్రత్యయం వచ్చి 'ఐక్యం' అని ఏర్పడింది. ఐక్యం అంటేనే ఏకత్వమనే అర్థం వస్తున్నప్పుడు మళ్ళీ దానిమీద భావార్థంలో తల్ (త) ప్రత్యయం చేర్చడం పునరుక్తి కనుక వ్యాకరణ

సమ్మతం కాదు. ప్రాముఖ్యత, ప్రాధాన్యత మొదలైన శబ్దాలు కూడా ఐక్యతలాంటి పదాలే.

ఐక్యం, ప్రాముఖ్యం, ప్రాధాన్యం మొదలైన పదాలు భావార్థ కాలనే స్పృహ లేకపోవడమో, త ప్రత్యయ ప్రయోగం మీద ఆసక్తో ఇటువంటి ప్రయోగాలకు కారణం కావచ్చు.

**ఔత్సాహికులు :**

ఉత్సాహం కలవాళ్ళు అనే అర్థంలో ఈ పదం ఇటీవల బాగా వాడుకలోకి వచ్చింది. ఇది ఉత్సాహ శబ్దంపై ఠక్ ప్రత్యయం (దీనికి ఇక అనేది ఆదేశంగా వస్తుంది.) రాగా ఏర్పడిన రూపం. కలవాడు అనే అర్థంలో ఉత్సాహ శబ్దంపై ఠక్ (ఇక) ప్రత్యయం రావడానికి వీలులేదు. కనుక ఉత్సాహం కలవాళ్ళు అనే అర్థంలో ఈ రూపం వ్యాకరణ సమ్మతం కాదు. దీనికి ఉత్సాహానికి సంబంధించిన వాళ్ళు అనే అర్థం రావచ్చు కాని, ఉత్సాహవంతులు అనే అర్థం రాదు. కనుక ఉత్సాహవంతులనో, ఉత్సాహులనో అనడం సబబు.

**కర్కాటకం :**

ఎండ్రికాయ అనే అర్థంలో సంస్కృతంలో వాడే పదం కర్కటకం అని. దీన్ని తెలుగులో తత్సమంగా వాడినప్పుడు కర్కటకం అనే అనాలి కాని కర్కాటకం అని అనగూడదు.

**కాంగ్రెసేతర :**

గుణసంధిచే ఏకారం రావాలి అంటే పూర్వపదం చివర అకారమూ, పరపదం తొలుత ఇకారమూ ఉండాలి. ఇక్కడ - కాంగ్రెస్+ఇతర అనే చోట పరపదం తొలుత ఇకారం ఉన్నా పూర్వపదం చివర అకారం లేదు కనుక గుణసంధిచే ఏకారం రావడానికి వీలులేదు. కాంగ్రెసేతర అని కాదు. కాంగ్రెస్ శబ్దానికి ఇతర శబ్దం చేరిస్తే కాంగ్రెసితర అని కావలసి ఉంటుంది.

ఇతర శబ్దం ఉత్తర పదంగా గల పెక్కు సమాసాల్లో సంధిచే ఏకారం వచ్చిన రూపాల సాదృశ్యంవల్ల కాంగ్రెసేతర అనే రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది. అంతేకాక ఆంగ్ల శబ్దమైన కాంగ్రెస్ శబ్దానికి సంస్కృత శబ్దమైన ఇతర శబ్దానికి సంధి పొసగదు చూ : హిందూయేతర.

**కిరాతకం :**

క్రౌర్యం, క్రూరస్వభావం అనే అర్థాల్లో వాడబడుతుంది. సంస్కృతంలో కిరాతుడంటే బోయవాడని అర్థం. స్వార్థంలో క ప్రత్యయం చేర్చిన కిరాతక శబ్దానికి కూడా బోయవాడనే అర్థమే వస్తుంది. క ప్రత్యయానికి భావార్థం లేదు కనుక, కిరాతకం అన్న పదం కిరాతుని గుణం, స్వభావం అనే అర్థాన్ని బోధించజాలదు. కనుక ఈ అర్థంలో కిరాతత్వం, కిరాతకత్వం అని ప్రయోగించాలి.

**కౌఁసల్య :**

ఈ శబ్దంలో కకారంమీది ఔకారాన్ని కొందరు అనునాసికంగా ఉచ్చరిస్తారు. ఈ ఉచ్చారణ తప్పు.

**కీకారణ్యం :**

దట్టమైన అరణ్యం అనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాం. ఇందులో కీక+అరణ్యం అని రెండు పదాలు ఉన్నట్లుగా కనిపిస్తుంది. అరణ్యమనే సంస్కృత పదానికి అడవి అని అర్థం. ఇక కీక అనే పదం ఉంది. ఇది ఏ భాషా పదమో, దీని కర్థమేమిటో తెలియదు. దట్టమైన అనే అర్థంలో వాడబడినట్లుగా కనిపిస్తుంది. ఇది సంస్కృత పదం కాకున్నా దీనికి సంస్కృత పదాల్లో మాత్రమే రావలసిన సవర్ణ దీర్ఘం రావడం విలక్షణంగా కనిపించే లక్షణం.

వైదిక సంస్కృత భాషలో కీకటారణ్యం (కీకట దేశంలోని అరణ్యం) అనేది గాఢారణ్యంగా వర్ణింపబడిందట. కాలక్రమంలో అదే గాఢారణ్యానికి పర్యాయపదంగా మారి టకారం లోపించి కీకారణ్యం అయి వుంటుందని సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు భావించి నారు. (తత్సమచంద్రిక, 343, 344 పు.)

## కుత్సితం :

'వానికి కుత్సిత మెక్కువ' ఇత్యాది వాక్యాల్లో కుత్సితభావ మనే అర్థంలో కుత్సిత శబ్దాన్ని వాడుతున్నాం. కుత్సితశబ్దం ధర్మి వాచకం. కనుక దీనికి కుత్సితుడు/కుత్సితమైంది అనే అర్థాలే రావాలి. కాని వ్యవహారంలో కుత్సితత్వం అనే భావార్థంలో వాడుక ఏర్పడింది. అంటే ధర్మివాచక శబ్దాన్ని ధర్మవాచకంగా వాడుతున్నామన్న మాట.

## కులభూషణుడు :

కులానికి భూషణమైనవాడు అనే అర్థంలో ఈ పదానికి వాడుక ఉంది. భూషణ శబ్దం అకారాంత నపుంసకలింగశబ్దం కనుక దాన్ని తత్సమంగా గ్రహించినపుడు ప్రథమైకవచనంలో 'ము'వర్ణకం వస్తే కులభూషణము అని కావాలి. కులమే భూషణంగా కలవాడు అనే బహుప్రీహి గ్రహిస్తే కులభూషణుడనే పదం సాధువు కావచ్చు కాని కులానికి భూషణమనే అర్థం రాదు. ఇతనికి కులమే భూషణమని అర్థం వస్తుంది. కులానికి భూషణమనే అర్థంలో మాత్రం కులభూషణమనే అనాలి. కులభూషణుడు అని కాదు.

కులం భూషయతీ (కులాన్ని భూషించేవాడు) అనే అర్థంలో భూషణ శబ్దాన్ని కర్త్రర్థక ల్యుట్ ప్రత్యయంగా భావిస్తే కులభూషణుడనే పదం సాధువే.

**కోటానుకోట్లు :**

కోట్లకొద్ది అనే అర్థంలో ఈ పదబంధాన్ని వాడుతున్నాం. ఇందులో కోట, అను, కోట్లు అని మూడు పదాలున్నట్లుగా కనిపిస్తుంది. ఈ పదానికి 'కోట్లను అనుసరించిన కోట్లు' అని వ్యుత్పత్తి. అంటే కోట్లకొద్ది అని భావం. దీన్నిబట్టి ఈ పదబంధంలోని మొదటి శబ్దం 'కోటి' అని ఉండాలి. అప్పుడు సంధిలో కోట్యనుకోట్లు (కోటి+అను కోట్లు= కోట్యనుకోట్లు) అని అవుతుంది కాని, కోటానుకోట్లు అని కాదు. దీనిని కోట + అను కోట్లు అని విడదీయవలసి ఉంటుంది. అప్పుడు, ఇందులోని కోట శబ్దానికి అర్థమేమీ లేదు కదా!

వేలాదివేలు, లక్షలాది జనం మొదలైన పదాల సాదృశ్యంవల్ల కోటానుకోట్లు అనే పదం వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది.

**కోపిష్ఠి :**

మిక్కిలి కోపం కలవాడనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న పదం. సంస్కృతంలో కోపం కలవాణ్ని 'కోపి' అని అంటారు. (కోపః అస్య అస్తీతి కోపీ) అతిశయార్థంలో కోపి శబ్దంపై ఇష్ఠన్ ప్రత్యయం (అతిశాయనే తమబిష్ఠనౌ" అష్టాధ్యాయి. 5-3-55) వచ్చి 'కోపిష్ఠ' అని ఔతుంది. ఇది అకారాంతం కనుక దీనికి తెలుగులో కోపిష్ఠుడు అనేది తత్సమరూపం. కోపిష్ఠి కాదు.

ఇలాగే కర్మిష్ఠ శబ్దాన్ని కూడా కర్మిష్ఠుడు అని కాక 'కర్మిష్ఠి' అని ఇకారాంతంగా వాడే అలవాటు ఉంది.

**కోమలి :**

స్త్రీ అనే అర్థంలో తెలుగు సాహిత్యంలో బాగా ప్రచురంగా వాడబడే సంస్కృత సమపదం. సంస్కృతంలో కోమలా అని ఆకారాంత శబ్దమే కాని కోమలీ అని ఈకారాంత శబ్దం లేదు. ఈకారాంత

శబ్దం వ్యాకరణ సమ్మతం కాదు. కనుక తెలుగులో 'కోమలి' అని తత్సమంగా వాడడం యుక్తం కాదు. కాని, వాగనుశాసనుడైన నన్నయ భట్టారకుడే 'కోమలి కృష్ణఁజూచి' అని సభాపర్వంలో (2-249) కోమలి అని ఈకారాంతంగా వాడినాడు.

కోమల శబ్దాన్ని పిప్పలాది గణంలో పఠించి జీప్ ప్రత్యయం చెప్పుకొని కోమలీ శబ్దాన్ని సాధిస్తే తెలుగులో కోమలి అనే రూపం ఏర్పడవచ్చు.

**చారిత్రకులు :**

దేశ చరిత్ర చదువుకున్నవాళ్ళు అనే అర్థంలో ఈ పదం బాగా వాడుకలో ఉంది. చరిత్ర అనే పదానికి 'దేశ చరిత్ర' అనే కుంచితార్థం ఇటీవల ఏర్పడింది. కనుక ప్రాచీన సంస్కృత వ్యాకరణాల్లో 'చరిత్ర చదువుకున్నవాళ్ళు' అనే అర్థంలో చరిత్ర శబ్దంపై విశేష తద్ధిత ప్రత్యయమేమీ విధించబడినట్లు కనిపించదు. ఈ అర్థంలో చారిత్రకులు, చారిత్రికులు అనే పదాలు ఇటీవలి కాలంలో ఏర్పడినవిగా భావించాలి. ఐతే చారిత్రకులు అన్న పదం వ్యాకరణ సమ్మతమా అన్నది ఆలోచించాల్సిన అంశం.

పాణినీయంలో 'తదధీతే, తద్వేద' అనే సూత్రం ఉంది. ఈ సూత్రంచే ఒక విషయాన్ని అధ్యయనం చేసినవాడు, లేక తెలుసుకున్న వాడు అనే అర్థంలో అణ్ ప్రత్యయం విధింపబడింది. ఛాందసుడు, వైయాకరణుడు, నైరుక్తుడు మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. వీటికి ఛందస్సు మొదలైనవి అధ్యయనం చేసినవాళ్లు లేక తెలిసిన వాళ్ళు అని అర్థం. దీని ప్రకారం చరిత్రను అధ్యయనం చేసినవాళ్ళు లేక ఎరిగినవాళ్లు అనే అర్థంలో ఈ సూత్రంచేత అణ్ ప్రత్యయం వచ్చి చారిత్రులు (చరిత్ర + అణ్ = చారిత్ర) అని ఏర్పడాలి.

చార్త్రకులు అనే పదం ఏర్పడాలి అంటే చరిత్రశబ్దంపై పై అర్థంలో వుఞ్ ప్రత్యయమో, వుక్ ప్రత్యయమో (ఇవి అకగా మారుతాయి) రావాలి. కాని చరిత్ర శబ్దంపై పాణినీయంలో ఈ ప్రత్యయాలు విధింపబడలేదు కనుక చార్త్రకులు అనేది వ్యాకరణ సమ్మతం కాదు.

ఐతే ఈ శబ్దాన్ని ఒకరకంగా సాధించడానికి వీలుంది. చరిత్ర శబ్దంమీద స్వార్థంలో అణ్‌ప్రత్యయం చేరితే చార్త్ర అని ఏర్పడుతుంది. దీనిపై 'క్రమాదిభ్యో వున్' అనే సూత్రంచేత వున్ ప్రత్యయం వచ్చి క్రమకః, పదకః మొదలైన పదాల్లాగా 'చార్త్రక' అనే రూపం ఏర్పడుతుంది. కాని క్రమాదిభ్యో వున్ అనే సూత్రంలోని క్రమాది గణంలో చార్త్ర శబ్దం కనిపించదు. చార్త్ర శబ్దాన్ని క్రమాదిగణంలో చేర్చుకోవడానికి ఈ గణం ఆకృతిగణంకూడా కాదు. కనుక 'చార్త్రక' అన్న శబ్దం చరిత్ర చదువుకున్నవాళ్ళు, తెలిసినవాళ్ళు అనే అర్థంలో సాధించడం కష్టమే.

కనుక 'చార్త్రకులు' అనే బదులుగా చార్త్రికులు అని వాడితే సరిపోతుంది. చార్త్రికులు అనే రూపం ఏర్పడాలి అంటే చరిత్ర శబ్దంపై ఠక్ ప్రత్యయమో, ఠఞ్ ప్రత్యయమో (ఇవి ఇకగా మారుతాయి) రావాలి కాని చరిత్ర శబ్దంపై ఈ ప్రత్యయాలు పాణినీయంలో విధింపబడినట్లు కనిపించదు. ఐతే 'ఆఖ్యానాఖ్యాయికేతిహాసపురాణేభ్యష్ఠగ్వక్తవ్యః' అనే వార్తికం చేత ఆఖ్యాన, ఆఖ్యాయిక, ఇతిహాస, పురాణ శబ్దాలపై అధ్యయనం చేసినవాళ్ళు, ఎరిగినవాళ్ళు అనే అర్థాల్లో ఠక్ ప్రత్యయం విధింపబడి వాసవదత్తికః, సౌమనోత్తరకః, ఐతిహాసికః, పౌరాణికః అనే పదాలు సాధింపబడ్డాయి. వీటిలోని ఐతిహాసిక పౌరాణిక అనే ప్రసిద్ధ శబ్దాల సాదృశ్యంతో 'చార్త్రికులు' అనే రూపాన్ని సాధించుకోవచ్చు. (చరిత్ర+ఠక్ > చరిత్ర + ఇక > చార్త్ర+ఇక>చార్త్+ఇక=చార్త్రిక.)

కనుక చార్త్రకులు అనే పదం కన్నా చార్త్రికులు అన్న పదమే వ్యాకరణ సమ్మతమని గుర్తించవచ్చు.

ఇలాగే చరిత్రకు సంబంధించింది అనే అర్థంలో చారిత్రకం అనడంకన్నా ఠక్ ప్రత్యయం (ఇది ఇకగా మారుతుంది) వచ్చిన చారిత్రికం అనడం వ్యాకరణ సమ్మతం.

**ఛిన్నాభిన్నం :**

'చెల్లాచెదరైనది' అనే అర్థంలో వాడబడుతున్న సంస్కృత శబ్దం. ఇందులో ఛిన్న, భిన్న అని రెండు శబ్దాలున్నాయి. వీటికి సమానం చేసినపుడు 'ఛిన్న భిన్న'మనే కావాలి కాని ఛిన్న శబ్దంలోని అకారానికి దీర్ఘం వచ్చి ఛిన్నాభిన్నం అని కారాదు. తత్సమ శబ్దాలను తెలుగులో వాడుకునేప్పుడు ఆ శబ్దం చివర మాత్రమే కొంత మార్పు చేసే అవకాశం ఉంటుంది కాని, పద మధ్యలో మార్పుచేసే అవకాశం ఉండదు కదా!

తెలుగులోని తునాతునకలు, పటాపంచలు, చెల్లాచెదరు మొదలైన పదాల్లోని తొలి పదం మీది దీర్ఘం సాదృశ్యం (analogy) కారణంగా 'ఛిన్నాభిన్నం' అనే రూపం ఏర్పడి ఉంటుంది.

**జగదాంబ :**

జగత్, అంబ అనేవి ఇందులోని పదాలు. వీటికి సంధి చేసినప్పుడు 'జగదంబ' అనే అవుతుంది కాని 'జగదాంబ' అని కాదు.

మాణిక్యాంబ, శారదాంబ మొదలైన అంబా శబ్దంతో కూడిన సవర్ణదీర్ఘ సంధి శబ్దాల సాదృశ్యం (analogy)తో ఈ పదం వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది.

**జయంతి :**

మరణించిన మహానుభావుల జన్మదినమనే అర్థంలో ఈ పదం బాగా వాడుకలో ఉంది.

నానార్థ నిఘంటువైన మేదినీకోశం జయంతీ శబ్దానికి వృక్ష విశేషం (తక్కిలి చెట్టు), పార్వతి, ఇంద్రసుత, పతాక అని నాలుగర్థాలు పేర్కొన్నది. (జయంతీ వృక్షభిద్గౌర్యోఃఇంద్ర పుత్రీ పతాకయోః, పర్యాయపదకోశమైన అమరకోశంలో జయంతీ శబ్దం వృక్ష విశేష వాచకంగా చూపబడింది. (జయా జయంతీ తర్కారీ నాదేయీ వైజయంతికా - వనౌషధివర్గ. 2-65.) వాచస్పత్య నిఘంటువు జయంతీ శబ్దానికి దుర్గాశక్తి, ఇంద్రసుత, పతాక, తక్కిలిచెట్టు, యాత్రాయోగ విశేషం అనే అర్థాలతోపాటు రోహిణీ నక్షత్రంతో కూడిన శ్రావణ కృష్ణాష్టమి అనే అర్థాన్ని కూడా చూపింది. ఏ కోశమూ జయంతి అనే శబ్దానికి సాక్షాత్తుగా 'జన్మదినం' అనే అర్థమున్నట్లుగా చూపలేదు. కాని లోకంలో శంకర జయంతి, నృసింహ జయంతి, గాంధీ జయంతి మొదలైన పదాల్లో జన్మదినం అనే అర్థంలో జయంతీ శబ్దానికి ప్రయోగం కనిపిస్తుంది. ఐతే ఈ శబ్దానికి కేవలం జన్మదినమని కాక అవతార పురుషుల జన్మదినం, మరణించిన మహా పురుషుల జన్మదినం అనే విశేషార్థాల్లో మాత్రమే వాడుక ఉంది.

ఐతే జయంతి అనే పదానికి జన్మదినమనే అర్థం ఎలా వచ్చిందో పరిశీలిద్దాం.

వాచస్పత్య నిఘంటువులో 'జయంతి అనే పదానికి ఇతర అర్థాలతోపాటు రోహిణీ నక్షత్రంతో కూడిన జన్మాష్టమి అనే అర్థం కూడా ఉన్నట్లుగా ముందు తెలుసుకున్నాం. దీనికి వాచస్పత్యం అనేక ప్రమాణాలు చూపింది. వాటిని దిగువ పొందుపరుస్తాను.

రోహిణీ చ యదా కృష్ణపక్షేఽష్టమ్యాం ద్విజోత్తమ
జయంతీ నామ సా ప్రోక్తా సర్వపాపహరా తిథిః.

(విష్ణుధర్మం)

శ్రావణస్య చ మాసస్య కృష్ణాష్టమ్యాం నరాధిప
రోహిణీ యది లభ్యేత జయంతీ నామ సా తిథిః
(సనత్కుమారసంహిత)

శ్రావణే వా నభస్యే వా రోహిణీసహితాష్టమీ
యదా కృష్ణా నరైర్లబ్ధా సా జయంతీతి కీర్తితా (వసిష్ఠసంహిత)

వీటి ఆధారంగా జయంతీ శబ్దానికి రోహిణీనక్షత్రంతో కూడిన కృష్ణాష్టమి అనే అర్థమే తేలుతుంది. కాని జన్మదినమనే అర్థం రాదు. కాని కృష్ణాష్టమి శ్రీకృష్ణుని జన్మదినం కావడంవల్ల రోహిణీ నక్షత్రంతో కూడిన కృష్ణాష్టమిని తెలియజేసే జయంతీ శబ్దం మహాత్ముల జన్మదిన మనే అర్థంలో వ్యాకోచాన్ని పొంది ఉండవచ్చు.

## జయంత్యోత్సవాలు :

జయంతీ+ఉత్సవాలు అనే పదాలకు సంధి చేసినప్పుడు యణా దేశం వచ్చి జయంత్యుత్సవాలు అని కావాలి. ఇందులో పరమందున్న పదం ఉత్సవాలు అని కాని ఓత్సవాలు అని కాదు కనుక సంధిలో ఓకారం రావడానికి వీలులేదు కనుక జయంత్యోత్సవాలు అనే పదం అసాధువు. పత్రికల్లో తాటికాయలంత అక్షరాలతో శీర్షికాపదంగా పత్రికా రచయితలు దీన్ని వాడడం భాషా వేత్తలకు బాధాకరమైన విషయం.

ఉత్సవశబ్దం పరంగా ఉన్నపుడు గుణ సంధి వచ్చిన మహోత్స వాలు, బ్రహ్మోత్సవాలు, రజతోత్సవాలు మొదలైన రూపాల సాదృశ్యం వల్ల ఈ రూపాన్ని కల్పించి ఉంటారు.

## జాగర్త :

జాగ్రత్త అనే అర్థంలో కొందరి వ్యవహారంలో వినబడే పదం. జాగృ (=నిద్రాక్షయే) అనే ధాతువుపై కర్త్రర్థంలో శతృ (అత్)

ప్రత్యయం వచ్చి జాగ్రత్ అని అవుతుంది. అంటే జాగరూకతతో - మెలకువతో ఉన్నవాడని అర్థం. అతనిలో ఉండే గుణం అనే అర్థంలో భావార్థక తల్ ప్రత్యయం వచ్చి జాగ్రత్త అని కావాలి. (జాగ్రత్ + త=జాగ్రత్త.) వర్ణవ్యత్యయంవల్ల జాగ్రత్త జాగర్తగా మారింది.

జాగరూకులమై ఆలోచిస్తే 'జాగ్రత్త' అనే పదం కూడా వ్యాకరణ సమ్మతంగా కనిపించదు. చూ: జాగ్రత్త.

**జాగారం :**

నిద్రపోకుండా మెలకువతో ఉండడం అనే అర్థంలో వాడుకలో ఉన్న పదం. జాగృ (=నిద్రాక్షయే) ధాతువుపై భావార్థంలో 'భావే' (అష్టాధ్యాయి. 3-3-18) అనే సూత్రంచే ఘఞ్ (అ) ప్రత్యయం రాగా ఏర్పడిన రూపంగా భావించవచ్చు. జాగృధాతువుపై ఘఞ్ ప్రత్యయం వచ్చినపుడు ఋవర్ణానికి వృద్ధి (అచో ఞ్ణితి; అష్టాధ్యాయి 7-2-115) వచ్చి 'జాగార' అనే శబ్దం ఏర్పడవచ్చు కదా అని ప్రశ్నించవచ్చు. కాని 'జాగ్రోఽవిచిణ్ణల్ ఙిత్సు' (అష్టాధ్యాయి 7-3-85) అనే సూత్రం చేత జాగృ ధాతువుకు ఞిత్తైన ప్రత్యయం పరంగా ఉన్నప్పుడు వృద్ధికి అపవాదంగా గుణం విధింపబడింది కనుక జాగృ ధాతువుపై భావార్థంలో ఘఞ్ ప్రత్యయం చేరినపుడు వృద్ధికాక గుణమే వచ్చి 'జాగరం' అనే రూపమే ఏర్పడుతుంది. జాగారం అని కాదు. అమరకోశం కూడా 'జాగర్యా జాగరో ద్వయోః' అని జాగరశబ్దాన్నే పేర్కొంది.

జాగృ ధాతువుపై భావార్థంలో అచ్ ప్రత్యయం కూడా రావచ్చు. అప్పుడు కూడా గుణమే వచ్చి 'జాగర' అనే రూపమే ఏర్పడుతుంది అంటే జాగృ ధాతువుపై ఘఞ్ ప్రత్యయం చేర్చినా, అచ్ ప్రత్యయం చేర్చినా జాగర అనే రూపమే ఏర్పడుతుందన్నమాట.

జాగృ ధాతువుపై భావార్థంలో ల్యుట్ ప్రత్యయం (ఇది 'అన'గా మారుతుంది), యక్ ప్రత్యయం కూడా రావచ్చు. ల్యుట్ ప్రత్యయం

వస్తే జాగరణమ్ అనీ, యక్ ప్రత్యయం వస్తే 'జాగర్యా'అనీ అవుతుంది.

కనుక నిద్రపోకుండా మెలకువతో ఉండడం అనే అర్థంలో జాగరం, జాగరణం, జాగర్య అని మూడు పదాలను వాడవచ్చు. 'జాగారం' అని మాత్రం ప్రయోగించరాదు.

**జాగ్రత :**

చూ : జాగ్రత్త.

**జాగ్రత్త :**

జాగృ (=నిద్రాక్షయే) అనే ధాతువుపై కర్త్రర్థంలో శతృ (అత్) ప్రత్యయం వస్తే 'జాగ్రత్' అనే పదం ఏర్పడుతుంది. దీనికి 'మెలకువతో ఉన్న' అని అర్థం. దీనిపై భావార్థంలో తల్ (త) ప్రత్యయం వచ్చి 'జాగ్రత్త' అనే రూపం ఏర్పడడానికి అవకాశం ఉన్నట్లుగా పైకి తోస్తుంది. కాని శత్రంతరూపాలపై భావార్థంలో త్వప్రత్యయంకానీ, తల్ ప్రత్యయం కానీ వచ్చిన ఉదాహరణలు భాషలో కనిపించవు. ఉదాహరణకు పఠత్, గచ్ఛత్, ధావత్ మొదలైన శత్రంతాలపై భావార్థంలో త్వప్రత్యయం వచ్చి పఠత్త్వం, గచ్ఛత్త్వం, ధావత్త్వం అని కానీ; తల్ ప్రత్యయం వచ్చి పఠత్త, గచ్ఛత్త, ధావత్త అనే రూపాలు కానీ ఏర్పడవు కదా! అంటే భావార్థక త్వ, తల్ ప్రత్యయాలు చేరడానికి శత్రంతాలకు సామర్థ్యం లేదన్నమాట. కనుక జాగ్రత్త అన్న పదం సంస్కృత వ్యాకరణ సమ్మతం కాదు.

'జాగ్రత్త' అనే పదంలోని ఒక తకారం లోపించి ఏర్పడిన 'జాగ్రత' అనే పదంకూడా వ్యాప్తిలో ఉంది. జాగ్రత్త అనే పదమే వ్యాకరణ సమ్మతం కానపుడు 'జాగ్రత' ఎలా వ్యాకరణ సమ్మతమౌతుంది?

ఐతే సంస్కృతంలో జాగృధాతువు లోట్ మధ్యమ పురుష రూపంగా 'జాగ్రత' అనే రూపం కనిపిస్తుంది (జాగృహి, జాగ్రతమ్, జాగ్రత) దీనికి మేలుకొండి అని అర్థం. ఈ క్రియారూపమే తెలుగు వాడుకలో చేరి జాగ్రత్త, జాగ్రత అనే నామవాచకాలుగా మారిందా? ఆలోచించాలి.

**జాగ్రదావస్థ :**

జాగ్రత్, అవస్థ అనేవి ఇందులోని పదాలు. వీటికి సంధి చేసినపుడు 'జాగ్రదవస్థ' అనే అవుతుంది కాని 'జాగ్రదావస్థ' అని కాదు.

బాల్యావస్థ, శైశవావస్థ మొదలైన అవస్థా శబ్దంతో కూడిన సవర్ణదీర్ఘసంధి శబ్దాల సాదృశ్యం ఈ అప్రయోగానికి కారణమై ఉంటుంది.

**జ్ఞాపకం :**

'నాకా సంగతి జ్ఞాపకం లేదు' మొదలైన వాక్యాల్లో ఈ పదాన్ని వాడుతున్నాం. ఇది సంస్కృత సమ శబ్దం. దీనికి సంస్కృతంలో జ్ఞప్తిచేసేది, స్మరింపజేసేది అని అర్థాలు. కాని తెలుగులో దీనిని 'జ్ఞప్తి' అనే అర్థంలో వాడుతున్నాం. అంటే, భావార్థక నామవాచక పదాన్ని వాడే బదులు ధర్మివాచక విశేషణపదాన్ని వాడుతున్నామన్న మాట.

**తక్షణం :**

వెంటనే అనే అర్థంలో తక్షణం అని రాయడమూ, పలకడమూ మనం చూస్తుంటాం. ఇందులో రెండు పదాలున్నాయి. అవి తత్, క్షణం అనేవి, ఈ రెండింటిని కలిపినపుడు తత్క్షణం అని కావాలి. కాని తకారం లేకుండా 'తక్షణం' అని వ్యవహారంలోకి వచ్చింది. పదం వ్యుత్పత్తి సరిగా తెలియకపోవడమో, ఉచ్చారణంలోని క్లిష్టతో ఈ పొరపాటుకు కారణం.

**తత్వం :**

స్వభావం, లక్షణం అనే అర్థాల్లో ఈ పదం వాడుతున్నాం. తస్య భావః (దాని లక్షణం) తత్త్వమ్ అని వ్యుత్పత్తి. తద్ శబ్దంపై భావార్థంలో 'త్వ' ప్రత్యయం వచ్చి ఈ రూపం ఏర్పడుతుంది. (తద్+త్వ>తత్+త్వ=తత్త్వ) తద్ శబ్దంలోని దకారం తకారంగా మారుతుంది. కనుక ఆ తకారమూ, త్వ ప్రత్యయంలోని తకారమూ రెండు తకారాలూ తత్త్వ శబ్దంలో ఉండాలి. కనుక తత్వ అని రాయడం యుక్తం కాదు. తత్త్వ అని రాయడం వ్యాకరణ సమ్మతం.

**తద్వారా :**

ఇందులో తత్, ద్వారా అనే రెండు పదాలున్నాయి. వీటిని కలిపి ఉచ్చరించినపుడు సంధిలో తత్‌లోని చివరి తకారం దకారంగా మారి తద్ద్వారా అని ఏర్పడుతుంది. తత్ శబ్దానికి సంబంధించిన దకారం, ద్వారా శబ్దానికి సంబంధించిన దకారం - ఈ రెండు దకారాలూ సంధి పదంలో వినిపించాలి, కనిపించాలి కనుక తద్వారా అని రాయడం తప్పు. తద్ద్వారా అని రాయాలి. సంస్కృత శబ్దాల వ్యుత్పత్తి తెలియకపోవడం ఈ దోషానికి కారణం.

**తరుణోపాయం :**

తరింపజేసే ఉపాయం అనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాం. తరుణ+ఉపాయం అని ఇందులో రెండు పదాలున్నాయి. తరుణ అంటే యౌవనం కల అని అర్థం. ఆ అర్థం ఇక్కడ పొసగదు కదా! కనుక ఈ పదాన్ని తరణోపాయమని వాడాలి. తరణమంటే తరింపజేసేది అని అర్థం. (తౄ=తరణే అనే ధాతువుపై కరణార్థంలో ల్యుట్ (అన) ప్రత్యయం చేరిస్తే 'తరణ' అనే రూపం ఏర్పడుతుంది.)

**తాపసి :**

తపస్వి అనే అర్థంలో పుంలింగంలో వాడుకలో ఉన్న పదం. తదస్య శీలం (అది స్వభావంగా కలవాడు) అనే అర్థంలో తపశ్శబ్దంపై అణ్ ప్రత్యయం వచ్చి ఆదివృద్ధిచే తాపస = తాపసుడు అనే రూపం ఏర్పడుతుంది. ఈ పుంలింగ రూపానికి తాపసి అనేది స్త్రీలింగరూపం. పుంలింగ శబ్దంగా తాపసి శబ్దాన్ని ప్రయోగించడం వ్యాకరణవిరుద్ధం.

**తిష్ఠ :**

తిష్ఠ వేయడం అన్న పదం తెలుగులో బాగా వాడుకలో ఉంది. ఇందులోని 'తిష్ఠ' అన్నపదం ఉనికి అన్న అర్థంలో నామవాచకంగా వాడబడినట్లు భావించవచ్చు. సంస్కృతంలో 'స్థా' (గతినివృత్తౌ) అనే ధాతువు తిష్ఠతి, అతిష్ఠత్ మొదలైన క్రియారూపాల్లో మాత్రమే 'తిష్ఠ'గా మారుతుంది. కాని విడిగా తిష్ఠ అనే రూపం ఉండదు. కాని తెలుగులో మాత్రం 'తిష్ఠ' అనే పదం వాడుకలోకి రావడం విచిత్రం గానే కనిపిస్తుంది. దీనికి ఒక్క వేయు ధాతువుతోనే ప్రయోగాలు ఉండడం గమనించదగ్గ అంశం.

**తెప్పోత్సవం :**

తెప్ప, ఉత్సవం అనే రెండు పదాల సంధిలో ఏర్పడ్డ పదం. గుణసంధిచే ఈ రూపం ఏర్పడింది. గుణసంధి సంస్కృత సంధి కనుక సంధి రావలసిన రెండు పదాలూ సంస్కృత పదాలు కావాలి. ఇక్కడ ఉత్సవం సంస్కృతపదమే ఐనా తెప్ప సంస్కృత పదం కాదు. దేశ్యపదం. ఐనా వీటికి గుణసంధి వచ్చి తెప్పోత్సవం అనే రూపం ఏర్పడడం విశేషం.

ఉత్సవ శబ్దం పరంగా ఉన్నప్పుడు సమాసంలో గుణసంధి వచ్చిన బ్రహ్మోత్సవం, నిత్యోత్సవం, మహోత్సవం మొదలైన పదాల సాదృశ్యంవల్ల ఈ రూపం ఏర్పడి ఉంటుంది.

ఇలాంటివే జన వ్యవహారంలో మరెన్నో కనిపిస్తున్నాయి. ఉదా :- విత్తనోత్పత్తి మొ॥

## తెలుగువెలుగుల మూర్తినిక్షిప్త ప్రాంగణం :

హైదరాబాద్‌లో టాంక్‌బండ్ పైన ప్రతిష్ఠించిన తెలుగు వెలుగు మూర్తుల ప్రాంగణానికి 'తెలుగువెలుగుల మూర్తి నిక్షిప్త ప్రాంగణం' అని నామకరణం చేసినారు. ఇందులో తెలుగు వెలుగులు అనేది ఒక సమాసం. ఇది తెలుగు సమాసం. మూర్తి నిక్షిప్త ప్రాంగణం అనేది సంస్కృత సమాసం. మూర్తి నిక్షిప్త ప్రాంగణం అనే సమాసానికి సంస్కృత భాషా నియమాల ప్రకారం మూర్తులచే ఉంచబడిన ప్రాంగణం అనే అర్థం వస్తుంది. అంటే మూర్తులే ఏదో ఒక వస్తువును ప్రాంగణంలో ఉంచినారని తాత్పర్యమన్నమాట. మూర్తులే ఉంచబడి నవి కాని మూర్తులు దేనినీ ఉంచలేదు కదా! ఇక్కడ మూర్తులు ఉంచ బడిన ప్రాంగణం అనే అర్థం రావాలి. కనుక దీన్ని 'నిక్షిప్తమూర్తి ప్రాంగణం' అని అనవలసి ఉంటుంది. అప్పుడు ఉంచబడిన మూర్తులు గల ప్రాంగణం అనే అర్థం వస్తుంది. అంటే మూర్తులను ప్రతిష్ఠించిన ప్రాంగణం అని భావం. ఇలా చెప్పుకుంటే అర్థం కొంతవరకు కుదిరినా మళ్ళీ ఈ పదానికి 'తెలుగువెలుగుల' అనే పదంతో అన్వయం కుదు రదు. కనుక నిక్షిప్త పదాన్ని తొలగించి 'తెలుగువెలుగుల మూర్తి ప్రాంగణం' అని అంటే ఏ చిక్కూ ఉండదు.

## తేజోవంతుడు :

తేజస్సుకలవాడని అర్థం. తేజస్ శబ్దం మీద మతుప్ ప్రత్యయం (తేజస్+మత్), మకారానికి వకారాదేశం (తేజస్+వత్), తేజస్ శబ్దం

లోని పదాంత సకారానికి రుత్వం (తేజర్+వత్), రుత్వానికి ఉకారాదేశం (తేజ+ఉ+వత్), గుణాదేశం (తేజో+వత్) రాగా 'తేజోవత్' అనే రూపం ఏర్పడాలి అప్పుడు కాని దీనికి తెలుగులో తేజోవంతుడనే తత్సమరూపం ఏర్పడదు.

ఈ శబ్ద సాధుత్వాన్ని గురించి పరిశీలిద్దాం. తేజస్ శబ్దంలోని సకారం పదాంతమైన వర్ణమైనపుడే దానికి రుత్వం వస్తుంది. రుత్వం వస్తేనే దానికి ఉకారాదేశమూ, తదుపరి గుణమూ వచ్చి తేజోవంతుడని కావడానికి వీలుంది. కాని 'తసౌ మత్వర్థే' (అష్టాధ్యాయి 1-4-19) అనే సూత్రం చేత మత్వర్థమైన ప్రత్యయం పరంగా ఉన్నపుడు తకారాంత, సకారాంత శబ్దాలు భసంజ్ఞకాలౌతాయి. తేజస్+వత్ అనేచోట మతుప్ ప్రత్యయం పరంగా ఉన్నది కనుక సకారాంతమైన తేజశ్శబ్దం భసంజ్ఞక మౌతుంది భసంజ్ఞ పద సంజ్ఞకు బాధకం కనుక తేజశ్శబ్దానికి పద సంజ్ఞ ఉండదు. తేజస్ శబ్దంలోని సకారం పదాంతం కాదు. కనుక తన్నిమిత్తకమైన రుత్వాదేశమూ, తన్నిమిత్తక ఉకారాదేశమూ, గుణమూ రావు. కనుక తేజోవంతుడనే రూపం ఏర్పడడానికి వీలులేదు. తేజస్వి, యశస్వి మొదలైన పదాల మాదిరిగా తేజస్వంతుడనే అనాలి. తేజోవంతుడని అనరాదు.

## దత్తపది :

అవధానంలోని ఒక అంశాన్ని 'దత్తపది' అని అంటారు. దత్తాని పదాని యస్యాం (సమస్యాయాం) అని దీనికి విగ్రహ వాక్యం ఏ సమస్యలో పదాలు ఈయబడతాయో ఆ సమస్య దత్తపది అని భావం. ఇది స్త్రీలింగంలో జీప్ ప్రత్యయం చేరిన బహువ్రీహి సమాస రూపం.

దత్తపద అనే బహువ్రీహి సమాసంపై స్త్రీలింగంలో టాప్ (ఆ) ప్రత్యయమే రావాలి కాని జీప్ (ఈ) ప్రత్యయము రావడానికి వీలు

లేదు. టాప్ (ఆ) ప్రత్యయం వచ్చినపుడు 'దత్తపదా' (దత్తపద) అని కావాలి. దత్తపదీ (దత్తపది) అని కాదు.

## దత్తభాష :

ఇది భాషా శాస్త్రంలో వాడుకలో ఉన్న పదం. ఒక భాషలోంచి మరో భాషలోకి పదాలను తీసుకోవడం సర్వసాధారణం. ఈ సందర్భంలో పదాలను తీసుకున్న భాషను ఆంగ్లంలో **borrowing language** అని, ఇచ్చిన భాషను donor **language** అనీ అంటారు. ఇచ్చిన భాష అనే అర్థంలో ఒక భాషా శాస్త్ర గ్రంథంలో 'దత్తభాష' అనే పదం ప్రయోగింపబడింది. దత్తభాష అంటే ఈయబడిన భాష అంటే - తీసుకున్న భాష అనే అర్థమే వస్తుంది కాని ఇచ్చిన భాష అనే అర్థం రాదు. కనుక ఇచ్చిన భాష అనే అర్థంలో దత్తభాష అని ప్రయోగించడం యుక్తం కాదు.

## దర్శని/దర్శిని :

'చూపించేది' అనే అర్థంలో వీటిని వాడుతుంటాం. ఈ రెండు పదాల్లో ఏది సాధువు, ఏది అసాధువు అని సందేహం వస్తూ ఉంటుంది. కనుక ఈ రెండు పదాలను గూర్చి పరిశీలిద్దాం.

ప్రేరణార్థక దృశ్ ధాతువుపై కర్త్రర్థంలో ణిని (ఇన్) ప్రత్యయం వస్తే దర్శిన్ అని అవుతుంది. (దృశ్ + ఇన్ > దర్శిన్) దీనికి పుంలింగంలో దర్శీ అని, స్త్రీ లింగంలో దర్శినీ అనే రూపాలు ఏర్పడతాయి. ఐతే దృశ్ ధాతువుపై కర్త్రర్థంలో ణిని ప్రత్యయం రావాలి అంటే ఈ ధాతువు గ్రహ్యాదుల్లో చేరాలి. అప్పుడే 'నంది గ్రహిపచాదిభ్యో ల్యుణిన్యచః' (అష్టాధ్యాయి 3-1-134) అనే సూత్రంచేత ణిని ప్రత్యయం వస్తుంది. గ్రహ్యాదుల్లో దృశ్ ధాతువు కనిపించదు. కాని వ్యవహారంలోని ప్రయోగాలను బట్టి దృశ్ ధాతువును గ్రహ్యాదుల్లో చేర్చుకుంటే సరిపోతుంది. అప్పుడు ప్రేరణార్థకమైన దృశ్ ధాతువుపై

ణిని ప్రత్యయం వస్తే దర్శిన్ అని అవుతుంది. దీనికి స్త్రీలింగంలో జీప్ (ఈ) ప్రత్యయం వచ్చి దర్శినీ కావచ్చు. దర్శయతీతి దర్శినీ అని వ్యుత్పత్తినిబట్టి దీనికి చూపించేది అనే అర్థం వస్తుంది.

ప్రేరణార్థకమైన దృశ్ ధాతువుపై కాక కేవల దృశ్ ధాతువుపై కూడ ణిని ప్రత్యయం వచ్చి 'దర్శినీ' అనే రూపం ఏర్పడవచ్చు. ఐతే దానికి చూపించేది అని కాక చూచేది అనే అర్థం వస్తుంది.

ఇక దర్శని అనే పదం గురించి ఆలోచిద్దాం. పాణినీయంలో 'కరణాధికరణయోశ్చ' (3-3-117) అనే ఒక సూత్రం ఉంది. ఈ సూత్రంచేత కరణార్థంలోనూ, అధికరణార్థంలోనూ ధాతువుపై ల్యుట్ ప్రత్యయం (ఇది 'అన'గా మారుతుంది) విధింపబడుతుంది. దృశ్యతే అనేన (దీనిచే చూడబడుతుంది) అనే అర్థంలో దృశ్ ధాతువుపై కరణార్థంలో ల్యుట్ (అన) ప్రత్యయం వస్తే 'దర్శన' అని అవుతుంది.

ల్యుట్ ప్రత్యయం టిత్తు కనుక స్త్రీలింగంలో జీప్ (ఈ) ప్రత్యయం వచ్చి 'దర్శనీ' అనే రూపం ఏర్పడుతుంది. (దృశ్+ల్యుట్>దృశ్+అన = దర్శన+ఈ>దర్శనీ) ఇది కరణార్థంలో వచ్చిన ల్యుట్ ప్రత్యయంచే ఏర్పడిన రూపం కనుక దీనికి కూడా చూపించేది అనే అర్థం వస్తుంది.

కనుక చూపించేది, దర్శింపజేసేది అనే అర్థంలో దర్శని, దర్శిని అనే రెండు రూపాలు కూడా సాధువులే అని భావించవచ్చు. చూచేది అనే అర్థంలో మాత్రం 'దర్శిని' అనేదే సాధువు.

## దళాల సమాయత్తం :

దళాలు సమాయత్తమైనాయి అనే అర్థంలో 'దళాల సమాయత్తం' అని ప్రయోగించడం ఇటీవలి పత్రికాభాషలో వినబడుతుంది. సమాయత్తం అనే ధర్మివాచకం వాడితే దళాలు సమాయత్తం అని

అనాలి. సమాయత్తం అనేది ధర్మివాచకం కనుక దానికి ముందు ప్రథమా విభక్తిరూపమే కాని షష్ఠ్యంతమైన పదం ఉండరాదు కనుక. దళాల అనే షష్ఠ్యంత పదమే వాడితే 'దళాల సమాయత్తత' అని అనాలి. షష్ఠ్యంతం తరువాత ధర్మవాచక పదమే వాడాలి కనుక.

ఇట్లాగే గ్రామాల దగ్ధం, దేశాల విచ్ఛినం మొదలైన ప్రయోగాలు కూడా భాషామర్యాదకు విరుద్ధమైన ప్రయోగాలు.

**దారుఢ్యం :**

దృఢ శబ్దం మీద భావార్థంలో ష్యఞ్ (య) ప్రత్యయం వస్తే ఆది వృద్ధిచే దార్ఢ్యం అనే పదం ఏర్పడుతుంది. (దృఢ+య> దృఢ్+య>దార్ఢ్+య=దార్ఢ్య) రేఫమీద ఉకారం చేర్చి దారుఢ్యం అనడం పొరపాటు.

ఉచ్చారణ సౌలభ్యం కొరకు ఉకారం చేర్చడం జరిగిందన్న మాట.

**దీక్షాబద్ధుడు :**

దీక్షను గ్రహించినవాడు అనే అర్థంలో ఈ ప్రయోగం కనిపిస్తుంది. ఈ అర్థాన్ని సంస్కృతంలో సమాసంలో చెప్పాలంటే, గ్రహింపబడిన దీక్ష కలవాడు అనే రీతిగా బహువ్రీహి సమాసంలోనే చెప్పవలసి ఉంటుంది. ఐతే, బహువ్రీహి సమాసంలో క్త, క్తవతు ప్రత్యయాంత రూపాలు ముందుండాలని నియమం ఉంది కనుక 'బద్ధ' అనే క్త ప్రత్యయాంతరూపాన్ని ముందు ప్రయోగించి 'బద్ధదీక్షుడు' అనడం యుక్తం. దీక్షాబద్ధుడు అని అనరాదు. అలాగే బద్ధకంకణుడు అని అనాలి కాని కంకణబద్ధుడు అని అనగూడదు.

ఐతే, పాణినీయంలో 'వాహితాగ్న్యాదిషు' (2-2-37) అనే సూత్రం ఉంది. బహువ్రీహి సమాసాల్లో క్త, క్తవతు ప్రత్యయాంత

రూపాలనే ముందు ప్రయోగించాలనే నియమం ఉన్నా, ఆహితాగ్ని మొదలైన కొన్ని పదాల్లో సమాసగతపదాల్లో దేన్నైనా ముందు ప్రయోగించవచ్చునని ఈ సూత్రం తెలుపుతుంది. దీన్నిబట్టి ఆహితాగ్నిః, అగ్న్యాహితః ఇత్యాదిగా రెండు పదాలనూ ప్రయోగించవచ్చు. ఆహితాగ్ని గణం ఆకృతి గణం కనుక బద్ధ దీక్ష, బద్ధ కంకణ మొదలైన పదాలను కూడా ఈ గణంలో చేర్చుకోవచ్చు. కనుక బద్ధదీక్షుడు, దీక్షాబద్ధుడు, బద్ధకంకణుడు, కంకణబద్ధుడు ఇత్యాదిగా రెండేసి రూపాలను సాధించుకోవచ్చు.

ఈ విధంగా సాధించుకునే అవకాశం ఉన్నా దీక్షాబద్ధుడు, కంకణబద్ధుడు అనే పదాలు వినగానే దీక్షచే బద్ధుడైనవాడు, కంకణంచే బద్ధుడైనవాడు అనే తృతీయాసమాసార్థమే స్ఫురించే అవకాశం ఉంది కనుక నిస్సందిగ్ధతకోసం బద్ధదీక్షుడు, బద్ధకంకణుడు అని ప్రయోగించడమే యుక్తం.

## దీర్ఘ కాలిక :

దీర్ఘ కాలంలో ఉన్న అనే అర్థంలో వాడబడుతున్న పదం. తత్ర భవః (అక్కడ ఉన్నది) అనే అర్థంలో దీర్ఘకాల శబ్దంపై కాలాట్ఠఞ్ అనే సూత్రంచేత ఠఞ్ ప్రత్యయం (ఇది ఇకగా మారుతుంది.) రాగా ఈ రూపం ఏర్పడాలి. కాని ఠఞ్ ప్రత్యయం దీర్ఘ కాల శబ్దం మీద వచ్చింది కనుక దీర్ఘకాల శబ్దంలో దీ లోని ఈకారానికి ఆదివృద్ధి వచ్చి దైర్ఘకాలిక అని కావాలి. దీర్ఘ కాలిక అని ఆదివృద్ధి రాని రూపం వ్యాకరణసమ్మతం కాదు.

ఐతే దీర్ఘ కాల శబ్దంపై కాక కాల శబ్దంపై ఠఞ్ (ఇక) ప్రత్యయమూ, ఆదివృద్ధీ వచ్చి 'కాలిక' అనే రూపం సాధించుకొని దానికి దీర్ఘ శబ్దాన్ని చేర్చుకుంటే 'దీర్ఘకాలిక' శబ్దం సాధువే కదా అనే ప్రశ్న రావచ్చు. కాని దీర్ఘ శబ్దానికి తద్ధితార్థం చేరని కేవల

కాల శబ్దంతోనే అన్వయం కాని తద్ధితార్థ సహితమైన కాలిక శబ్దంతో కాదు. కనుక దీర్ఘకాల శబ్దంపైనే తద్ధితప్రత్యయం.

## దీర్ఘాయుష్మంతుడు :

దీర్ఘాయుస్ శబ్దంపై కలవాడనే అర్థంలో మతుప్ ప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. దీర్ఘాయుస్సు కలవాడని అర్థం - "న కర్మ ధారయాన్మత్వర్థీయః" అనే వ్యాకరణ నియమం ప్రకారం కర్మధారయ సమాసంపై మత్వర్థంలో (కలవాడు, కలది అనే అర్థంలో) ఏ ప్రత్యయమూ రాగూడదు దీర్ఘాయుస్సు అనేది కర్మధారయం కనుక దీనిపై కలవాడనే అర్థంలో మతుప్ ప్రత్యయం రాకూడదు. కనుక దీర్ఘాయుష్మంతుడనే రూపం వ్యాకరణ సమ్మతం కాదు. దీర్ఘాయుష్కుడనే బహువ్రీహి పదమే వ్యాకరణ సమ్మతం. కాని, కర్మధారయంపై మత్వర్థీయ ప్రత్యయాలు వచ్చిన సుకేశీ, హిరణ్యకేశీ మొదలైన ప్రయోగాలు కొన్ని మహాభాష్యంలో కూడా కనిపిస్తున్నాయి. కనుక 'న కర్మధారయాన్మత్వర్థీయః' అనే నియమం అనిత్యంగా భావిస్తే దీర్ఘాయుష్మంతుడు అనే పదాన్ని సాధించుకోవచ్చు.

## దురదృష్టకరం :

'అతడు ఈవిధంగా ప్రవర్తించడం దురదృష్టకరం' మొదలైన వాక్యాల్లో ఈ పదాన్ని వాడుతున్నాం. ఆంగ్లంలోని unfortunate అన్న పదానికి సమానార్థకంగా వాడబడుతున్న సంస్కృతసమ పదం. ఈ పదానికి దురదృష్టాన్ని కలిగించేది అని అర్థం. ఈ విధంగా ప్రవర్తించడం దురదృష్టకరం అంటే ఆ ప్రవర్తన దురదృష్టాన్ని కలిగించేది అనే అర్థం వస్తుంది. ప్రవర్తన దురదృష్ట ఫలితం కావచ్చు కాని అది దురదృష్టాన్ని కలిగించదు కదా! కనుక దురదృష్టకరం అనే పదం వ్యాకరణరీత్యా సమ్మతమైన పదమే ఐనా మనం వాడుతున్న అర్థంలో ఇది సముచితం కాదని చెప్పవచ్చు.

## దురలవాటు :

కేవల సంస్కృత శబ్దం-అంటే తత్సమంగా మారని సంస్కృత శబ్దం అచ్చిక శబ్దంతో సమసించడం వ్యాకరణ నియమ విరుద్ధం. ఇలా ఏర్పడిన సమాసాలను వైయాకరణులు వైరి సమాసాలని పేర్కొన్నారు. దుర్ అనే కేవల సంస్కృత శబ్దం అలవాటు అనే అచ్చిక పదంతో సమసించింది కనుక ఇది వైరి సమాసం. దురభ్యాసాలు అంటే ఈ వైరి సమాసదోషం పోతుంది.

## దురాకృత్యం :

చెడ్డ పని అనే అర్థంలో ఈ పదం ఇటీవలి వాడుకలో వినిపిస్తుంది. ఇందులో దుర్, ఆ, కృత్య అనే మూడు పదాలు ఉన్నాయి. ఇందులోని 'ఆ' అనే పదానికి ప్రత్యేకించి అర్థమేమీ లేదు. అందువల్ల దుష్కృత్యం అంటే సరిపోతుంది.

'దురాగతం' అనే పదసామ్యంవల్ల దురాకృత్యం అనే పదంలో 'ఆ' చేరి ఉంటుంది.

## దురాగతం :

దుష్కృత్యం అనే అర్థంలో వాడుకలో ఉన్న పదం. ఇందులో దుర్, ఆ, గతం అనే మూడు పదాలు ఉన్నాయి. ఆగతమంటే ఆగమనమని అర్థం. కనుక దురాగతం అనే పదానికి 'చెడురాక' అనే అర్థం రావడానికి వీలుంది. స్వాగతం అన్న పదానికి ఇది విరుద్ధపదమన్నమాట. ఐతే తెలుగువాళ్ళ వ్యవహారంలో ఈ పదానికి దుష్కృత్యమనే అర్థం ఎలా వచ్చిందో ఆలోచించదగ్గ అంశం.

## దుర్భేద్యం/దుర్గ్రాహ్యం :

కష్టంగా భేదించదగింది అనే అర్థంలో దీన్ని వాడుతున్నాం. భేదించదగింది అనే అర్థంలో భేద్యం అనే రూపమేర్పడుతుంది. భిద్

ధాతువుకు ఈషత్, దుస్, సు అనే ఉపసర్గలు పరంగా ఉన్నపుడు మాత్రం యత్ ప్రత్యయం కాక ఖల్ (అ) ప్రత్యయం వచ్చి ఈషద్భేదం, సుభేదం, దుర్భేదం అనే రూపాలు ఏర్పడుతాయి. (చూ : ఈషద్దుస్సుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖల్ - అష్టాధ్యాయి. 3-3-126) ఈషత్, దుస్, సు అనే వాటికి పరమందున్న ధాతువుకు కష్టమైనది, సులభమైనది అనే అర్థాల్లో ఖల్ ప్రత్యయం వస్తుంది. కనుక దుర్భేద్యమన్న శబ్దం వ్యాకరణ విరుద్ధం ఇట్లే దుర్గ్రాహ్యం, సుగ్రాహ్యం అనే పదాలు కూడా వ్యాకరణ విరుద్ధాలే. వీటికి దుర్గ్రాహం, సుగ్రాహం అనేవి సాధురూపాలు.

## దుర్వాసముని :

ఇది దుర్వాసస్, ముని అనే రెండు సంస్కృత శబ్దాలతో ఏర్పడిన సిద్ధ సాంస్కృతిక సమాసం. దుర్వాసస్ అనేది సకారాంత శబ్దం. దీనికి ముని శబ్దాన్ని చేర్చినపుడు సంధిలో 'దుర్వాసోముని' అని కావాలి. (దుర్వాసస్+ముని, దుర్వాసర్+ముని, దుర్వాస+ఉ+ముని=దుర్వాసోముని) సకారాంత శబ్దాలకు నాదాక్షరాలు పరంగా ఉన్నప్పుడు ఈ విధంగా సంధిలో ఓకారం రావడం మనోవేగం, శిరోవేదన, నభోమార్గం మొదలైన పదాల్లో కనిపిస్తుంది కదా!

ఐతే దుర్వాసస్ శబ్దం సకారాంతం కాక అకారాంత శబ్దమనే భ్రమ 'దుర్వాసముని' అనే దుస్సంధిరూపానికి కారణం.

## దృశ్యశ్రవణ విధానం :

ఇందులోని దృశ్యశ్రవణ శబ్దం Audio - visual అన్న ఆంగ్ల పదానికి సమానార్థకంగా తెలుగులో వాడుతున్న సంస్కృత సమపదం. దృశ్యమంటే దర్శించడానికి యోగ్యమైంది అనీ, శ్రవణం అంటే వినడం అనీ అర్థం. Audio - visual అన్న పదానికి 'using simultaneously both seeing and hearfng' అని నిఘంటువు అర్థం

చూపుతుంది. ఆంగ్ల పదంలో ఉన్నట్లుగా 'దృశ్యశ్రవణ' అనే పదంలో ఏకరూపత కనిపించదు. కనుక 'దృశ్యశ్రవ్య విధాన'మనో లేదా 'దర్శన శ్రవణ విధాన'మనో వాడితే సరిపోతుంది. అప్పుడు రెండు పదాలకూ సారూప్యం ఉండి ప్రయోగానికి నిర్దుష్టత ఏర్పడుతుంది.

## దేవాదాయ :

దేవాదాయశాఖ మొదలైన పదాల్లో దేవాదాయ అనే పదం వినబడుతుంది. దేవ+ఆదాయ అనే పదాలతో ఏర్పడిన పదం కనుక దీనికి దేవుని ఆదాయమనే అర్థం వస్తుంది. కాని, వాస్తవంగా ఇది దేవాదాయ శబ్దం కాదు. దేవదాయ శబ్దం. దేవదాయమంటే దేవునికిచ్చేధనం అని అర్థం. కనుక దేవాదాయశబ్దం కన్నా దేవదాయశబ్దమే యుక్తంగా కనిపిస్తుంది. ఇట్లే ధర్మాదాయ శబ్దంకూడా వాడుకలో ఉంది. దీని సరియైన రూపం ధర్మదాయ అని. ధర్మకార్యాలకోసం ఈయబడే ధనమని దీనికర్థం.

## దేశవిచ్ఛిన్నం :

ఇది దేశ విచ్ఛిన్నానికి దారి తీస్తుంది మొదలైన ప్రయోగాలు ఇటీవలి పత్రికా భాషలో ఎక్కువగా కనిపిస్తున్నాయి. విచ్ఛిన్నం అనేది ధర్మివాచకం. విచ్ఛిన్నమైనదని దీనికర్థం. విచ్ఛిన్నత అనేది ధర్మవాచకం. ధర్మివాచకమైన విచ్ఛిన్న శబ్దం విశేషణం. ధర్మవాచకమైన విచ్ఛిన్నతా శబ్దం విశేష్యం. షష్ఠ్యంతమైన పదానికి ధర్మివాచకపదంతో సమాసం చేయకూడదు. ధర్మవాచకంతోనే సమాసం చేయాలి. కనుక షష్ఠ్యంతానికి ధర్మివాచకంతో సమాసం చేసిన దేశవిచ్ఛిన్నమనే పదం వ్యాకరణ సమ్మతం కాదు. దేశవిచ్ఛిన్నతకు అనో లేదా దేశవిచ్ఛిత్తికి అనో అంటే వ్యాకరణదోషం ఉండదు.

విచ్ఛిన్నం అనే ధర్మివాచక పదానికి విచ్ఛిన్నత అనే అర్థం ఉందనే భ్రమే ఈ విధమైన వాడుకకు కారణం.

'దేశ విచ్ఛిన్నం' అనే పదంలాగానే దళాల సమాయత్తం, గ్రామాల దగ్ధం మొదలైన అనేక అసాధురూపాలు నేటి పత్రికల్లో ధారాళంగా వాడబడుతూ జిజ్ఞాసువులను తప్పుదారి పట్టిస్తున్నాయి. దళాలు సమాయత్తం కావడం, గ్రామాలు దగ్ధం కావడం అనే ప్రయోగాలు ఉంటాయి కాని, దళాల సమాయత్తం, గ్రామాల దగ్ధం మొదలైన ప్రయోగాలు ఉండవు. ఇలాంటి ప్రయోగాలను మానడం మంచిది.

## దైవీగుణాలు :

దేవ సంబంధమైన గుణాలు అని అర్థం. ఇందులో దైవీ శబ్దం గుణ శబ్దానికి విశేషణం. విశేషణ విశేష్యాలు ఒకే లింగంలో ప్రయోగింపబడాలనేది వ్యాకరణ నియమం. గుణ శబ్దం పుంలింగం కనుక దానికి వాడబడిన దైవీ శబ్దం కూడా పుంలింగంలోనే ఉండాలి కాని, దైవీ అని స్త్రీలింగ రూపంలో ఉండకూడదు. కనుక దైవ గుణాలు అనడం యుక్తం. చూ: ఆసురీగుణాలు.

## ద్యోతకమవుతుంది :

ప్రామాణిక గ్రంథాల్లో కూడా ఈ పదాల్ని ధారాళంగా వాడుతున్నారు. ప్రయోక్తల ఉద్దేశంలో దీనికి ప్రకటితమౌతుంది అని అర్థం. కాని 'ద్యోతకం' అనే పదానికి ప్రకటితం అనే అర్థంలేదు. ప్రకటించేది (తెలియజేసేది) అనే అర్థం. కనుక 'ఈ విషయం ద్యోతకమవుతుంది' మొదలైన ప్రయోగాల్లో ఈ విషయం ఫలానా అంశాన్ని తెలియజేస్తుందనే అర్థమే రావాలి కాని, ఫలానా అంశం ప్రకటితమౌతుంది అనే అర్థం రాకూడదు. రాదు కూడా. కనుక ఇలాంటి చోట్ల ద్యోతకమవుతుంది అనే బదులు ద్యోతితమవుతుంది అని ప్రయోగించడం భాషాధర్మం. వ్యాకరణరీత్యా ద్యోతకమనే పదం మాత్రం తప్పుకాదు. 'ప్రకటితం' అనే అర్థంలో వాడడం మాత్రమే తప్పని గ్రహించాలి.

**ధారావాహికం :**

'సీరియల్' అనే అర్థంలో కల్పించుకున్న పదం. వాహక శబ్దానికి వాహిక అనేది స్త్రీలింగ రూపం. స్త్రీలింగ రూపాల మీద అమహన్నపుంసకాల మీద చేర్చే ము ప్రత్యయం రాకూడదు. కనుక 'ధారావాహికం' అనడం వ్యాకరణ విరుద్ధం. 'ధారావాహిక' అనాలి. ము ప్రత్యయం చేర్చి ప్రయోగించదలచుకుంటే 'ధారావాహకం' అని అనాలి.

**ధ్యాస :**

ఏకాగ్రత, ఆలోచన, నిష్ఠ అనే అర్థాల్లో ఈ పదం వాడుతున్నాం. ఇందులో మహాప్రాణాక్షరం ఉండడంవల్ల దీన్ని సంస్కృత పదంగా ఊహించే అవకాశం ఉంది. ఐతే సంస్కృతంలో 'ధ్యాస' అనే పదం కనిపించదు.

ఐతే, ఈ పదం తెలుగులోకి ఎలా వచ్చిందో పరిశీలిద్దాం. సంస్కృతంలో 'ధ్యై చింతాయామ్' అనే ధాతువుంది. దీనిపై ఇచ్ఛార్థంలో సన్ ప్రత్యయం వస్తే దిధ్యాసా అనే రూపం ఏర్పడుతుంది. ఆలోచించాలనే కోరిక అని దీనికర్థం (ధ్యాతుమిచ్ఛా దిధ్యాసా). దిధ్యాసా అనే పదం వాడుకలో లేకున్నా నిపూర్వకమైన 'నిదిధ్యాసా' అనే రూపం బాగా వాడుకలో ఉన్నదే. దిధ్యాసా శబ్దమే తెలుగులో 'ధ్యాస' అనే రూపంగా మారి ఉండవచ్చు.

**నటప్రపూర్ణ :**

ఒక సినిమా ప్రకటనలో 'నట ప్రపూర్ణ వెంకటేశ్ సమర్పించు అల్లరి పోలీస్' అనే వాక్యం కనిపించింది. ఇందులో నట ప్రపూర్ణ అనేది వెంకటేశ్‌కు బిరుదుగా వాడబడింది. ప్రయోక్త దీనిని నటనలో ప్రపూర్ణుడనే అర్థంలో ప్రయోగించినట్లుగా ఊహించవచ్చు. కాని నట

శబ్దానికి నటులనే కాని 'నటన' అనే అర్థంలేదు. కనుక నటప్రపూర్ణుడు అనే పదానికి నటులతో నిండినవాడు అనే అర్థమే వస్తుంది కాని, నటనలో ప్రపూర్ణుడు అనే అర్థం రాదు. ఆ అర్థం రావాలంటే నటన ప్రపూర్ణుడని అనాలి.

## నమస్తే :

తెలుగులో ఈ పదబంధం నమస్కారమనే అర్థంలో రూఢమై పోయింది. ఉదా : వాడు నమస్తే చేయలేదు మొ॥ ఇందులో నమః, తే అని రెండు సంస్కృత పదాలున్నాయి. తే అంటే నీకు, నమః అంటే నమస్కారం అని అర్థం. కనుక నమస్తే అనేది నీకు నమస్కారం అనే అర్థం కలిగిన సంస్కృతవాక్యం. ఈ సంస్కృత వాక్యాన్ని మనం తెలుగులో నమస్కారమనే అర్థంలో వాడడం విలక్షణంగా కనిపిస్తుంది.

సంస్కృతంలో ఇదొక వాక్యమనే భావన తెలుగు వ్యవహర్త లకు లేకపోవడమే తెలుగులో దీని వాడుకకు కారణంగా భావించవచ్చు.

## నమో శ్రీనివాసా :

నమో వెంకటేశా, నమో శ్రీనివాసా అనే సినిమా గీతంలో ఈ ప్రయోగం కనిపిస్తుంది. నమః, శ్రీనివాసా అనే రెండు పదాల సంధిరూపం ఇది. నమః శబ్దంలోని విసర్గ సకారంగా, తరువాత శకా రంగా మారి 'నమశ్శ్రీనివాసా' అని ఏర్పడుతుంది. లేదా విసర్గ విసర్గ గానే ఉండి 'నమః శ్రీనివాసా' అనే రూపం కూడా ఏర్పడవచ్చు. శ, ష, స లు తప్ప తక్కిన నాదాక్షరాలు పరంగా ఉన్నప్పుడే నమః మొదలైన విసర్గాంత శబ్దాల్లో ఓకారం వస్తుంది. ఉదా: నమో నారాయ ణాయ మొ॥ శ, ష, స లు పరంగా ఉన్నపుడు మాత్రం ఓకారం రాకూడదు. కనుక నమశ్శ్రీనివాసా అనో, నమః శ్రీనివాసా అనో అనడం యుక్తం. నమో శ్రీనివాసా అనే రూపం దుస్సంధి దోషజుష్టం.

## నాటకీకరణం చేయడం :

నాటకీకరణం అంటేనే నాటకంగా చేయడమని అర్థం. దానికి మళ్ళీ చేయడమనే పదం చేరిస్తే 'నాటకంగా చేయడం చేయడం' అనే అర్థం వస్తుంది. చేయడం అనే క్రియను రెండుసార్లు చెప్పడం ఇందు లోని అనౌచిత్యం. నాటకీకరణం అంటే సరిపోతుంది. ఇట్లే నాటకీకరణ చేశారు మొదలైన వాక్యాల్లో కూడా ఈ పునరుక్తిదోషం లేకుండా ఉండడానికి నాటకీకరించారు అంటే సరిపోతుంది.

## నాయికానాయకులు :

ఒకే శబ్దానికి సంబంధించిన పుంలింగ స్త్రీలింగ రూపాలను కూర్చి ద్వంద్వ సమాసంగా చెప్పినపుడు వాటిలో ఒక పుంలింగ శబ్దం మాత్రమే మిగులుతుంది. (చూ: పుమాన్ స్త్రియా 1-2-67.) దీన్ని ఏకశేష సమాసమని అంటారు. ఉదా॥ బ్రాహ్మణశ్చ బ్రాహ్మణీ చ బ్రాహ్మణౌ, కుక్కుటశ్చ కుక్కుటీ చ కుక్కుటౌ మొ॥ అలాగే నాయిక మరియు నాయకుడు అనేచోట రెండు రూపాలూ ఒకే శబ్దపు పుంలింగ స్త్రీలింగ రూపాలు కనుక పుంలింగం మాత్రమే మిగిలి 'నాయకులు' అని ఏకశేష సమాసం కావాలి (దీనికి నాయిక మరియు నాయకుడు అనే అర్థం.) నాయికా నాయకులు అని కారాదు. ఇట్లే తరుణీ తరుణులు సోదరీ సోదరులు రమణీరమణులు అనేవి కూడా వ్యాకరణసమ్మతాలు కావు. వీటిని తరుణులు, సోదరులు, రమణులు అనే రీతిగా ఏకశేష రూపంలో ప్రయోగించాలి.

## నాశనం :

నశించడమనే అర్థంలో వాడబడుతున్న పదం. ఇది ప్రేరణా ర్థకమైన నశ్ ధాతువుపై భావార్థంలో ల్యుట్ (ఇది అనగా మారుతుంది) ప్రత్యయం రాగా వృద్ధి వచ్చి ఏర్పడిన రూపం కనుక దీనికి పాతనం, చాలనం మొదలైన పదాల మాదిరిగా నశింపజేయడమనే ప్రేరణార్థమే

వస్తుంది కాని నశించడమనే అర్థం రావడానికి వీలులేదు. నశించడమనే అర్థంలో 'నశనం' అని అనాలి. అంటే, ఈ అర్థంలో నశ్ ధాతువులోని అకారానికి వృద్ధి రాదన్నమాట. ఐతే వ్యవహారంలో నశించడమనే అర్థంలో ప్రయోగించాల్సిన 'నశనం' అనే పదానికి వాడుకలేక నశింపజేయడమనే అర్థం కలిగిన 'నాశనం' అనే పదానికే వాడుక కలగడం విచిత్రమే.

నశించడమనే అర్థంలో 'నాశ్' అనేదే ధాతురూపమన్న భ్రమ ఈ పొరపాటుకు కారణం కావచ్చు.

## నిగర్వి :

గర్వం లేనివాడనే అర్థంలో వాడబడుతున్న తత్సమ పదం. ఇందులో ని, గర్వి అని రెండు పదాలున్నాయి. గర్వి అంటే గర్వం కలవాడనే అర్థం ఉన్నా ' ని' అనే పదానికి నఞర్థం (అభావార్థం) లేనందువల్ల గర్వం లేనివాడనే అర్థంలో నిగర్వి అనే పదం వ్యాకరణ సమ్మతం కాదు.

బహుశః నిర్గర్వి అనే పదమే వ్యవహారంలో నిగర్విగా మారి ఉండవచ్చు. 'నిర్' అనే పదానికి 'తొలగిన' అనే అర్థం ఉన్నందువల్ల నిర్గర్వి (తొలగిన గర్వంకలవాడు - అంటే గర్వం తొలగినవాడు) అనే పదాన్ని గర్వం లేనివాడనే అర్థంలో వాడవచ్చు.

కాని ఇందులో కూడా ఒక అసంబద్ధత ఉంది. నిర్గర్వి అనే పదానికి నిర్గతః గర్వః యస్మాత్ సః అని విగ్రహవాక్యం చెప్పాలి. అప్పుడిది బహుప్రీహి సమాసమౌతుందన్నమాట. ఐతే బహుప్రీహిలో నిర్గర్వః ('నిర్గర్వుడు') అనే రూపమే ఏర్పడుతుంది కాని నిర్గర్వీ (నిర్గర్వి) అనే రూపం ఏర్పడదు.

మరో విధంగా ఈ రూపం ఏర్పడడానికి అవకాశముందేమో పరిశీలిద్దాం. నిర్గతః గర్వః నిర్గర్వః (తొలగిన గర్వం) అని కర్మ ధారయ సమాసం చెప్పుకొని దానిమీద మత్వర్థంలో ఇన్ ప్రత్యయం చెప్పుకుంటే తొలగిన గర్వం కలవాడు - అంటే గర్వం తొలగినవాడు అనే అర్థంలో నిర్గర్వి అనే రూపం ఏర్పడడానికి వీలుంది కదా అని భావించవచ్చు. కాని 'న కర్మధారయాన్మత్వర్థీయః' అనే నియమం నిర్గర్వ అనే కర్మధారయం మీద మత్వర్థంలో ఇన్ ప్రత్యయం రావడాన్ని నిషేధిస్తుంది. కనుక ఈ విధంగా కూడా నిర్గర్వి అనే రూపం ఏర్పడడానికి వీలు లేదు.

కనుక నిర్గర్వుడనో, అగర్వుడనో, అగర్వి అనో అంటే సరిపోతుంది.

## నియామకం :

నియమించడం (appointment) అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది.

ని పూర్వక యమ్ ధాతువుపై కర్త్రర్థంలో ణ్వుల్ (అక) ప్రత్యయం చేరిస్తే 'నియామక' అనే రూపం ఏర్పడుతుంది. దీనికి నియమించేవాడు, నియమించేది అనే రీతిగా కర్త్రర్థమే వస్తుంది కాని నియమించడమనే భావార్థం రావడానికి వీల్లేదు. భావార్థంలో 'నియమనం' అని అనాలి; నియామకం అని అనరాదు.

తెలుగులోని అమ్మకం, అద్దకం మొదలైన పదాల్లోని భావార్థకమైన అక ప్రత్యయ సాదృశ్యంతో ఈ పదం వాడుకలోకి వచ్చి ఉంటుంది.

## నిరాశానిస్స్పృహలు :

నిరాశ అన్నా, నిస్స్పృహ అన్నా ఆశ లేకపోవడమనే అర్థం. కనుక వీటిలో ఏదో ఒక పదాన్ని ప్రయోగిస్తే సరిపోతుంది.

## నిర్దోషి :

దోషం లేనివాడనే అర్థంలో వాడబడుతున్న సంస్కృత తత్సమ రూపం. నిర్దోషి అనే పదానికి నిర్గతః దోషః యస్మాత్ సః (ఎవని నుండి దోషం తొలగిపోయిందో అతడు) అని విగ్రహ వాక్యం చెప్పాలి. అప్పుడది బహువ్రీహి సమాసమౌతుందన్నమాట. ఐతే, బహువ్రీహిలో నిర్దోషః (నిర్దోషుడు) అనే రూపమే ఏర్పడుతుంది కాని 'నిర్దోషీ' (నిర్దోషి) అనే రూపం ఏర్పడదు.

నిర్గతః దోషః నిర్దోషః (తొలగిన గర్వం) అని కర్మధారయ సమాసం చెప్పుకొని దానిమీద మత్వర్థంలో ఇన్ - ప్రత్యయం చెప్పుకుంటే తొలగిన దోషం కలవాడు - అంటే దోషం తొలగినవాడు అనే అర్థంలో నిర్దోషీ (నిర్దోషి) అనే రూపం ఏర్పడడానికి వీలుంది కదా అని భావించవచ్చు. కాని 'న కర్మధారయాన్మత్వర్థీయః' అనే నియమం 'నిర్దోష' అనే కర్మధారయంమీద మత్వర్థంలో ఇన్ ప్రత్యయాన్ని నిషేధిస్తుంది. కనుక ఈవిధంగా కూడా నిర్దోషి అనే రూపం ఏర్పడడానికి వీలు లేదు.

కనుక నిర్దోషుడనో, అదోషుడనో, అదోషి అనో ప్రయోగిస్తే ఏ దోషమూ ఉండదు.

## నిషిద్ధాక్షరి :

అవధానంలోని ఒక అంశాన్ని నిషిద్ధాక్షరి అని అంటారు. నిషిద్ధాని అక్షరాణి యస్యాం (సమస్యాయామ్) అని దీనికి విగ్రహ వాక్యం. ఏ సమస్యలో అక్షరాలు నిషేధింపబడతాయో ఆ సమస్య

నిషిద్ధాక్షరి అని భావం. స్త్రీ లింగంలో జీప్ ప్రత్యయం చేరిన బహు వ్రీహిసమాసరూపం.

నిషిద్ధాక్షర అనే బహువ్రీహి సమాసంపై స్త్రీలింగంలో టాప్ (ఆ) ప్రత్యయమే రావాలి కాని జీప్ (ఈ) ప్రత్యయం రావడానికి వీలు లేదు. టాప్ (ఆ) ప్రత్యయం వస్తే నిషిద్ధాక్షరా (నిషిద్ధాక్షర) అని కావాలి. నిషిద్ధాక్షరీ (నిషిద్ధాక్షరి) అని కాదు. కాళిదాసు కూడా 'న్యస్తాక్షరా ధాతురసేన యత్ర' అనే కుమారసంభవశ్లోకం (1-7) లో న్యస్తాక్షరా అనే బహువ్రీహిని ఆకారాంతంగానే వాడడం గమనించదగ్గ అంశం. చూ : వ్యస్తాక్షరి.

## నిష్ణాత :

ప్రవీణుడనే అర్థంలో వాడబడుతున్న పదం. సంస్కృతంలో నిష్ణాత శబ్దం అకారాంత పుంలింగం. "ప్రవీణే నిపుణాభిజ్ఞ విజ్ఞ నిష్ణాత శిక్షకాః" అని అమరం. (3-1-4.) అకారాంతమైన ఈ శబ్దాన్ని తెలుగు లోకి తత్సమంగా తెచ్చుకునేప్పుడు 'నిష్ణాతుడు' అవుతుంది కాని నిష్ణాత అని కాదు. 'నిష్ణాతృ' అనే ఋకారాంత శబ్దానికి తత్సమమైతే 'నిష్ణాత' అని ఏర్పడడానికి వీలుండేది. కాని, నిష్ణాత శబ్దం అకారాంతమే కనుక తెలుగులో నిష్ణాతుడు అని ప్రయోగించడమే యుక్తం.

నిపూర్వకమైన స్నా ధాతువుపై కర్త్రర్థంలో క్త ప్రత్యయం చేర్చగా 'నిష్ణాత' అనే అకారాంత రూపం ఏర్పడుతుంది క్త ప్రత్యయం కాక కర్త్రర్థంలో తృచ్ ప్రత్యయం చేర్చితే 'నిష్ణాతృ' అనే ఋకారాంత రూపం ఏర్పడుతుంది. నిష్ణాత అనే అకారాంత శబ్దానికి ప్రవీణుడనే అర్థం వచ్చినప్పుడు 'నిష్ణాతృ' అనే ఋకారాంత శబ్దానికి కూడా ప్రవీణుడనే అర్థం రావడంలో అభ్యంతరం లేదు.

కనుక నిష్ణాతృ శబ్దానికి తత్సమ రూపమైన 'నిష్ణాత' అనే శబ్దాన్ని తెలుగులో వాడితే తప్పు లేదు.

**నిస్స్వార్థ :**

నిస్, స్వార్థ అనే రెండు పదాలతో ఏర్పడిన పదం ఇది. 'నిస్' లో ఒక సకారమూ, స్వార్థలో ఒక సకారమూ ఉంది. కనుక ఈ రెండు పదాలతో ఏర్పడిన సంధి శబ్దంలో కూడా రెండు సకారాలు ఉండాలి. అప్పుడీ శబ్దాన్ని ఒక సకారంతో కాక రెండు సకారాలతో 'నిస్స్వార్థ' అనే విధంగా రాయాలన్న మాట.

ఈ పదాన్ని 'నిఃస్వార్థ' అనే విధంగా కూడా రాయవచ్చు.

**నిస్పృహా :**

నిస్, స్పృహ అనే రెండు శబ్దాలతో ఏర్పడిన పదం కనుక 'నిస్స్వార్థ' శబ్దంలాగా నిస్ స్పృహ అనో, నిఃస్పృహ అనో ప్రయోగించడం యుక్తం. చూ : నిస్స్వార్థ.

**పతాకం :**

'జాతీయ పతాకం' మొదలైన పద బంధాల్లోనూ, వ్యస్తంగానూ ఈ పదం వాడుకలో ఉంది.

సంస్కృతంలో పతాకా శబ్దం ఆకారాంత స్త్రీలింగం. దీన్ని తెలుగులోకి తత్సమంగా తెచ్చుకున్నప్పుడు చివరి దీర్ఘం హ్రస్వంగా మారి, ప్రథమైక వచనంలో 'పతాక' అని అవుతుంది. ఆకారాంత స్త్రీలింగ శబ్దాలపై ప్రథమైక వచనంలో 'ము' ప్రత్యయం చేరదు కనుక 'పతాకం' అని తెలుగులో తత్సమరూపం ఏర్పడే అవకాశం లేదు. కనుక 'పతాక' అన్న ప్రయోగమే యుక్తం.

**పటిష్ఠవంతంగా :**

మిక్కిలి దృఢంగా అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది.

పటిష్ఠ శబ్దంపై కలవాడు / కలది అనే అర్థంలో మతుప్ ప్రత్యయం రాగా మకారం వకారంగా మారి పటిష్ఠవత్ అని ఏర్పడు తుంది. దీన్ని తెలుగులో అమహద్వాచకంగా తత్సమీకరించుకున్న పుడు పటిష్ఠవంతం అని అవుతుంది. మతుప్ ప్రత్యయాంతమైన ఈ శబ్దానికి పటిష్ఠులు కలది అనే అర్థమే వస్తుంది కాని పటిష్ఠమైంది అనే అర్థం రాదు. కనుక పటిష్ఠవంతం అనే పదం వ్యాకరణ రీత్యా సాధువే ఐనా పటిష్ఠం అనే అర్థంలో మాత్రం సాధువు కాదు. మిక్కిలి దృఢంగా అనే అర్థంలో పటిష్ఠంగా అనో, పటిష్ఠతతో అనో ప్రయో గించడం యుక్తం. చూ :- సమర్థవంతంగా.

## పథసంచలనం :

Route march అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది.

మార్గం అనే అర్థం కలిగిన పథిన్ శబ్దం సంస్కృతంలో నకా రాంత శబ్దం. సమాసాల్లో ఉత్తరపదంగా వాడినప్పుడే పథిన్ శబ్దం పథ అని అకారాంతంగా మారుతుంది. (చూ. పథి మథ్యృభుక్షామాత్ అష్టాధ్యాయి. 7-1-85) ఉదా:- రాజపథమ్, చతుష్పథమ్ మొ॥ పథిన్ శబ్దాన్ని పూర్వపదంగా వాడినప్పుడు మాత్రం పథి అని ఇకారాంత గానే ఉంటుంది పథిన్ అనేది నకారాంతమైన ప్రాతిపదిక కనుక. అందువల్ల పథిసంచలనం అనడం యుక్తం.

"వాటః పథశ్చ మార్గశ్చ" అనే త్రికాండ శేషాన్నిబట్టి పథ శబ్దాన్ని అకారాంతంగా గ్రహిస్తే పథసంచలనం అనేది సాధువు కావచ్చు.

## పరాకాష్ఠ :

ఉత్తమమైన స్థాయి అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది.

దీన్ని కర్మధారయ సమాసంగానూ, వ్యస్త ప్రయోగంగానూ భావించే అవకాశం ఉంది. ఐతే ఈ రెండింటిలోనూ ఈ ప్రయోగానికి సాధుత్వం కనిపించదు. ఈ విషయాన్ని పరిశీలిద్దాం.

కర్మధారయ సమాసంగా గ్రహిస్తే ఇందులో పూర్వ పదంగా ఉన్న భాషితపుంస్కమైన పరాశబ్దానికి 'స్త్రియాః పుంవద్భాషిత పుంస్కాదనూఙ్ సమానాధికరణే' (అష్టాధ్యాయి 6-3-34) అనే నియమం ప్రకారం పుంవద్భావం వచ్చి 'పరకాష్ఠ' అని కావాలి. కనుక కర్మధారయ సమాసంలో 'పరాకాష్ఠ' అనేది వ్యాకరణసమ్మతం కాదు.

ఇక దీన్ని పరా, కాష్ఠ అని రెండు వ్యస్త పదాలుగా గ్రహించ డానికి వీలుందేమో చూద్దాం. 'పరా' అనేది సంస్కృతంలో ప్రథమా విభక్త్యేకవచనం. సంస్కృత పదాలను తెలుగులోనికి వ్యస్తంగా తెచ్చుకునేప్పుడు విభక్త్యంతంగా తెచ్చుకునే అవకాశం లేదు కనుక పరా అనే ప్రథమావిభక్త్యంత రూపంతో కూడిన 'పరాకాష్ఠ' అనే దాన్ని వ్యస్తపదంగాకూడా గ్రహించడానికి వీల్లేదు.

ఇందులోని పరా శబ్దాన్ని పరశబ్దార్థకమైన పరా అనే అవ్య యంగా గ్రహిస్తే పరాకాష్ఠ అనేది సాధువు కావచ్చు. లేదా పృషోద రాదిగణంలో చేర్చుకొని దీనికి సాధుత్వం కల్పించుకోవచ్చు.

'పరాశక్తి' అనే పదానికి కూడా ఈ విధంగానే సాధుత్వం చెప్పుకోవాలి.

## పర్యటనాకార్యక్రమం :

సంస్కృతంలో పర్యటించడమనే అర్థం కలిగిన పర్యటన శబ్దం అకారాంత నపుంసక లింగం. ఆకారాంత స్త్రీలింగ శబ్దం కాదు. కనుక సమాసంలో పర్యటన శబ్దాన్ని పూర్వపదంగా వాడినప్పుడు పర్యటన అని హ్రస్వ అకారాంతంగానే వాడాలి కాని పర్యటనా అని దీర్ఘ ఆకారాంతంగా ప్రయోగించకూడదు. కనుక పర్యటన కార్యక్రమ మనేదే వ్యాకరణసమ్మతమైన రూపం. చూ:- పర్యవేక్షణాలోపం.

## పర్యవేక్షణాలోపం :

పరి, అవ పూర్వకమైన ఈక్ష్ ధాతువుపై భావార్థంలో ల్యుట్ ప్రత్యయం (ఇది 'అన'గా మారుతుంది.) వస్తే పర్యవేక్షణ అనే రూపం ఏర్పడుతుంది. ల్యుట్ ప్రత్యయాంతమైన శబ్దాలు నపుంసక లింగాలు. కనుక పర్యవేక్షణ అనే ల్యుట్ ప్రత్యయాంత రూపం నపుంసక లింగమే కనుక హ్రస్వ అకారాంతంగానే ఉంటుంది. దాన్ని సమాసంలో పూర్వపదంగా చేర్చినపుడు హ్రస్వఅకారాంతంగానే ఉండాలి. కనుక పర్యవేక్షణలోపం అని అనాలి.

ఐతే, పరిశోధనారంగం, పరిపాలనారంగం మొదలైన సమాసాల్లో పరిశోధనా, పరిపాలనా అనే ల్యుట్ ప్రత్యయాంత రూపాలు ఆకారాంతాలుగా ప్రయోగింపబడుతున్నాయి కదా! అనే ఆశంక కలుగవచ్చు. కాని, ఇక్కడ ఒక విషయం గమనించాలి. సంస్కృత వ్యాకరణం ప్రకారం భావార్థంలో ల్యుట్, యుచ్; అనే రెండు ప్రత్యయాలూ వస్తాయి. రెండూ 'అన'గా మారుతాయి. ల్యుట్ ప్రత్యయం ధాతువులన్నిటిపైనా వస్తుంది. యుచ్ ప్రత్యయమేమో ణిజంత ధాతువులపై మాత్రమే వస్తుంది. (చూ. ణ్యాసశ్రంథో యుచ్ అష్టాధ్యాయి. 3.3.107.) ల్యుట్ ప్రత్యయం చేరిన రూపాలు నపుంసకలింగంలోనూ, యుచ్ ప్రత్యయాంత రూపాలు స్త్రీ లింగంలోనూ ఉంటాయి. ణిజంత ధాతువులపై ల్యుట్ ప్రత్యయమూ,యుచ్ ప్రత్యయమూ రావచ్చుకనుక. వీటికి నపుంసకలింగరూపమూ స్త్రీలింగ రూపమూ రెండూ ఉండవచ్చు. ఉదా: భావనమ్ - భావనా; ధారణమ్ - ధారణా; ప్రేరణమ్-ప్రేరణా; పరిపాలనమ్ - పరిపాలనా. ఈక్ష్ ధాతువు ణిజంతం కాదు కనుక, యుచ్ ప్రత్యయం రాక ల్యుట్ ప్రత్యయం మాత్రమే వచ్చి ఈక్షణం అనే నపుంసక లింగరూపమే ఏర్పడుతుంది. కనుక పర్యవేక్షణ లోపం అనేదే వ్యాకరణసమ్మతమైన రూపం.

**పర్యాటన :**

పరిపూర్వక అట ధాతువుపై భావార్థంలో ల్యుట్ (ఇది 'అన'గా మారుతుంది.) వస్తే పర్యటన అని అవుతుంది. (పరి+అట్+అన= పర్యటన.) ఇక్కడ అట ధాతువులోని అకారానికి వృద్ధి రావాలంటే పరమందు ఞకారం, ణకారం ఉన్న ప్రత్యయాలు ఉండాలి. ల్యుట్‌లో ఞకారం కానీ, ణకారం కానీ లేదు కనుక ఇక్కడ వృద్ధి వచ్చే అవకాశం లేదు. కనుక పర్యాటన అనే రూపం సాధువు కాదు. పర్యటన అని అనాలి.

**పారంగతుడు :**

మిక్కిలి ప్రవీణుడనే అర్థంలో తెలుగులో బాగా వాడుకలో ఉన్నపదం. పారాన్ని - ఒడ్డును చేరుకున్నవాడని దీని వ్యుత్పత్త్యర్థం. (పారం గతః పారంగతః.)

దీనిలో పారం, గత అని రెండు పదాలున్నాయి. పారం అనేది ద్వితీయా విభక్త్యంతం కనుక దీనికి 'ద్వితీయా శ్రితాతీతగతాత్యస్త ప్రాప్తా పన్నైః' (అష్టాధ్యాయి 2-1-24) అనే సూత్రంచేత గత శబ్దంతో సమాసం వస్తుంది. తరువాత పూర్వపదమైన పార శబ్దంమీద ద్వితీయా విభక్తి లోపించి 'పారగత' అని కావాలి. పారంగత అని కాదు.

ఐతే, పారం అనే ద్వితీయాంతంలోని విభక్తికి లోపం రాక 'పారంగత' అనేది అలుక్సమాసం కావచ్చు కదా అనే సందేహం రావచ్చు. ఐతే, పాణినీయంలో ఎక్కడా ద్వితీయా విభక్తికి అలుక్సమాసం చెప్పిన ఉదాహరణలు కనిపించవు.

'పారం గతః' అనే దాన్ని సమాసంగా కాక వ్యస్తపదాలుగా తీసుకొని తెలుగులో 'పారంగతుడు' అనే విధంగా కూడా ప్రయోగించడానికి వీల్లేదు. 'పారం' అనే విభక్త్యంత రూపాన్ని వ్యస్తంగా తెలుగులోకి తెచ్చుకోవడానికి అవకాశం లేదు కనుక. (చూ. పరాకాష్ఠ.)

కనుక 'పారంగతుడు' అనే రూపం వ్యాకరణసమ్మతం కాదు. అందువల్లే కాబోలు ఈ శబ్దాన్ని శబ్దరత్నాకరం పేర్కొన్నా సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కోలేదు.

ఈ శబ్దార్థంలో పారగుడు, పారగతుడు, పారీణుడు, పారగామి అనే శబ్దాలను ప్రయోగించవచ్చు.

ఇలాగే దివంగతుడు అన్న పదం కూడా వ్యాకరణ సమ్మతం కాదు.

## పునరావృతం :

'ఈ సంఘటన పునరావృతం కాకూడదు' మొదలైన వాక్యాల్లో ఈ పదబంధాన్ని వాడుతున్నాం. దీనికి మళ్ళీ జరిగింది, పునరుక్తమైంది అనే అర్థాలు చెప్పుకుంటున్నాం.

ఆవృతం అంటే సంస్కృతంలో ఆవరింపబడింది అని అర్థం. కనుక పునరావృతం అంటే మళ్ళీ ఆవరింపబడిందనే అర్థమే వస్తుంది కాని మళ్ళీ జరిగింది, పునరుక్తమైంది అనే అర్థాలు రావు. కనుక, ఈ అర్థాల్లో వాడవలసిన పదం పునరావృత్తం అనేకాని పునరావృతం అని కాదు. ఇందులోని ధాతువు వృత్ కనుక దానిపై క్త (త) ప్రత్యయం చేర్చినపుడు శబ్దంలో రెండు తకారాలు వినబడాలి కదా! (పునర్+ఆ+వృత్+త=పునరావృత్త.)

## పునీతుడు/పునీత/పునీతురాలు :

పవిత్రుడు / పవిత్రురాలు అనే అర్థాల్లో ఈ పదాలను వాడుతున్నాం.

పవిత్రమగు, పవిత్రం చేయు అనే అర్థాలు కల పూఞ్ పవనే అనే ధాతువుపై కర్త్రర్థంలో క్త (త) ప్రత్యయం వస్తే 'పూత' అని కావాలి. క్త ప్రత్యయం సార్వధాతుకం కాదు కనుక, అది పరంగా

ఉన్నప్పుడు వచ్చే 'సి' అనే ఆత్మనే పద వికరణ ప్రత్యయం చేర డానికి వీలులేదు. అందువల్ల పునీతుడు / పునీత / పునీతురాలు అనే రూపాలు వ్యాకరణ సమ్మతాలు కావు పూతుడు / పూత / పూతురాలు అనేవే వ్యాకరణ సమ్మత రూపాలు.

వినీత, సునీత, ఆనీత మొదలైన ప్రయోగాల సాదృశ్యంతో ఈ రూపాలు వాడుకలోకి వచ్చి ఉంటాయి.

## పురోగమత్ :

ముందుకు వెళుతున్న అనే అర్థంలో వాడబడుతున్న పదం.

ఇందులోని 'గమత్' అనే శబ్దం గమ్ ధాతువుపై కర్త్రర్థంలో శతృ (అత్) ప్రత్యయం వచ్చిన రూపంగా భావించవలసి ఉంటుంది పఠత్, లిఖత్, ధావత్ మొదలైన పదాల్లాగ. సార్వధాతుక ప్రత్యయాలు పరంగా ఉన్నప్పుడు గమ్ ధాతువు 'గచ్ఛ'గా మారుతుంది. (ఇషుగమియమాం ఛః అష్టాధ్యాయి 7-3-77) ఇక్కడ శతృప్రత్యయం సార్వధాతుక ప్రత్యయం కనుక అది పరంగా ఉన్నపుడు గమ్ ధాతువు 'గచ్ఛ'గా మారి 'పురోగచ్ఛత్' అని కావాలి. పురోగమత్ అనకూడదు.

## పూర్వీకులు :

పూర్వులు, ముందుతరంవాళ్లు అనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న పదం.

ప్రయాణీకులు, యాత్రీకులు, గోత్రీకులు మొదలైన అసాధు శబ్దాల సాదృశ్యంతో ఈ పదం కూడా వ్యాప్తిలోకి వచ్చింది.

పూర్వశబ్దాన్ని కాలవాచకంగా తీసుకున్నడు కాలాట్ఠఞ్ (4-3-11 అష్టాధ్యాయి)అనే సూత్రంచేత పూర్వశబ్దంపై ఠక్ ప్రత్యయం (ఇది ఇకగా మారుతుంది) వచ్చి, ఆదివృద్ధిచే పౌర్వికులు అని కావలసి ఉంటుంది.

(పూర్వ+ఠఞ్>పూర్వ+ఇక>పౌర్వ+ఇక=పౌర్విక) పూర్వజులు మొదలైన పదాల్లో పూర్వ శబ్దం కాలవాచకంగా వాడుకలో ఉండడం స్పష్టమే.

పూర్వ శబ్దంపై ఠన్ ప్రత్యయం వస్తే ఆదివృద్ధికి అవకాశం లేదు కనుక పూర్విక అనే రూపం ఏర్పడవచ్చు. కాని, పూర్వ శబ్దంపై ఠన్ ప్రత్యయం విధించే నియమం కనిపించదు. కనుక, పూర్విక అనే రూపం వ్యాకరణ సమ్మతం కాదు. పూర్విక అనే రూపమే సాధువు కానప్పుడు పూర్వీక శబ్దం ఏర్పడడానికి వీలు లేదు.

ఐతే ఆప్టే నిఘంటువులో పూర్వుడు అనే అర్థంలో పూర్వీ అనే పదం కూడా కనిపిస్తుంది. ఇది పూర్విన్ అనే నకారాంత శబ్దం. దీనిపై స్వార్థంలో 'క' ప్రత్యయం చేరిస్తే 'పూర్విక' అనే రూపం ఏర్పడడానికి అవకాశం ఉంది. (పూర్విన్+క=పూర్విక.) పూర్విక శబ్దమే పొరపాటున 'పూర్వీక' అని వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది.

ఈ తద్ధిత ప్రత్యయం గొడవ లేకుండా 'పూర్వులు'అని ప్రయోగిస్తే ఏ చిక్కూ ఉండదు.

## పర్యటకులు :

పరిపూర్వక అట్ ధాతువుపై కర్త్రర్థంలో ణ్వుల్ (ఇది అకగా మారుతుంది.) రాగా ఏర్పడ్డ రూపం. ఐతే 'అత ఉపధాయాః' (7-2-116 అష్టాధ్యాయి) అనే సూత్రం ప్రకారం ఞిత్తు లేక ణిత్తు ఐన ప్రత్యయం పరంగా ఉన్నపుడు ఉపధా వర్ణానికి వృద్ధి రావాలి. ఈ నియమం ప్రకారం పర్యటకులు అనే చోట ఉపధా వర్ణానికి వృద్ధి వచ్చి పాఠకులు, పాచకులు, వాచకులు మొదలైన రూపాల మాదిరిగా 'పర్యాటకులు' అని కావాలి. (పరి+అట్+అక>పర్యట్+అక< పర్యాట్+అక=పర్యాటక) కనుక వృద్ధి రాని పర్యటకులు అన్న రూపం వ్యాకరణసమ్మతం కాదు. పర్యాటకులన్నదే సాధురూపం.

పర్యటన అన్న శబ్దంలో మాత్రం పరంగా ఉన్న ల్యుట్ ప్రత్యయం ఞిత్తు కానీ, ణిత్తు కానీ కాదు కనుక, ఉపధావర్ణానికి వృద్ధి రావడానికి వీలు లేదు. కనుక పర్యాటన అని వృద్ధి వచ్చిన రూపం వ్యాకరణసమ్మతం కాదు. పర్యటన మనేదే సాధురూపం.

**పలహారం :**

ఉపాహారం (tiffin) అనే అర్థంలో వాడబడుతున్న పదం.

ఫలాహారమనే శబ్దమే క్రమంగా పలహారమని వాడుకలోకి వచ్చి ఉంటుంది. ఫలాహారమంటే పండ్ల ఆహారమని అర్థం. అర్థవిపరిణామంచే పండ్ల ఆహారమే కాకుండా అప్రధానంగా తీసుకునే ఏ ఆహారాన్నైనా ఫలాహరమనే పదంతో వాడుతున్నాం. ఫలాహారం అనే పదం వ్యవహారంలో ఫలారం, పలహారం, పలారం అని అనేక విధాలుగా వికృతిని పొందింది.

**పాత్రికేయులు :**

పత్రికా రచయితలనే అర్థంలో ఈ పదం బాగా వ్యాప్తిని పొందింది.

పత్రికా శబ్దంమీద ఢక్ ప్రత్యయం (ఇది 'ఏయ' గా మారుతుంది) వచ్చి ఆదివృద్ధిచే 'పాత్రికేయ' అనే తద్ధితాంత రూపం ఏర్పడాలి. (పత్రికా + ఢక్ > పత్రికా + ఏయ > పాత్రికా + ఏయ = పాత్రికేయ.) ఐతే 'స్త్రీభ్యో ఢక్' అనే సూత్రంచేత స్త్రీలింగ పదాల మీద రావలసిన ఢక్ ప్రత్యయం అపత్యార్థంలోనే వస్తుంది. ఉదా: వైనతేయః (వినత కొడుకు), సౌపర్ణేయః (సుపర్ణ కొడుకు) మొ॥ దీని ప్రకారం పాత్రికేయులు అన్న పదానికి పత్రికల కొడుకులు అనే అర్థం రావాలి. పత్రికా రచయితలు అన్న అర్థం రాదు.

పత్రికారచయితలు అంటే సరిపోతుండగా లేని ఆర్భాటానికిపోయి పాత్రికేయులనే తప్పు పదాన్ని సృష్టించి లేనిపోని చిక్కులు తెచ్చుకోవడం ఎందుకు?

**పాపిష్ఠి :**

మిక్కిలి క్రూరుడు, మిక్కిలి పాపి అనే అర్థాల్లో వాడబడు తున్న పదం.

పాపిష్ఠ అనే శబ్దం రెండు విధాలుగా ఏర్పడడానికి వీలుంది. క్రూరుడనే అర్థం కలిగిన పాప శబ్దం పైనా, పాపం కలవాడనే అర్థం కలిగిన పాపి శబ్దం పైనా అతిశయార్థంలో ఇష్ఠన్ ప్రత్యయం వస్తే పాపిష్ఠ అనే రూపం ఏర్పడుతుంది. (పాప+ఇష్ఠ=పాపిష్ఠ; పాపి+ఇష్ఠ=పాపిష్ఠ.) ఇది అకారాంత శబ్దం కనుక తెలుగులో దీన్ని పాపిష్ఠు డని ప్రయోగించాలి కాని పాపిష్ఠి అని ప్రయోగించరాదు.

**పునశ్చరణ / పురశ్చరణ :**

పునశ్చరణమనే పదంలో పునస్+చరణం అని రెండు పదా లున్నాయి. ఈ పదబంధానికి మంత్రాన్ని మాటి మాటికీ ఉచ్చరిం చడం అని మౌలికార్థం. కాలక్రమంలో మంత్రమనే అర్థం తొలగిపోయి మాటి మాటికీ మననం చేయడమనే అర్థంలో స్థిరపడిపోయింది.

పురశ్చరణమనే పదబంధంలో పురస్+చరణం అని రెండు పదాలున్నాయి. ఈ పదబంధానికి ముందుగా ఆరంభించటం, గ్రహిం చిన మంత్రం సిద్ధించడానికి హేతువైన ఒకానొక ప్రయోగం అని అర్థాలు. (పురశ్చరణమ్ : 1. పురతః ఆచరణమ్, 2. గృహీత మంత్ర సిద్ధి హేతు ప్రయోగభేదే తత్ప్రకారాది; వాచస్పత్యమ్.) వీటిలో రెండో అర్థం తంత్రశాస్త్రానికి సంబంధించింది.

తెలుగులో **refresher course** మొదలైన చోట్ల **refresher** అనే పదం అర్థంలో వాడదగిన తెలుగు పదం పునశ్చరణమా, పురశ్చర ణమా అని సందేహం కలుగుతూ ఉంటుంది. ఈ కోర్సులో ముందు నేర్చుకున్న విషయాన్ని మళ్ళీ మననం చేసుకుంటాం కనుక పునశ్చ రణమనే పదం వాడడమే యుక్తం. పురశ్చరణమనే పదానికి మంత్రం

సిద్ధించడానికి ఉపయోగపడే ప్రయోగ విశేషమనే అర్థం కనుక ఆ పదం ఇక్కడ సందర్భయుక్తం కాదు.

## పృచ్ఛకుడు :

అడిగేవాడనే అర్థంలో వాడబడుతున్న పదం. ముఖ్యంగా అవధానప్రక్రియలో ఈ పదానికి వాడుక ఎక్కువ.

అడుగడం అనే అర్థం కల ప్రచ్ఛ్ ధాతువుపై కర్త్రర్థంలో ణ్వుల్ ప్రత్యయం (ఇది 'అక'గా మారుతుంది) వస్తే ప్రచ్ఛకః అని అవుతుంది. తెలుగులో దీనికి ప్రచ్ఛకుడు అనేదే తత్సమ రూపం.

పృచ్ఛతి, పృచ్ఛా మొదలైన రూపాల్లో మాదిరిగా ప్రచ్ఛ్ ధాతువులోని రేఫకు 'గ్రహిజ్యావయి వ్యధి వ్యష్టి పృచ్ఛతి భృజ్జతీనాం' (6-1-16 అష్టాధ్యాయి) అనే నియమం ప్రకారం సంప్రసారణంచేత ఋవర్ణం వచ్చి పృచ్ఛకుడు అని అయ్యే అవకాశం లేదు. ఙిత్తు లేక కిత్తు పరంగా ఉన్నప్పుడే ఈ సూత్రంచేత సంప్రసారణంగా ఋవర్ణం వస్తుంది. ప్రచ్ఛక అనేచోట ప్రచ్ఛ్ ధాతువుకు పరంగా ఉన్న ణ్వుల్ (అక) ప్రత్యయం కిత్తు కాని ఙిత్తు కాని కాదు. కనుక ఇక్కడ సంప్రసారణంచే ఋవర్ణం వచ్చి పృచ్ఛకుడు అనే రూపం ఏర్పడదు. ప్రచ్ఛకుడనేదే వ్యాకరణసమ్మతమైన రూపం.

ప్రచ్ఛ్ అనేది కాక పృచ్ఛ్ అనేదే ధాతువనే భ్రమవల్ల పృచ్ఛక శబ్దం వాడుకలోకి వచ్చి ఉంటుంది.

లేదా పృచ్ఛకశబ్దాన్ని పృషోదరాదిగణంలో చేర్చుకొని సాధుత్వం కల్పించుకోవచ్చు.

## ప్రతి :

సంస్కృతంలో ప్రతి అనేది వీప్సార్థంలో వాడబడే అవ్యయం. దీనికి ప్రతి దేశం, ప్రతి గృహం, ప్రతి నగరం ఇత్యాదిగా సంస్కృత

పదాలతోనే సమాసం రావాలి కాని తెలుగు పదాలతో సమాసం రాకూడదు. కాని అలాంటి వైరి సమాస పదాలు తెలుగులో కొల్లలుగా వ్యవహారంలో కనిపిస్తాయి. ఉదా:- ప్రతివాడు, ప్రతిది, ప్రతిచోటు, ప్రతిపల్లె మొ॥ 'ప్రతి'తో సమానమైన వీప్సార్థక పదం తెలుగులో మన కందుబాటులో లేకపోవడం ఇలాంటి సమాసాలు ఏర్పడడానికి కారణం.

## ప్రతిష్ఠంభన :

ఈ సమాసపదంలో ప్రతి, స్తంభన అనే రెండు పదాలున్నాయి. వీటికి సంధి చేసినపుడు ఇకారం మీది సకారం షకారంగానూ, షకారానికి పరంగా ఉన్న తకారం టకారంగానూ మారి 'ప్రతిష్టంభన' అనే రూపం ఏర్పడుతుంది. (ప్రతి + స్తంభన > ప్రతి + ష్తంభన > ప్రతి + ష్టంభన = ప్రతిష్టంభన.)

ఈ విధంగా తకారం టకారంగా మారడాన్ని ష్టుత్వ సంధి అని అంటాం. ఈ సంధిలో తవర్గానికి టవర్గమూ, థవర్గానికి ఠవర్గమూ ఆదేశంగా వస్తాయి. మహాప్రాణమైన ఠవర్గం ఆదేశంగా రావాలంటే శబ్దంలో థవర్గం ఉండాలన్నమాట ప్రతి + స్థా (ప్రతిష్ఠా) అనే శబ్దంలో మాదిరిగా. ప్రతి స్తంభన అనే పదంలో థవర్గం లేదు కనుక ఠవర్గం ఆదేశంగా రావడానికి వీలు లేదు. కనుక మహాప్రాణఠవర్గంతో కూడిన ప్రతిష్ఠంభన అనే రూపం వ్యాకరణ సమ్మతం కాదు. ప్రతిష్టంభన అనే రూపమే సాధువు.

## ప్రతిష్ఠాత్మకమైన :

ప్రతిష్ఠాత్మకమైన అవార్డు మొదలైన పదాల్లో ఈ పదాన్ని వింటుంటాం.

ప్రతిష్ఠాత్మకమంటే ప్రతిష్ఠే ఆత్మగా కలిగిందని శబ్దార్థం. (ప్రతిష్ఠా ఆత్మా యస్య అని విగ్రహం.) ప్రతిష్ఠా రూపమైందని భావార్థం. ప్రతిష్ఠాత్మకమైన అవార్డు అనే చోట అవార్డు ప్రతిష్ఠా రూపమైంద నడంలో ఔచిత్యం లేదు అవార్డు ప్రతిష్ఠను కలిగించేదే కాని అవార్డే ప్రతిష్ఠ కాదు కదా! కనుక ప్రతిష్ఠాత్మకమైన అవార్డు అనడం కన్న ప్రతిష్ఠాకరమైన అవార్డు అనడంలో ఔచిత్యం ఉంది.

## ప్రధాని :

ప్రధానమంత్రి అనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం.

ప్రధానాః సంతి అస్య అనే వ్యుత్పత్తి ప్రకారం సంస్కృతంలో ప్రధానిన్ అనే నకారాంత శబ్దం ఏర్పడుతుంది. తెలుగులో దాన్ని తత్సమంగా తెచ్చుకున్నప్పుడు ప్రధాని అని అవుతుంది. పై వ్యుత్పత్తి ప్రకారం దీనికి ప్రధానులు (ముఖ్యులు) కలవాడు అనే అర్థమే వస్తుంది కాని ప్రధానుడు అనే అర్థం రాదు. ప్రధానుడనే అర్థం వస్తే కదా దీన్ని ప్రధానుడైన మంత్రి అనే అర్థంలో వాడడానికి వీలుంటుంది! కనుక ప్రధాని అనే పదం వ్యాకరణరీత్యా అసాధువు కాకపోయినా ప్రధానుడు అనే అర్థంలో అసాధువే. చూ:- యజమాని.

## ప్రప్రథమం :

అన్నిటికన్నా మొదటిది అనే అర్థంలో తెలుగులో బాగా ప్రాచుర్యం పొందిన పదం.

సంస్కృతంలో ప్రథమం అంటే మొదటిది అని అర్థం. అన్నిటికన్నా మొదటిది, అన్నిటిలో మొదటిది అనే అర్థాల్లో సర్వప్రథమం అనేది సాధువు కాని ప్రపథమం అనేది సాధువు కాదు.

ప్రథమం అనే శబ్దానికి భృశార్థంలో ద్విరుక్తి కలిగి తెలుగులోని కొంగ్రొత్త మొదలైన పదాల్లో మాదిరిగా ఆద్యక్షర శేషం

లోపించి ప్రప్రథమం అనే రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది. (ప్రథమమ్+ప్రథమమ్=ప్రప్రథమమ్) తత్సమ పదాల్లో పదం చివర మాత్రమే కొంత మార్పుకు అవకాశం ఉంటుంది కాని పదారంభంలో ఇంత మార్పు జరగడం వ్యాకరణ నియమ విరుద్ధం. తెలుగు పదాలకు వర్తింపజేసే నియమాన్ని సంస్కృత పదానికి వర్తింపజేయడం కూడా యుక్తం కాదు.

కనుక ప్రప్రథమం అనే బదులు సర్వప్రథమం అంటే సరిపో తుంది.

## ప్రయాణీకులు :

ప్రయాణం చేసేవాళ్ళు అనే అర్థంలో తెలుగులో మాత్రమే బాగా ప్రచారంలో ఉన్న సంస్కృతసమపదం.

ప్రయాణంతో చరించేవాళ్ళు అనే అర్థంలో చరతి (4-4-8 అష్టాధ్యాయి) అనే సూత్రంచే ప్రయాణ శబ్దంపై ఠక్ ప్రత్యయం వస్తే ఆది వృద్ధిచే ప్రాయాణికులు అని కావలసి ఉంటుంది. (ప్రయాణ+ఠక్> ప్రయాణ+ఇక>ప్రాయాణ+ఇక=ప్రాయాణిక)కనుక ప్రయాణికులు, ప్రయాణీకులు అనే రూపాలు వ్యాకరణ సమ్మతాలు కావు.

యాత్రా శబ్దానికి ప్రయాణ శబ్దం పర్యాయ వాచకం కనుక యాత్రికులు అన్న శబ్ద సాదృశ్యంతో ప్రయాణికులు అనే శబ్దరూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది. ఐతే యాత్రా శబ్దంలో తొలి ఆకారం వృద్ధ్యక్షరం కావడం వల్ల ఆదివృద్ధి వచ్చిన విషయం స్పష్టంగా తెలియడం లేదు. కనుక ప్రయాణికులు అనేచోట ఆదివృద్ధి వచ్చి ప్రాయాణికులు అన్న రూపం ఏర్పడాలనే భావం ప్రయోక్తలకు కలుగడంలేదు.

ప్రయాణికుడు అనే శబ్దానికి మరోరీతిగా కూడా వ్యుత్పత్తి చెప్పే అవకాశం ఉంది. ప్రయాణం కలవాడు అనే అర్థంలో ప్రయాణ శబ్దంపై 'ఇన్' ప్రత్యయం (అత ఇనిఠనౌ 5-2-115) వచ్చి ప్రయాణిన్ అని అవుతుంది. దీనిపై స్వార్థంలో 'క' ప్రత్యయం వస్తే 'ప్రయాణిక' అని, దీనినుండి ప్రయాణికుడు అని సిద్ధిస్తుంది. ఈ పద్ధతిలో కూడా ప్రయాణికుడు అనే హ్రస్వ ఇకారంతో కూడిన రూపమే కాని ప్రయాణీకుడు అని దీర్ఘ ఈకారంతో కూడిన రూపం సిద్ధించదు.

కనుక ప్రయాణీకులు అన్న రూపం వ్యాకరణ సమ్మతం కాదు.

## ప్రశ్నాపత్రం :

పత్రికా రంగంలోనూ, విద్యార్థి లోకంలోనూ ఈ పదం బాగా వాడుకలోకి వచ్చింది. విచారకరమైన విషయ మేమంటే కొందరు తెలుగు అధ్యాపకులు కూడా ప్రశ్నాపత్రమనే వ్యవహరిస్తున్నారు.

సంస్కృతంలో 'ప్రశ్న' శబ్దం హ్రస్వ అకారాంత శబ్దం. ప్రశ్నా అని దీర్ఘ ఆకారాంత శబ్దం కాదు. కనుక సమాసంలో ప్రశ్న శబ్దాన్ని పూర్వశబ్దంగా ప్రయోగించినపుడు 'ప్రశ్న' అని హ్రస్వ అకారాంతం గానే ప్రయోగించాలి. కనుక ప్రశ్నాపత్రం అనే రూపం వ్యాకరణ సమ్మతం కాదు.

తెలుగులో 'ప్రశ్న' అని స్త్రీలింగ తుల్య శబ్దంగా ప్రయోగించడం వల్ల సంస్కృతంలో ఇది ప్రశ్నా అని ఆకారాంత స్త్రీలింగ శబ్దం కావచ్చునేమోనన్న భ్రమ 'ప్రశ్నాపత్ర'మనే ప్రయోగానికి కారణమై ఉంటుంది.

## ప్రాధాన్యత :

ప్రధానుడిలో ఉండే గుణం ప్రాధాన్యం. (ప్రధానస్య భావః ప్రాధాన్యమ్.) ప్రధాన శబ్దంపై భావార్థంలో ష్యఞ్ (య) ప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. ఇది భావ (గుణ) వాచకం. భావవాచకమైన ప్రాధాన్య శబ్దంపైన మళ్ళీ భావార్థంలో తల్ (త) ప్రత్యయం చేర్చి ప్రాధాన్యత అని వాడడం వ్యాకరణ విరుద్ధం. ప్రాధాన్యం అంటేనే సరిపోతుంది. చూ :- ప్రాముఖ్యత, ప్రావీణ్యత మొ॥

## ప్రాముఖ్యత :

ప్రముఖుడిలో ఉండే గుణం ప్రాముఖ్యం. (ప్రముఖస్య భావః ప్రాముఖ్యమ్) ప్రముఖ శబ్దంపై భావార్థంలో ష్యఞ్ (య) ప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. ఇది భావవాచకం. భావ వాచకమైన ప్రాముఖ్య శబ్దంపైన మళ్ళీ భావార్థంలో తల్ (త) ప్రత్యయం చేర్చడం వ్యాకరణ నియమ విరుద్ధం. ప్రాముఖ్యం అంటే సరిపోతుంది. చూ : ప్రాధాన్యత, ప్రావీణ్యత.

## ప్రావీణ్యత :

ప్రవీణుడిలో ఉండే గుణం ప్రావీణ్యం (ప్రవీణస్య భావః ప్రావీణ్యమ్) ప్రవీణ శబ్దంపై భావార్థంలో ష్యఞ్ (య) ప్రత్యయం రాగా ఏర్పడిన రూపం ఇది భావ (గుణ) వాచకం. భావవాచకమైన ప్రావీణ్య శబ్దంపైన మళ్ళీ భావార్థంలో తల్ (త) ప్రత్యయం చేర్చి ప్రావీణ్యత అని వాడడం వ్యాకరణ విరుద్ధం. ప్రావీణ్యం అంటేనే సరిపోతుంది. చూ: ప్రాధాన్యత, ప్రాముఖ్యత.

## ప్రేమి / ప్రేమికుడు :

అనురాగం అనే అర్థం కల ప్రేమన్ శబ్దం సంస్కృతంలో నకారాంతపుంలింగం, నకారాంత నపుంసక లింగం కూడా. పుంలింగంలో

ప్రేమా అని, నపుంసకలింగంలో ప్రేమ అని అవుతుంది. ప్రేమ కల వాడు అనే అర్థంలో ప్రేమన్ శబ్దంపై మత్వర్థంలో ఇన్ ప్రత్యయం వచ్చి ప్రేమిన్ అనే శబ్దం ఏర్పడాలి. అప్పుడే తెలుగులో ప్రేమి అనే తత్సమరూపం ఏర్పడడానికి వీలుంది. కలవాడు అనే అర్థంలో ఇని ప్రత్యయం హ్రస్వ అకారాంత శబ్దాలకు మాత్రమే వస్తుంది "అత ఇనిఠనౌ" (5-2-115 అష్టాధ్యాయి) ఉదా:- దండీ (దండ) మౌనీ (మౌన) జ్ఞానీ (జ్ఞాన) మొ॥ ప్రేమన్ శబ్దం అకారాంతం కాదు కనుక దీనిపై కలవాడనే అర్థంలో 'ఇని' ప్రత్యయం వచ్చి ప్రేమిన్ / ప్రేమీ అని కావడానికి వీల్లేదు. అందువల్ల తెలుగులో ప్రేమి అనే తత్సమరూపం వ్యాకరణ సమ్మతం కాదు.

ప్రేమి శబ్దంపై స్వార్థంలో 'క' ప్రత్యయం వచ్చి ప్రేమికుడు అనే రూపం ఏర్పడాలి. కాని ప్రేమి అనే రూపమే సాధువు కానప్పుడు దానిపై క ప్రత్యయం వచ్చిన ప్రేమికుడు అనే రూపం సాధువు కాజాలదు.

ప్రేమన్ శబ్దంపై మత్వర్థంలో ఠన్ (ఇది ఇకగా మారుతుంది) వచ్చి ప్రేమికుడు అనే పదం ఏర్పడడానికి కూడా వీలులేదు. 'అత ఇని ఠనౌ' అనే సూత్రం (5-2-115. అష్టాధ్యాయి) చేత విధింపబడే ఠన్ ప్రత్యయం హ్రస్వ అకారాంతాలమీద మాత్రమే రావాలి కనుక.

ఏమైనా ప్రేమి, ప్రేమిక శబ్దాలు వ్యాకరణ సమ్మతాలుగా కనిపించవు. ఇవి హిందీ ప్రభావం వల్ల తెలుగులో చేరి ఉంటాయి.

## ప్రవరాఖ్యుడు :

అల్లసాని పెద్దన్న చేసిన 'ప్రవరాఖ్యుఁడలేఖ్యతనూవిలాసుడై' అన్న ప్రయోగమహిమవల్ల ప్రవరాఖ్యుడన్న పదం బాగా వాడుకలోకి వచ్చింది. ప్రవరుడనే అఖ్య (=పేరు) గల వాడని దీని కర్థం. వ్యాక

రణ రీత్యా ఈ పదం అసాధువేమీ కాదు. కాని ప్రవరుడనే పేరును మాత్రమే ప్రయోగించాల్సినచోట కూడా ప్రవరాఖ్యుడేం చేసినాడంటే ఇత్యాదిగా ప్రయోగించడం దోషం. పేర్లను పేర్కొనేప్పుడు నలుడు, భీముడు, కృష్ణుడు అనే రీతిగా ప్రయోగించడమే యుక్తం కాని నలాఖ్యుడు, భీమాఖ్యుడు, కృష్ణాఖ్యుడు అని ప్రయోగించడం యుక్తం కాదు. అలాగే పేరును మాత్రం విశేష్యంగా పేర్కొనేప్పుడు ప్రవరుడు అని ప్రయోగించాలి తప్ప ప్రవరాఖ్యుడు అని ప్రయోగించరాదు. ప్రవరుడని కదా అతని పేరు. ప్రవరాఖ్యుడని కాదు కదా! ప్రవరుడనే పేరుగల(వాడు) అని విశేషణంగా ప్రయోగించేప్పుడు మాత్రం ప్రవరాఖ్యుడని ప్రయోగించడం దోషం కాదు.

### ప్రశంసితుడు :

ప్రశంసింపబడినవాడనే అర్థంలో దీన్ని వాడుతున్నాం.

ప్రపూర్వక శంస్ ధాతువుపై కర్త్రర్థంలో 'క్త' ప్రత్యయం వచ్చినపుడు ఏర్పడాల్సిన రూపం. కాని అప్పుడు 'అనిదితాం హల ఉపధాయాః' (6-4-24) అనే నియమాన్నిబట్టి కిత్తైన ప్రత్యయం పరంగా ఉన్నపుడు శంస్ ధాతువులోని అనుస్వారం లోపించి 'ప్రశస్త' అనే రూపం ఏర్పడుతుంది. (ప్రశంస్+క్త>ప్రశంస్+త>ప్రశస్+త=ప్రశస్త) దీనికి ప్రశంసింపబడినవాడని అర్థం. అనుస్వారానికి లోపం రాని ప్రశంసితుడనే రూపం వ్యాకరణసమ్మతం కాదు.

'వేదాది సమస్త వాఙ్మయములందుఁబ్రశంసితుడైనవాడు' అన్న నన్నయ భారత ప్రయోగంలో (ఆదిపర్వం) ప్రశంసిత ప్రయోగం కనిపిస్తుంది. నిరంకుశాః కవయః అని కదా సూక్తి.

ణిజంతమైన ప్రశంస్ ధాతువుపై కర్మార్థంలో క్త ప్రత్యయం వస్తే ప్రశంసితుడనే రూపం ఏర్పడడానికి వీలుంది. (ప్రశంస్+ణిచ్

+ క్త>ప్రశంస్+ఇ+త=ప్రశంసిత). ఐతే దీనికి ప్రశంసింపజేయ బడినవాచనే అర్థం వస్తుంది కాని ప్రశంసింపబడినవాచనే అర్థం రాదు.

## ప్రామాణికుడు :

ఆంగ్లంలోని authority, authentic అనే అర్థాల్లో ఈ శబ్దాన్ని వాడడం తెలుగులో పరిపాటి ఐపోయింది. "ప్రమాణం హేతుమర్యాదా శాస్త్రియత్తా ప్రమాతృషు" అనే అమరకోశ వాక్యాన్నిబట్టి, "ప్రమాణం నిత్య మర్యాదా శాస్త్రిషు సత్యవాదిని, ఇయత్తాయాం చ హేతౌ చ క్లీబై కత్వే ప్రమాతరి" అనే మేదినీకోశ శ్లోకాన్నిబట్టి ప్రమాణ శబ్దానికి ఇతర అర్థాలతోపాటు నిరూపణం, ఒకదాని గుణదోషాలు నిశ్చయించడానికి నమ్మదగిన ఆధారం అనే అర్థాలున్నట్లుగ తెలుస్తుంది. ఈ అర్థాల్లో ప్రమాణమనే పదాన్నే వాడాలి కాని, ప్రామాణికుడు అనే తద్ధితాంత పదం వాడకూడదు. ఉదాహరణానికి ఆయన వ్యాకరణంలో ప్రమాణం, ఆయన న్యాయశాస్త్రంలో ప్రమాణం మొదలైన విధంగా ప్రమాణ శబ్దాన్నే వాడాలి కాని ఆయన వ్యాకరణంలో ప్రామాణికుడు, ఆయన న్యాయశాస్త్రంలో ప్రామాణికుడు ఇత్యాది రీతిగా ప్రయోగించకూడదు.

ప్రమాణానికి సంబంధించిన అనే అర్థంలో ఠక్ (ఇది ఇక గా మారుతుంది) ప్రత్యయం వచ్చి ఆదివృద్ధిచే ప్రామాణికుడనే రూపం ఏర్పడడానికి అవకాశం ఉన్నా దానికి ప్రమాణం అనే అర్థం రాదు. ప్రమాణానికి సంబంధించినవాడు అనే అర్థమే వస్తుంది.

ప్రమాణ శబ్దంపై స్వార్థంలో ఠక్ (ఇక) ప్రత్యయం వస్తే ప్రామాణికుడు అన్న రూపం ఏర్పడడానికి అవకాశం ఉంది. అప్పుడు ప్రమాణ శబ్దానికున్న అర్థమే ప్రామాణిక శబ్దానికి కూడా ఉంటుంది. ఐతే స్వార్థంలో ప్రమాణ శబ్దంపై ఠక్ (ఇక) ప్రత్యయాన్ని విధించే నియమమేమీ వ్యాకరణంలో లేదు. కనుక ప్రమాణమనే అర్థంలో ప్రామాణిక శబ్దం ఏర్పడదు.

రక్షించేవాడనే అర్థంలో ప్రమాణ శబ్దం మీద ఠక్ (ఇది ఇకగా మారుతుంది) ప్రత్యయం వచ్చి ప్రామాణికుడనే రూపం కావచ్చు. ఐతే, దానికి ప్రమాణాన్ని రక్షించేవాడనే అర్థమే వస్తుంది. కాని ప్రమాణీభూతుడనే అర్థం రాదు.

## ప్రియంభావుకులు :

ప్రియాన్ని భావించే స్వభావం కలవారనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాం.

సంస్కృతంలో ఇది షష్ఠీతత్పురుష సమాసం. ప్రియస్య భావుకాః అని దీనికి విగ్రహవాక్యం. ప్రియ, భావుక శబ్దాలకు సమాసం చేసినపుడు ప్రియభావుకులు అనే ఏర్పడుతుంది కాని ప్రియంభావుకులనే రూపం ఏర్పడదు.

ప్రియంవదులు, వశంవదులు మొదలైన పదాల్లో మాదిరిగా ప్రియ శబ్దంపై ముమ్ ప్రత్యయం వచ్చి ప్రియంభావుకులు అనే రూపం ఏర్పడవచ్చు కదా అని ఆశంకించవచ్చు. కాని, ఈ ముమాగమం ఖిత్ప్రత్యయాంతం పరంగా ఉన్నపుడే వస్తుంది. ప్రియ+వద; వశ+వద అనేచోట్ల వద్ ధాతువుపై ఖశ్ (అ) ప్రత్యయం వచ్చింది కనుక 'వద' అనేది ఖిదంతం. కనుక అది పరంగా ఉన్నపుడు ప్రియ, వశ శబ్దాలకు ముమాగమం వచ్చి ప్రియంవద, వశంవద అని కావచ్చు. కాని, ప్రియ+భావుక అనేచోట భావుకశబ్దం ఖిదంతం కాదు కనుక ప్రియశబ్దంపై ముమాగమం రావడానికి వీలులేదు. కనుక, ప్రియంభావుకులు అనే రూపం వ్యాకరణసమ్మతం కాదు.

ప్రియంభావుకులు అనే పదంలోని ప్రియం అనే పదాన్ని ద్వితీయాంతంగా కూడా భావించడానికి వీల్లేదు. ఇది షష్ఠీ తత్పురుషం కనుక. కనుక దీన్ని ద్వితీయ లోపించని అలుక్సమాసంగా కూడా భావించడానికి వీల్లేదన్నమాట.

ఐతే ప్రియంవద, వశంవద మొదలైన పదాల సాదృశ్యంతో ప్రియంభావుకులు అన్న శబ్దం వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది.

## ప్రేరేపకుడు :

ప్రేరణ చేసేవాడు అనే అర్థంలో వాడబడుతున్న తెలుగుపదం.

ప్రేరేచు అనే ధాతువునుండి కర్త్రర్థంలో ఏర్పడిన కృదంత పదంగా దీన్ని భావించే అవకాశం ఉంది. కాని కర్త్రర్థంలో ణ్వుల్ (అక) ప్రత్యయం సంస్కృత ధాతువులపైనే వస్తుంది. తెలుగు ధాతువులపై రాగూడదు. ప్రేరేచు అనేది తెలుగు ధాతువు కనుక దీనిపై కర్త్రర్థంలో ణ్వుల్ (అక) ప్రత్యయం వచ్చి 'ప్రేరేపక' అనే రూపం ఏర్పడడం వ్యాకరణ విరుద్ధం.

తెలుగు ధాతువుపై సంస్కృత ప్రత్యయం రావడం ఇందులోని దోషం.

సంస్కృతంలోని ప్రేరక శబ్ద సాదృశ్యంతో ఈ రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది. ఈ అర్థంలో ప్రేరకుడని వాడడం యుక్తం.

## ప్రేరేపణ :

ప్రేరణ అనే అర్థంలో వాడబడుతున్న తెలుగుపదం.

'ప్రేరేచు' అనే ధాతువునుండి భావార్థంలో ఏర్పడిన కృదంత పదంగా దీన్ని భావించే అవకాశం ఉంది. కాని, భావార్థంలో ల్యుట్ (అన) ప్రత్యయం సంస్కృత ధాతువులపైనే వస్తుంది. తెలుగు ధాతువులపై రాగూడదు. ప్రేరేచు అనేది తెలుగు ధాతువు కనుక దీనిపై భావార్థంలో ల్యుట్ (అన) ప్రత్యయం వచ్చి ప్రేరేపణ అనే రూపం ఏర్పడడం వ్యాకరణ విరుద్ధం. తెలుగు ధాతువుపై సంస్కృత ప్రత్యయం రావడం ఇందులోని దోషం.

సంస్కృతంలోని ప్రేరణ శబ్ద సాదృశ్యంతో ఈ రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది. ఈ అర్థంలో ప్రేరణ అని వాడడం యుక్తం.

ప్రౌఢిమ :

ప్రౌఢత్వం అనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం.

ప్రౌఢ శబ్దంపై భావార్థంలో ఇమనిచ్ (ఇమన్) అనే ప్రత్యయం వస్తే 'ప్రౌఢిమ' అనే రూపం ఏర్పడడానికి వీలుంది. ఐతే, భావార్థంలో ఇమనిచ్ ప్రత్యయం పృథ్వాది గణంలో చేరిన పదాలపైనా, దృఢాది గణంలో చేరిన పదాలపై మాత్రమే వస్తుంది. చూ: "పృథ్వాదిభ్య ఇమనిజ్వా" (అష్టాధ్యాయి 5-1-122.) ఉదా: పృథ్వాదులు పృథు-ప్రథిమా; మృదు - మ్రదిమా; మహత్ - మహిమా; పటు - ప్రథిమా; తను - తనిమా మొ॥

వర్గదృఢాదిభ్యః ష్యఞ్ చ; (అష్టాధ్యాయి 5-1-123.) దృఢాదులు : దృఢ - ద్రఢిమా; శీత - శీతిమా; ఉష్ణ - ఉష్ణిమా; జడ - జడిమా; మధుర - మధురిమా మొ॥

పై పేర్కొన్న దృఢాది గణంలో కానీ, పృథ్వాది గణంలో కానీ ఈ పదం చేరకపోవడంవల్ల ప్రౌఢ శబ్దంపై భావార్థంలో ఇమనిచ్ (ఇమన్) ప్రత్యయం వచ్చి ప్రౌఢిమా అనే రూపం ఏర్పడడానికి వీల్లేదు. ఈ అర్థంలో ప్రౌఢత్వం అనే అనాలి. కావ్యాలంకార సూత్ర వృత్తికర్తయైన వామనుడు కూడా 'ముగ్ధిమాదిష్విమనిజ్మృగ్యః (5-54) అని ముగ్ధిమా, ప్రౌఢిమా మొదలైన పదాలను అసాధువులని పేర్కొన్నాడు.

ప్రౌఢిమ అన్న పదం వ్యాకరణ రీత్యా సాధువు కాకపోయినా కవుల కెందుకో ఈ పదం మీద ఎనలేని మమకారం. తెలుగు కవులు ప్రయోగించిన కొన్ని ప్రయోగాలను గమనించండి.

తరంబె కన్నెఁ గొనియాడన్ గేయవాక్ప్రౌఢిమన్
(వసుచరిత్ర 3-59)

గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్
(శృంగార నైషధం 1-12)

తనరన్నెనును దత్కృపన్ నిగమశాస్త్ర ప్రౌఢిమల్ గాంచితిన్
(ఇందుమతీ పరిణయం 1-68)

చతురామ్నాయ ప్రౌఢిమ
(ప్రబోధచంద్రోదయం 1-10)

మిగులఁ బ్రౌఢిమమున
(ఆముక్తమాల్యద)

సాహిత్యస్ఫురన్మాధురీచారుప్రౌఢిమఁ జెప్పి పంప
(కాళహస్తిమాహాత్మ్యం 3-167)

సామిసంపుల్లమల్లి పాటలీచంపకోత్పలప్రౌఢిమములు
(పారిజాతాపహరణం)

శ్రీనాథుడు, రామరాజభూషణుడు, కృష్ణదేవరాయలు, నంది మల్లయ- ఘంట సింగనలు, ధూర్జటి మొదలైన మహాకవులెందరో ఈ పదాన్ని ప్రయోగించినారు కనుక దీనిని స్వీకార్యంగానే భావింప వచ్చు. ఆర్య వ్యవహారదృష్టమైన పదం గ్రాహ్యమే కదా!

సంస్కృతంలో కూడా ఈ ప్రయోగం కవి ప్రయోగాల్లో ఉండి ఉంటుంది. కనుకే వామనుడు ఈ పదాన్ని దుష్టమని పేర్కొన్నాడు.

**బంధితుడు :**

బంధింపబడినవాడనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం.

సంస్కృతంలోని బన్ధ్ ధాతువుపై కర్మార్థం(Passive sense)లో క్త (త) ప్రత్యయం చేరిస్తే కిత్తైన ప్రత్యయం పరంగా ఉంది కనుక బన్ధ్ ధాతువులోని నకారానికి లోపమూ (చూ. "అనిదితాం హల ఉప

ధాయాః" - అష్టాధ్యాయి 6 4-24) తరువాత 'త'కు ధకారాదేశమూ, తరువాత జశ్త్వమూ వచ్చి బద్ధుడు అనే రూపం ఏర్పడుతుంది. (బన్ధ్ + క్త > బన్ధ్ + త > బధ్ + త > బధ్ + ధ > బద్ + ధ = బద్ధ) బంధ్ దాతువు అనిడ్ధాతువు కనుక దీనికి క్త ప్రత్యయం పరంగా ఉన్నపుడు ఇడాగమం కూడా రాదు కనుక నకార లోపం రాకుండా ఉండడం, ఇడాగమం రావడం వ్యాకరణ విరుద్ధం కనుక బంధితుడనే రూపం యుక్తం కాదు. బద్ధుడనే రూపమే యుక్తం.

ణిజంతమైన బంధ్ దాతువుపై క్త ప్రత్యయం చెప్పుకున్నపుడు బంధితుడనే రూపం ఏర్పడడానికి అవకాశం ఉంది. కాని, దానికి బంధింపబడినవాడనికాక బంధింపజేయబడినవాడనే అర్థం వస్తుంది.

కనుక బంధింపబడినవాదనే అర్థంలో బంధితుడని కాక బద్ధుడనే ప్రయోగించాలి.

సూర్యరాయాంధ్ర నిఘంటువులో బంధింపబడినవాడనే అర్థంలో బంధితుడనే ఆరోపాన్ని చూపడం చింత్యమే. శబ్దరత్నాకరకారుడు ఈ అర్థంలో బంధితుడనే పదాన్ని చూపలేదు.

**బహిష్ఠురాలు :**

ముట్టైన స్త్రీ అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది.

బహిస్+స్థా అనే రెండు పదాలచే ఈ రూపం ఏర్పడుతుంది. బయట ఉండేది అని వ్యుత్పత్త్యర్థం. బహిస్+స్థా అనే పదాలకు సంధిలో 'బహిస్థా' అనే రూపమే కాని 'బహిష్ఠా' అనే రూపం ఏర్పడదు. స్థా అనే పదంలోని సకారానికి షకారమూ, షకార సంయోగంతో థకారానికి ష్టుత్వంచేత ఠకారమూ ఆదేశంగా వచ్చే వీలులేదు. కనుక బహిష్ఠ శబ్దానికి అలు శబ్దం చేర్చి తెలుగులో బహిష్ఠురాలు అని వ్యవహ

రించడం వ్యాకరణ సమ్మతం కాదు. అలాగే బహిష్టు అయ్యింది మొద లైనవి కూడా వ్యాకరణసమ్మతాలు కావు.

### బహుకొద్ది/బహుగొప్ప/బహుచక్కని మొ॥

ఈ పదాల్లోని 'బహు' అనేది సంస్కృత పదం. అవ్యయం కూడా. తత్సమాలుగా మారని కేవల సంస్కృత పదాలు - అందు లోనూ అవ్యయాలు తెలుగు పదాలతో సమసించగూడదు ఇలా సమసిస్తే వాటిని వైరి సమాసాలని అంటారు. వ్యాకరణం వీటిని అంగీకరించదు. చాలా కొద్ది, చాలా గొప్ప అని ప్రయోగిస్తే సరిపోతుంది.

అతికొద్ది, అతిచిన్న, అతిగొప్ప, అతిచక్కని, అనేకమంది మొదలైనవి కూడా వైరి సమాసాలే.

### బానిసత్వం :

బానిసతనం అనే అర్థంలో వాడుకలో బాగా స్థిరపడిపోయిన శబ్దం.

వ్యాకరణరీత్యా ఈ పదం తప్పంటే ఆశ్చర్యం కలుగుతుంది. త్వ అనేది సంస్కృతంలో భావార్థక ప్రత్యయం. ఇది కేవలం సంస్కృత పదాలపై చేరాలి. తెలుగులో పదాలపై చేరగూడదు. కాని, 'బానిస' అనే తెలుగు శబ్దంపై త్వ ప్రత్యయం చేరి బానిసత్వం అని ఏర్పడింది. వారసత్వం అనే పదం కూడా ఈ విధంగా ఏర్పడిందే.

బానిస, వారస అన్న పదాలు సంస్కృతసమాసాలన్న భ్రమతో వీటిపై త్వ ప్రత్యయం చేర్చడం జరిగి ఉంటుంది.

ఈ పదాలు వ్యాకరణ సమ్మతాలు కాకపోయినా లోకసమ్మతా లైనాయి కనుక గ్రాహ్యాలే.

## బింబాధరం :

బింబం (దొండపండు) లాంటి పెదవి అని అర్థం.

ఇందులో బింబం ఉపమానపదం. అధరం ఉపమేయపదం. కనుక, ఇది ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసం. ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసాల్లో "ఉపమానాని సామాన్య వచనైః" అనే సూత్రం (2-1-55 అష్టాధ్యాయి) ప్రకారం ఉత్తరపదం విధిగా గుణవాచకపదమై ఉండాలి ఉదా:- ఘనశ్యాముడు, మేఘశ్యాముడు మొ॥ ఇందులో తొలిపదం ఉపమాన వాచకం. రెండోపదమైన శ్యామ శబ్దం గుణ వాచకం. ఈ విధంగా బింబాధరం అనే ఉపమాన పూర్వపద కర్మధారయంలో పూర్వపదం ఉపమాన వాచకమే ఐనా ఉత్తర పద మైన అధర శబ్దం గుణవాచకం కాదు. గుణవాచకం కాని శబ్దంతో సమాసం చెప్పుకున్నపుడు ఉపమేయ వాచకం పూర్వపదంగానూ, ఉపమాన వాచకం ఉత్తర పదంగానూ ఉండాలి అని 'ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యా ప్రయోగే' (2-1-56 అష్టాధ్యాయి) అనే నియమం తెలుపుతుంది. కనుక గుణవాచకం లేని ఈ సమాసాన్ని అధరబింబం అని అనాలి కాని బింబాధరం అని అనగూడదు. బింబం లాంటి అధరం కలది అనే బహువ్రీహి సమాసంలో మాత్రం బింబ శబ్దాన్ని పూర్వం ప్రయోగించి బింబాధరి అని అనవచ్చు.

ఐతే, 'బింబాధరః పీయతే' మొదలైన సంస్కృత ప్రయోగా ల్లోనే ఈ ప్రయోగం కనిపిస్తుంది. కనుక వామనుడు దీన్ని మధ్యమ పదలోపి సమాసంగా భావించి సాధువన్నాడు. చూ. "బింబాధర ఇతి వృత్తౌ మధ్యమ పదలోపిన్యామ్" (5-15). అంటే "శాక పార్థివాది గణంలో ఈ పదాన్ని చేర్చుకొని "శాక పార్థివాదీనాం సిద్ధయే ఉత్తర పదలోపస్యోప సంఖ్యానామ్" అనే వార్తికం ప్రకారం బింబాధరః అన్న పదానికి బింబమివ అధరః అనికాక, బింబాకారః అధరః అని

విగ్రహవాక్యం చెప్పి, సమాసంలో మధ్యమ పదమైన అకారశబ్దానికి లోపం చెప్పి బింబాధర అనే రూపాన్ని సాధించుకోవచ్చునన్నమాట. 'స్థితస్య గతిశ్చింతనీయా' అని కదా సూక్తి!

## బ్రహ్మసమాజం :

ఇది ఒక ఆధ్యాత్మిక మత సంస్థ పేరు. బ్రహ్మ మొక్కడే దేవుడని భావించే మతం ఇది.

బ్రహ్మమంటే పరబ్రహ్మమనీ, సమాజమంటే సముదాయమనీ అర్థం. ఈ రెండు పదాలకూ షష్ఠీ సమాసమే చేయాలి. అప్పుడు దీనికి బ్రహ్మము యొక్క సమాజం అనే అర్థం వస్తుంది. కాని, ఈ అర్థం సముచితంగా కనిపించదు.

కనుక ఇక్కడ బ్రహ్మ శబ్దానికి బ్రహ్మమనే వాచ్యార్థం కాక లక్షణచే బ్రహ్మారాధకులనే అర్థం చెప్పుకోవాలి. అప్పుడు బ్రహ్మారాధకుల సమాజం అనే అర్థం వచ్చి సమాసంలోని దోషం తొలగిపోతుంది.

సాహిత్య పరిషత్తు, సారస్వత పరిషత్తు, సారస్వత సమితి మొదలైన పదాలు కూడా ఇలాంటివే. ఇక్కడ కూడా సాహిత్య, సారస్వత శబ్దాలకు లక్షణచే సాహిత్యారాధకులనో, సారస్వతపరులనో అర్థం చెప్పుకుంటే సమాసంలోని దోషం తొలగిపోతుంది.

ప్రార్థనా సమాజం అనేచోట కూడా లక్షణచే ప్రార్థనాపరుల యొక్క సమాజం అని అర్థం చెప్పుకోవాలి.

## భంగిమ :

ఆంగ్లంలోని 'Pose' అనే శబ్దానికి సమానార్థంగా వాడబడుతున్న పదం.

ఇందులో 'భ' అనే మహాప్రాణాక్షరం ఉంది కనుక ఇది సంస్కృత పదమనే భావించాలి. ఐతే, ఈ పదం సంస్కృతంలో ఎక్కడా కనిపించదు. శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదలైన నిఘంటువుల్లో కూడా ఈ శబ్దం కనిపించదు. ఐతే, ఈ పదం తెలుగులో ఎలా ఏర్పడినట్లు? భంగ/భంగీ శబ్దంపై ఇమనిచ్ (ఇమన్) ప్రత్యయం వచ్చి ఈ రూపం ఏర్పడాలి. కాని, ఇమనిచ్ ప్రత్యయం పృథు, దృఢ మొదలైన విశేషణాలపైన భావార్థంలో మాత్రమే వస్తుంది. ఇక్కడ భంగ శబ్దం పృథ్వాదుల్లోనూ, దృఢాదుల్లోనూ చేరిన పదం కాదు. అంతకన్నా మొదట అది విశేషణం కాదు. భావార్థమూ లేదు. కనుక భంగ/భంగీ శబ్దంపై ఏ విధంగానూ ఇమనిచ్ ప్రత్యయం రావడానికి వీల్లేదు. కనుక భంగిమ అనే రూపం ఏర్పడదు.

**భవిత :**

ఇటీవల పత్రికా రచయితలు సృష్టించి వ్యాప్తిలోకి తెచ్చిన పదం. భావికాలం అనే అర్థంలో ఈ పదం వాడబడుతుంది.

భూధాతువుపై కర్త్రర్థంలో తృచ్ ప్రత్యయం రాగా ఈ రూపమేర్పడుతుంది. (భూ+తృచ్>భూ+తృ> భూ+ఇ+తృ>భో+ఇ+తృ=భవితృ - భవితా) దీనికి అయ్యేవాడు అని అర్థం. భావికాలం అనే అర్థం లేదు.

భవిష్యదర్థకమైన లుట్ లకారంలో భవితా అనే రూపం ఏర్పడుతుంది. (భవితా, భవితారౌ, భవితారః మొ॥) ఇది క్రియాపదం కనుక తెలుగులో దీన్ని వాడడానికి వీలులేదు.

కనుక భావికాలం అనే అర్థంలో 'భవిత' అనే పదప్రయోగం అనుచితంగానే కనిపిస్తుంది. భవిష్యత్తు అనే ప్రసిద్ధ పదం ఒకటి ఉండగా (ఈ పదం కూడా తప్పే అనుకోండి) భవిత అనే వ్యాకరణ సమ్మతం కాని రూపాన్ని కల్పించుకొని వాడడం యుక్తం కాదు.

**భవిష్యత్తు :**

భవిష్యత్కాలమనే అర్థంలో దీన్ని ప్రయోగిస్తున్నాం.

భవిష్యత్ అనే శబ్దం సంస్కృతంలో భవిష్యత్కాలిక శత్రర్థక రూపం. శత్రర్థక శబ్దాలకు - ప్రాతిపదికలకు కానీ, తన్నిష్పన్నాలైన రూపాలకు కానీ తెలుగులో తత్సమాలుగా ప్రయోగాలు ఉండవు. "భవచ్ఛత్రాదులకిందుఁ బ్రయోగంబు లేదు" (బాలవ్యాకరణం 3-87) అని వీటి ప్రయోగాన్ని చిన్నయసూరి నిషేధించినాడు. కనుక భవిష్యత్ మొదలైన శత్రంత రూపాలకు సమాసంలో పూర్వపదాలుగానే ప్రయోగంకాని స్వతంత్రంగా, వ్యస్తంగా ప్రయోగం ఉండదు. ఉదా: లసద్రూపము, భవిష్యత్కాలము మొ॥

శత్రంత రూపాల్లో ఒక్క భవిష్యచ్ఛబ్దానికి వ్యస్తంగా భవిష్యత్తు అనే రూపంలో తత్సమ రూపంగా ప్రయోగం కనిపిస్తుంది. దీన్ని విశేషప్రయోగంగా భావించాలి.

**భస్మీపటలం :**

భస్మసముదాయమని దీనికి అర్థం.

ఈ సమాసపదంలో భస్మ, పటల అనే రెండు శబ్దాలున్నాయి. భస్మ శబ్దానికి సమూహార్థకమైన పటల శబ్దంతో సమాసం చేస్తే భస్మ పటలం అనే కావాలి కాని భస్మీపటలం అని కావడానికి వీల్లేదు. భస్మ సముదాయం అనేచోట భస్మీ సముదాయం అని కావడం లేదు కదా! అంటే ఇక్కడ భస్మ శబ్దంలో ఈకారం రావడం వ్యాకరణ విరుద్ధ మన్నమాట.

ఐతే భస్మీభూతం, భస్మీకృతం మొదలైన పదాల సాదృశ్యంతో భస్మీపటలమనే రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది. పరమందు ధాతురూపమున్నపుడే పూర్వశబ్దంలోని చివరి అక్షరం ఈకార

పోతుంది. భస్మపటలమన్నచోట పటల శబ్దం ధాతురూపం కాదు కనుక పూర్వశబ్దంలోని చివరివర్ణం ఈకారం కావడానికి వీల్లేదు. కనుక భస్మపటలమన్న ప్రయోగమే వ్యాకరణసమ్మతం.

**భీతావహం :**

భీతిని కలిగించేది అనే అర్థంలో ఈ పదాన్ని కొందరు వాడుతున్నారు.

ఈ పదంలో భీత, ఆవహం అనే రెండు పదాలున్నాయి. భీత అంటే భయపడిన వారని; ఆవహం అంటే ఆవహించేది అని అర్థం కనుక భీతావహం అన్న పదానికి భీతులను - భయపడినవారిని ఆవహించేది అనే అర్థమే వస్తుంది కాని, భయాన్ని ఆవహింపజేసేది - కలిగించేది అనే అర్థం రాదు. ఈ అర్థం రావాలంటే భీత్యావహం (భీతి + ఆవహం) అని అనడం యుక్తం.

**భీ(బీ)తాహం :**

భయం అనే అర్థంలో ఈ పదం కొందరి వాడుకలో వినిపిస్తుంది. ఉదా:- భీతాహమౌతుంది.

భీతావహమనే పదమే వాడుకలో వకారం లోపించి భీ(బీ)తాహం అని ఏర్పడి ఉంటుంది. భీతావహమనే పదమే సాధువు కానప్పుడు భీ(బీ)తాహమనే పదం సాధువు కావడానికి వీలులేదు కదా! ఈ పదం వాడుకలోనే వినిపిస్తుంది కాని రచనలో వినివించదు.

చూ: భీతావహం.

**మత్స్యకారులు :**

పత్రికా రచయితలు సృష్టించి వాడుకలోకి తెచ్చిన పదం. బెస్తలు, జాలర్లు అనే అర్థంలో వాడబడుతుంది. సమాజంలోని నిమ్న

జాతులవారిని దేశ్య పదాలతో కాక సంస్కృత పదాలతో వ్యవహరించడం మర్యాదాకరమనే ఉద్దేశంతో పత్రికా రచయితలు వస్త్రకారుడు, స్వర్ణకారుడు, చర్మకారుడు, కుంభకారుడు మొదలైన పదాల మాదిరిగా మత్స్యకారులనే పదాన్ని సృష్టించి ఉంటారు. వస్త్రకారుడంటే వస్త్రాలు తయారుచేసేవాడని, చర్మకారుడంటే చర్మంతో వస్తువులు సిద్ధంచేసేవాడని అర్థం కదా! అట్లే మత్స్యకారులు అనేదానికి చేపలను తయారుచేసేవాళ్ళు, లేదా చేపలతో వస్తువులు తయారుచేసేవాళ్ళు అనే అర్థమే వస్తుంది కాని చేపలను పట్టేవాళ్ళు అనే అర్థంరాదు. ఐనప్పుడు బెస్తలు అనే అర్థంలో మత్స్యకారులని వాడడం యుక్తంగా కనిపించదు.

## మధ్యంతర :

Mid - term అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా సృష్టింపబడ్డ సంస్కృత సమపదం. అంతర అనే పదానికి సంస్కృతంలో గడువు (term) అనే అర్థం ఉంది. ఉదా :- మాసాంతరే దేయం ఋణమ్ (మాసం గడువులో తీర్చాల్సిన అప్పు) కనుక గడువు మధ్యలో అనే అర్థంలో ఈ పదకల్పన బాగానే ఉంది. కాని దీనిలో ఒక అనౌచిత్యం ఉంది. మధ్య శబ్దానికి అంతర శబ్దాన్ని చేర్చినపుడు సవర్ణదీర్ఘ సంధి వచ్చి మధ్యాంతర అనే రూపం ఏర్పడుతుంది. మధ్యంతర అని కాదు.

లేదా శకంధ్వాది గణంలో చేర్చుకొని పూర్వ రూపం చెప్పుకొని ఈ రూపానికి సాధుత్వం సమర్థించుకోవలసి ఉంటుంది.

## మనోల్లాసం :

మనస్+ఉల్లాసం అనే రెండు పదాలతో ఏర్పడిన రూపం. మనస్ అనేది సకారాంత శబ్దం. దీని చివరి సకారానికి హ్రస్వాకారం తప్ప తక్కిన అచ్చులు పరంగా ఉంటే పర్యాయంగా లోప,యకారాలు

వస్తాయి. అంటే మన ఉల్లాసం, మన యుల్లాసం అనే రూపాలు ఏర్ప డతా యన్నమాట. (మనస్ + ఉల్లాసం > మనర్ + ఉల్లాసం, మనయ్+ఉల్లాసం>మన ఉల్లాసం, మన యుల్లాసం.) హ్రస్వాకారం పరంగా ఉన్నప్పుడు మాత్రమే అస్ స్థానంలో ఓకారం వస్తుంది. ఉదా: మనోభీష్టం మొ॥ మనస్ + ఉల్లాసం అనే చోట హ్రస్వాకారం లేదు కనుక అస్ స్థానంలో ఓకారం రావడానికి అవకాశం లేదు. కనుక మనోల్లాసం అనే పదం వ్యాకరణసమ్మతం కాదు.

## మమేకం చేయు :

ఒకటిగా చేయు, లీనం చేయు అనే అర్థాల్లో వాడుకలో ఉన్న పదం. ఈ పదం తెలుగు వాడుకలోకి రావడం చాలా విచిత్రంగా కనిపిస్తుంది. సంస్కృతంలో మమ అంటే నాయొక్క, నాకు అని, ఏకం అంటే ఒకటి అని అర్థం. నాకు, ఒకటి, చేయు అనే ఈ మూడర్థా లకు ఏకార్థీ భావం - అంటే సామూహికమైన ఒక అర్థం కుదరడం లేదు. ఇందులో మరో అనౌచిత్యం కూడా కనిపిస్తుంది. అది సంధికి సంబంధించింది. మమ, ఏకం అనే పదాలను కలిపినప్పుడు సంధిలో మమైకం అని కావాలి. మొత్తంపైన తెలుగులో ఈ ప్రయోగం విలక్షణంగా కనిపిస్తుంది.

## మర్యాదస్థుడు :

మర్యాద కలవాడనే అర్థంలో ఈ పదం బాగా వాడుకలో ఉంది.

ఇందులో మర్యాద, స్థ అనే రెండు పదాలు ఉన్నాయి. ఇది కేవల సంస్కృత పదాల చేత ఏర్పడిన సిద్ధ సాంస్కృతిక సమాసం. ఇందులోని పూర్వపదం ఆకారాంత స్త్రీలింగమైన 'మర్యాదా' శబ్దం. సిద్ధ సాంస్కృతిక సమాసంలో పూర్వపదం స్వప్రాతిపదిక రూపం లోనే ఉండాలన్నది నియమం. అంటే మర్యాదా అని ఆకారాంతంగా

ఉండాలన్నమాట. అప్పుడీ పదం మర్యాదాస్థుడు అని కావాలి కాని మర్యాదస్థుడు అని కాదు.

ఐతే గృహస్థుడు, కులస్థుడు, దేశస్థుడు, మతస్థుడు, పరిచయస్థుడు మొదలైన శబ్దాల్లోని కుల, దేశ, మత మొదలైన హ్రస్వాంత శబ్దాల సాదృశ్యంవల్ల ఈ రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది.

## మహాత్యం/మహాత్యం/మాహాత్యం :

గొప్పతనమనే అర్థంలో కొందరు ఈ పదం వాడుతున్నారు. ఇది తప్పు ప్రయోగం.

సంస్కృతంలో మహత్ అనే శబ్దం ఉంది. దీనికి గొప్పవాడు/గొప్పది అని అర్థం. గొప్పవానిలో ఉండే గుణం అనే అర్థంలో మహత్ శబ్దంపై 'త్వ' ప్రత్యయం వస్తే మహత్త్వం అనే రూపం ఏర్పడుతుంది. (మహత్+త్వ=మహత్త్వం)

మహాత్మ అనే శబ్దంపై భావార్థంలో ష్యఞ్ ప్రత్యయం వస్తే మాహాత్మ్యం అనే రూపం ఏర్పడుతుంది. దీనికి కూడా గొప్పతనమనే అర్థం.

## మహాత్వం :

గొప్పవాడు / గొప్పది అనే అర్థం కలిగిన మహచ్ఛబ్దంపై భావార్థంలో 'త్వ' ప్రత్యయం వస్తే ఈ రూపమేర్పడుతుంది. అంటే ఇందులో మహత్+త్వ అనే రెండు పదాలున్నాయన్నమాట. వీటిని కలిపినప్పుడు ఏర్పడే శబ్దం మహత్త్వం అని కాని, మహాత్వం అని కాదు. అంటే ఈ శబ్దంలో రెండు తకారాలు రాయాలన్నమాట. ఒక తకారం మహత్ శబ్దానికి సంబంధించింది. రెండోది 'త్వ' ప్రత్యయానికి సంబంధించింది.

కనుక గొప్పతనమనే అర్థంలో మహత్త్వం అనో లేదా మాహాత్మ్యం అనో వాడాలి కాని మహత్యం, మహాత్యం, మాహాత్యం అని వాడగూడదు.

మాహాత్మ్యం అన్న పదమే క్రమంగా భ్రష్టమై మహత్యం, మహాత్యం, మాహాత్యం అని వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది.

## మహదానందం :

గొప్ప ఆనందం అనే అర్థంలో ఈ సమాసాన్ని వాడుతున్నాం.

ఈ సమాస పదంలో మహత్, ఆనంద అనే రెండు పదాలున్నాయి. ఇది కర్మధారయ సమాసం. కర్మధారయ సమాసంలో పూర్వపదంగా ఉన్న మహచ్ఛబ్దంలోని తకార స్థానంలో ఆకారం ఆదేశంగా వస్తుంది. (చూ:- "ఆన్మహతః సమానాధికరణ జాతీయయోః" అష్టాధ్యాయి 6-3-46.) ఈ నియమం ప్రకారం కర్మధారయ సమాసంలోని మహత్ శబ్ద తకారానికి ఆకారాదేశం వస్తే 'మహానందం' అని కావాలి. (మహత్ + ఆనంద > మహ + ఆ + ఆనంద > మహా + ఆనంద = మహానంద.)

షష్ఠీ తత్పురుషంగా చెప్పుకున్నప్పుడు మహదానందమనే పదం వ్యాకరణ రీత్యా దుష్టమేమీ కాదు. ఐతే, దానికి గొప్పవాళ్ళ ఆనందమనే అర్థమే వస్తుంది కాని గొప్ప ఆనందమనే అర్థం రాదు.

మహచ్ఛబ్దంలోని తకారం కర్మధారయ సమాసంలో ఆకారంగా మారుతుందన్న వ్యాకరణ నియమం తెలియకపోవడం ఈ దోషానికి కారణం సంస్కృత పదాలను ప్రయోగిస్తున్నపుడు ఆ భాషా వ్యాకరణ నియమాలను కూడా తెలుసుకోవడం అవసరం కదా!

**మహాత్మ్యమ్ :**

గొప్పతనమనే అర్థంలో ఈ పదం వాడబడుతుంది. సంస్కృతంలో మహాత్మన్ అనే పదం ఉంది. దీనికి గొప్పవాడని అర్థం. మహాత్మునిలోని గుణం అనే అర్థంలో మహాత్మన్ శబ్దంపై ఖ్యత్(య) ప్రత్యయం వచ్చి మకారం మీది అకారం ఆదివృద్ధిచే ఆకారంగా మారి మాహాత్మ్యమ్ అనే రూపం ఏర్పడుతుంది. (మహాత్మన్+ఖ్యత్>మహాత్మన్+య>మాహాత్మన్+య>మాహాత్మ్+య=మాహాత్మ్య) ఆదివృద్ధి రాని మహాత్మ్యమ్ అనే రూపం వ్యాకరణసమ్మతం కాదు.

**మహిళా ఔత్సాహిక పారిశ్రామికవేత్తలు :**

ఉత్సాహవతులైన స్త్రీ పారిశ్రామికవేత్తలు అని అర్థం. కనుక ఔత్సాహిక శబ్దాన్ని ముందుగానూ, మహిళా శబ్దాన్ని పారిశ్రామిక వేత్తలు అనే శబ్దానికి ముందుగానూ చేర్చి, ఔత్సాహిక మహిళా పారిశ్రామిక వేత్తలు అని అనడం యుక్తంగా ఉంటుంది. ఇందులోని ఔత్సాహిక శబ్దం కూడా వ్యాకరణ సమ్మతం కాదని చెప్పవచ్చు. చూ: ఔత్సాహికులు.

**మహిళాబాధితులు :**

మరో మహిళా పోలీస్‌స్టేషన్‌ను ఏర్పాటు చేస్తున్న సందర్భంగా "మహిళాబాధితులకు సత్వర న్యాయం" అనే శీర్షికతో ఒక వార్త ఈనాడులో ప్రచురింపబడింది. ఈ శీర్షికకు 'బాధాతప్తులైన మహిళలకు సత్వర న్యాయం' అని అర్థమని పత్రికా రచయిత భావించి ఉంటాడు. కాని, సమాసంలో ఉత్తరపదం కర్మణ్యర్థక రూపంగా ఉన్నప్పుడు పూర్వపదం తప్పకుండా తృతీయాంతంగానే ఉంటుంది కనుక మహిళా బాధితులు అన్న పదానికి మహిళలచే బాధింపబడిన వాళ్ళనే అర్థమే వస్తుంది కాని, బాధింపబడ్డ మహిళలనే అర్థం రాదు. బాధింప

బడిన మహిళలు, బాధలకు గురైన మహిళలు అనే అర్థం రావాలంటే బాధితమహిళలకు అని అనాలి.

సమాసంలోని పదాలు ఒకదానితో ఒకటి ఎలా అన్వయిస్తాయో తెలియకపోవడం ఇలాంటి అపప్రయోగాలకు కారణం. వ్యాకరణరీత్యా ఈ పదం సాధువే ఐనా, వక్త ఉద్దేశించిన అర్థాన్ని కాక పూర్తిగా దానికి విరుద్ధమైన అర్థాన్ని ఇవ్వడంవల్ల ఇది అపప్రయోగమే అని చెప్పడంలో సందేహం లేదు.

## మాతాపితరులు :

తలిదండ్రులనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాం. మాతా చ పితా చ అనే ద్వంద్వసమాసంలో 'మాతాపితరౌ' అనే రూపం ఏర్పడుతుంది. ఇది ద్వివచనాంత రూపం. ఈ రూపాన్నే ప్రాతిపదికగా గ్రహిస్తే మాతాపితరులనే రూపం తెలుగులో ఏర్పడే అవకాశం ఉంది. కాని తెలుగులో తత్సమరూపాలను సాధించుకునే సందర్భంలో విభక్త్యంత రూపాన్ని కాక ప్రాతిపదికనే గ్రహించడం పద్ధతి. కనుక ఇక్కడ మాతాపితరౌ అనే విభక్త్యంత రూపాన్ని కాక 'మాతాపితృ' అనే ప్రాతిపదికనే గ్రహించాలి. అప్పుడు మాతాపితలు అనే రూపమే ఏర్పడుతుంది కాని మాతాపితరులు అనే రూపం ఏర్పడదు.

## మీననేత్రి :

చేపల వంటి కన్నులు గలది అనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం. 'స్వాంగాచ్చోపసర్జనాదసంయోగోపధాత్' అనే పాణినీయ సూత్రంచే సంయోగం ఉపధావర్ణంగా లేని అంగవాచక శబ్దాలపై మాత్రమే స్త్రీలింగంలో ఙీష్ ప్రత్యయం విధింపబడింది. నేత్ర శబ్దం సంయోగోపధం కనుక దానిపై ఙీష్ (ఈ) ప్రత్యయం రాదు. స్త్రీలింగంలో మీన నేత్రీ అని కాదన్నమాట. టాప్ (ఆ) ప్రత్యయమే

వచ్చి మీననేత్రా అని ఆకారాంత రూపం ఏర్పడుతుంది. దీనికి తెలుగులో మీననేత్ర అనేది తత్సమరూపం. ఇట్లే పద్మనేత్రి అనే రూపం అసాధువు. పద్మనేత్ర అనేదే సాధురూపం. అంగ, గాత్ర, ఓష్ఠ, దంత, కర్ణ మొదలైన శబ్దాలు సంయోగోపధాలే ఐనా వీటిపై మాత్రం జీష్ ప్రత్యయం రావచ్చు. ఉదా:- సుందరాంగి, సుగాత్రీ, బింబోష్ఠీ, సుదతీ మొ॥ వీటిలో నేత్ర శబ్దం లేదు కనుక, దీనిపై జీష్ (ఈ) ప్రత్యయం రాదని గమనించాలి.

## ముభావం :

భావం అనేది సంస్కృత పదం. 'ము' అనేది ఏ భాషాపదం? దానికి భావశబ్దంతో ఏలా సమాసం ఏర్పడింది? ము శబ్దానికి అర్థమేమిటి? ఇది ఏ శబ్దానికి వికృతరూపం? సమాధానం చెప్పడం కష్టమే. 'మూకభావ' అన్న పదమే తెలుగు వాడుకలో ముభావమని అయ్యిందేమో? ఆలోచించాలి.

## మూర్తీభవించిన ఉద్యమప్రభంజనమూర్తి :

మూర్తీభవించిన ఉద్యమ ప్రభంజనం అంటేనే సరిపోతుంది. మళ్ళీ మూర్తి శబ్దాన్ని ప్రయోగించడంలో అర్థం లేదు. పదాలను ప్రయోగించేప్పుడు వాటి అర్థాన్ని కూడా పరిశీలించాలి కదా?

## మృచ్ఛకటికం :

మృత్+శకటిక అనే రెండు పదాలతో ఏర్పడ్డ ఈ పదం అసాధువేమీ కాదు. కాని, దీని ఉచ్చారణే చాలామందిలో తప్పుగా వినిపిస్తుంది. మృచ్ఛకటికం అన్న పదాన్ని మృచ్ఛ, కటికం అని 'ఛ' కారం దగ్గర ఆపి ఉచ్చరించడం తప్పు. ఈ విధంగా ఉచ్చరించినపుడు మృచ్ఛ అనే పదంలో ఉత్తరపదంలోని శకారం కూడా కలిసి ఉంది కనుక మృచ్ఛ, కటిక అనే పదాలు రెండూ నిరర్థకాలై పోతున్నాయి.

ఈ ఉచ్చారణ 'రాముని తోర పివరుండిట్లనియె' అనే మాదిరిగా ఉందన్నమాట. ఈ పదాన్ని మృచ్-ఛకటికం అన్న రీతిగా చకారం దగ్గర కొద్దిగా ఆపినట్లుగా ఉచ్చరించడం అర్థవంతంగా ఉంటుంది.

ఇలాగే అకశేరుకాలు, సకశేరుకాలు అనే పదాలను అక-శేరుకాలు, సక-శేరుకాలు అని ఉచ్చరించడం తప్పు.

## మోసకారులు :

సంస్కృతంలో 'కార' అంటే చేసేవాడని అర్థం. ఉదా : వస్త్రకారుడు, రథకారుడు మొ॥ ఐతే, ఈ పదాన్ని సంస్కృత పదాలకు మాత్రమే చేర్చాలి. తెలుగుపదాలమీద చేర్చగూడదు. మోసం అనేది తెలుగు పదం కనుక దానిమీద కారశబ్దాన్ని చేర్చినందువల్ల 'మోసకారులు' అన్న పదం వ్యాకరణ సమ్మతం కాదు. మోసగాళ్లు అంటే సరిపోతుంది. సంస్కృత పదం వాడాలంటే వంచకులని వాడవచ్చు.

## యజమాని :

ఈ ఇంటి యజమాని ఎవరు? మొదలైన వాక్యాల్లో యజమాని అనే పదం ప్రహతంగా వినబడుతుంది. ఇక్కడ దీనికి అధిపతి అని అర్థం.

సంస్కృతంలో యజమానశబ్దం అకారాంతం. 'యష్టా చ యజమానశ్చ' అని అమరం (2-7-8). దీన్ని తెలుగులో తత్సమంగా వాడినప్పుడు 'యజమానుడు' అనే రూపమే ఏర్పడుతుంది కాని, 'యజమాని' అని కాదు. 'యజమాను డంకస్థితార్థపేటి' అని మనుచరిత్ర ప్రయోగం (1-66).

సంస్కృతంలో 'యజమాని' శబ్దం లేకపోలేదు. దానికి యజమానులు కలవాడని అర్థం. (యజమానాః అస్య సంతి; యజమాన+ఇన్=యజమానిన్.) యజమానులు కలవాడు భృత్యుడౌతాడు కనుక

యజమాని అనే పదానికి భృత్యుడనే అర్థం వస్తుంది. అంటే, తెలుగులో యజమాని శబ్దాన్ని సంస్కృతానికి పూర్తిగా విరుద్ధమైన అర్థంలో వాడుతున్నామన్న మాట.

## యథోచితంగా :

ఉచితమైన విధంగా అనే అర్థంలో వాడబడుతున్న పదం. ఇది అవ్యయీభావ సమానం. ఉచితం అనతిక్రమ్య అని దీనికి విగ్రహ వాక్యం. ఈ విగ్రహవాక్యాన్ని బట్టి దీనికి ఉచితమైన దానిని అతిక్రమించకుండా అనే అర్థమే వస్తుంది. కాని, ఈ అర్థంకన్నా ఔచిత్యాన్ని అతిక్రమించకుండా అనే అర్థమే 'యథోచితం' అనే పదం వాడినచోట ఉచితంగా కనిపిస్తుంది. సాధారణంగా యథాశక్తి మొదలైన అవ్యయీభావ సమాసాల్లో ఉత్తరపదం విశేష్యంగా ఉండడమే యుక్తం కనుక. అందువల్ల యథోచితం అని వాడేబదులు యథౌచిత్యం, యథౌచితి అనే ప్రయోగాలు సముచితంగా కనిపిస్తాయి. లేదా ఉచితంగా అంటే ఏ ఇబ్బందీ ఉండదు.

## యాంత్రికపరంగా :

Technologically అనే పదానికి సమానార్థకంగా దీన్ని వాడుతున్నాం. యంత్ర విజ్ఞాన సంబంధంగా అని అర్థం. మంత్రపరంగా, దేశపరంగా, రాష్ట్రపరంగా, భాషాపరంగా మొదలైన పదాలు ఇలాంటివే. ఐతే వీటిలో పూర్వపదాలైన మంత్ర, దేశ, రాష్ట్ర మొదలైన పదాలు తద్ధితాంత రూపాలు కావు. వీటి మాదిరిగానే యాంత్రికపరమని కాకుండా యంత్రపరంగా అనో, యంత్ర విజ్ఞానపరంగా అనో అంటే సరిపోతుంది. యాంత్రిక అంటే యంత్ర విజ్ఞాన సంబంధం కల అని అర్థం. ఇది విశేషణం. దీనికి పరశబ్దంతో అన్వయం కుదరదు. కనుక యాంత్రికపరంగా అన్న ప్రయోగం సముచితం కాదు.

## యాత్రీకులు :

యాత్రీకులు, ప్రయాణీకులు, సంబంధీకులు, గోత్రీకులు మొదలైన పదాలన్నీ ఒకే గోత్రంలో పుట్టిన పదాలు.

యాత్రతో చరించేవాడు అనే అర్థంలో 'చరతి' (అష్టాధ్యాయి-4-4-8) అనే సూత్రంచేత ఠక్ ప్రత్యయం (ఇది ఇకగా మారుతుంది.) వస్తే యాత్రికులు అనే రూపం ఏర్పడుతుంది. ఇక ప్రత్యయంలోని ఇకారం హ్రస్వం కనుక యాత్రీకులు అనే దీర్ఘ ఈకారంతో కూడిన రూపం వ్యాకరణసమ్మతం కాదు. యాత్రికులు అన్నరూపమే సాధువు.

## యావత్తు :

'ఆస్తి యావత్తు, దేశం యావత్తు' ఇత్యాది వాక్యాల్లో యావత్ శబ్దం పూర్తి అనే అర్థంలో వాడబడుతుంది. యావదాంధ్ర దేశం, యావత్ప్రపంచం మొదలైన ప్రయోగాల్లో కూడా దీనికి ప్రయోగం కనిపిస్తుంది.

'భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు' అనే బాల వ్యాకరణ నియమం (3-87) ప్రకారం సంస్కృతంలోని హలంత సర్వనామాలకు తెలుగులో స్వతంత్రంగా ప్రయోగం ఉండదు. సమాసంలో నైతే పూర్వపదంగా వాడుకోవచ్చు. యావత్ అనేది యత్ శబ్దంపై పరిమాణార్థంలో డవతు ప్రత్యయం రాగా ఏర్పడిన హలంత సర్వనామం. కనుక దీనికి వ్యస్తంగా ప్రయోగం ఉండకూడదు.

కాని, వాడుకలో ఈ ప్రయోగం ప్రాచుర్యం పొందింది కనుక దీనిని విశేషప్రయోగంగా భావించి సాధువుగా గ్రహించాలి.

## యావదాస్తి :

కేవల సంస్కృత పదానికి - అంటే తత్సమంగా మారని సంస్కృత పదానికి - దేశ్యపదంతో సమాసం రావడం వ్యాకరణ

నియమ విరుద్ధం, అంతేకాక, తకారం సంధిలో దకారంగా మారడం (జశ్త్వసంధి) కేవలం సంస్కృత పదాలకు మాత్రమే జరగాలి. ఇక్కడ సంస్కృత పదానికి, తెలుగు పదానికి సంధి రావడం కూడా వ్యాకరణ విరుద్ధమే.

**యావన్మంది :**

మొత్తం మంది అని అర్థం. ఇందులో యావత్, మంది అని రెండు పదాలు ఉన్నాయి. ఇక్కడ యావత్ అనే కేవల సంస్కృత పదానికి - అంటే తత్సమంగా మారని సంస్కృత పదానికి - అందునా అవ్యయానికి మంది అనే దేశ్యపదంతో సమాసం రావడం వ్యాకరణ విరుద్ధం. ఇలా ఏర్పడిన పదాలను వైరి సమాసాలని అంటాం. ఇందులో మరో అనౌచిత్యం కూడా ఉంది. అనునాసిక సంధి కేవలం సంస్కృత పదాలకు మాత్రమే రావాలి. ఇక్కడ సంస్కృత పదానికి, తెలుగు పదానికి అనునాసికసంధి రావడం వ్యాకరణవిరుద్ధం.

కనుక యావజ్జనం అని సంస్కృతసమాసమో, మొత్తం మంది అని తెలుగుసమాసమో వాడితే సరిపోతుంది.

**యోచన :**

ఆలోచన అనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాం. యోచించు అనే క్రియారూపం కూడా వాడుకలో ఉంది.

సంస్కృతంలో ఆలోచించు అనే అర్థంలో యుచ్ అనే ధాతువు కానీ, యోచ్ అనే ధాతువు కానీ కనిపించదు. సంస్కృతంలో ఈ ధాతువు లేనప్పుడు సంస్కృతధాతువులపై భావార్థంలో రావలసిన ల్యుట్ (అన) ప్రత్యయం రావడానికి వీలు లేదు. అప్పుడు యోచన అనే రూపం ఏర్పడడానికి అవకాశం లేదు.

యోచించు అనేది తెలుగుపదం కూడా కాదు. తెలుగుపదమని భావించినా సంస్కృత ధాతువులమీద రావలసిన ల్యుట్ (అన) ప్రత్యయం పచ్చి యోచన అని ఏర్పడడం వ్యాకరణ విరుద్ధమే.

శబ్దరత్నాకర కర్త 'యోచన' అనే శబ్దాన్ని ఆకారాంత సంస్కృత శబ్దంగానూ, యోచించు అనే క్రియను తత్సమక్రియగానూ పేర్కొన్నాడు (పుట. 658). కాని పాణినీయ ధాతుపాఠంలో ఈ ధాతువు కనిపించదు.

## రాష్ట్రీయ :

రాష్ట్రంలో ఉన్న, రాష్ట్రంలో పుట్టిన మొదలైన అర్థాల్లో వాడుతున్న శబ్దం.

పై అర్థాల్లో రాష్ట్ర శబ్దంపై 'రాష్ట్రావారపారాద్ఘఖౌ' (4-2-96 అష్టాధ్యాయి) అనే సూత్రంచే ఘ ప్రత్యయం (ఇది 'ఇయ'గా మారుతుంది.) వస్తే రాష్ట్రియ అనే రూపమే ఏర్పడుతుంది. రాష్ట్రీయ అనే శబ్దం ఏర్పడాలంటే రాష్ట్ర శబ్దంపై 'ఛ' ప్రత్యయం (ఇది 'ఈయ'గా మారుతుంది) రావాలి. ఛ ప్రత్యయాన్ని విధించే నియమమేమీ లేకపోవడం వల్ల రాష్ట్రీయ శబ్దం ఏర్పడదు.

ఐతే రాష్ట్రీయ శబ్దమే భారతీయ భాష లన్నిటిలోను బాగా వాడుకలో ఉండడం గమనించదగ్గ అంశం. ఐతే రాష్ట్ర శబ్దాన్ని గహాదిగణంలో చేర్చుకొని 'గహాదిభ్యశ్చ' (4-2-138 అష్టాధ్యాయి) అనే సూత్రంచేత ఛప్రత్యయం చెప్పుకొని రాష్ట్రీయ శబ్దాన్ని సాధించుకోవలసి ఉంటుంది.

## రసరంజితమయంగా :

సభాకార్యక్రమాలను వ్యాఖ్యానించే సందర్భాల్లో వినబడే పదం.

వ్యాఖ్యాత ఉద్దేశంలో ఈ పదానికి రసరంజితం లేక రసమయం అని అర్థం కావచ్చు. అప్పుడు రసరంజితం అనో, రసమయం అనో అంటే సరిపోతుంది. రసరంజితం అంటే రసంచే రంజింపబడింది అని అర్థం. దీనికి 'నిండిన' అనే అర్థం కలిగిన మయట్ (మయ) ప్రత్యయంతో అన్వయం కుదురదు. 'రసరంజితంతో నిండింది' అనే అర్థం సముచితం కాదు కనుక. అంతేకాక మయట్ (మయ) ప్రత్యయం నామవాచకాలమీదే చేరుతుంది. ఉదా: జలమయం, స్వర్ణమయం మొ॥ రంజిత అనేది విశేషణం కనుక దానిమీద మయట్ (మయ) ప్రత్యయం రాగూడదు. అందువల్ల రసరంజితమయం అనే పదం అన్వయం పొసగని వ్యాకరణవిరుద్ధమైన పదం.

లేదా రసరంజితమైన అంశాలతో నిండిందనే అర్థం చెప్పుకొని దీనికి సాధుత్వం సాధించుకోవాలి.

**రాజరికం :**

రాజన్ శబ్దం సంస్కృతం. రిక అనేది తెలుగు తద్ధిత ప్రత్యయం. సంస్కృత శబ్దంపై తెలుగు తద్ధిత ప్రత్యయం చేర్చడం వ్యాకరణసమ్మతం కాదు.

కనుక రాజరికం అనే బదులు రాచరికం అంటే ఈ దోషం ఉండదు.

**రామణీయకత :**

సౌందర్యం అనే అర్థంలో ఈ పదం బాగా వాడుకలో ఉంది.

యోపధాద్గురూపోత్తమాద్వుఞ్ (5-1-132 అష్టాధ్యాయి) అనే సూత్రంచేత యకారం ఉపధగా, గురువర్ణం ఉపోత్తమంగా ఉన్న శబ్దాలపై భావార్థంలో వుఞ్ (ఇది అకగా మారుతుంది.) ప్రత్యయం వస్తుంది. రామణీయకం, సాహాయకం మొదలైన పదాలు సిద్ధిస్తాయి.

రమణీయస్య భావః రామణీయకం అనే వ్యుత్పత్తిచే దీనికి రమణీయత అని అర్థం. రామణీయకం అన్న పదానికే రమణీయత అనే అర్థం ఉన్నప్పుడు మళ్ళీ దానిపై భావార్థంలో తల్ ప్రత్యయం (త) చేర్చి 'రామణీయకత' అని ప్రయోగించడం వ్యాకరణవిరుద్ధం.

రామణీయకం అన్న పదంలో వుఞ్ (అక) ప్రత్యయం భావార్థంలో వచ్చిన ప్రత్యయమని తెలియకపోవడం ఈ దోషానికి కారణం.

## రికార్డుల నిక్షిప్తాగారం :

ఇది తెలుగు వెలుగుల నిక్షిప్త ప్రాంగణంలాంటి పదమే- 'రికార్డులు ఉంచబడిన గృహం' అనే అర్థంలో ఈ పదబంధం అప్పుడప్పుడూ పత్రికల్లో కనిపిస్తుంది.

ఇందులో నిక్షిప్తాగారం అనేది ఒక సమాసం. రికార్డుల నిక్షిప్తాగారం అనేది మరో సమాసం. నిక్షిప్తాగారం అంటే ఉంచబడిన గృహం అని అర్థం. రికార్డుల నిక్షిప్తాగారం అనే సమాస పదంలో రికార్డుల అనే పదం నిక్షిప్త అనే పదంతో అన్వయించి రికార్డులు ఉంచబడిన గృహం అనే అర్థం రావాలి. కాని, రికార్డుల అనే పదం నిక్షిప్త అనే పదంతోనూ, అగారం అన్న పదంతోనూ అన్వయించడానికి వీలులేదు. రికార్డుల అన్న షష్ఠ్యంతమైన పదానికి కర్మణ్యర్థమైన నిక్షిప్త శబ్దంతో అన్వయం ఉండదు కదా! అగార అనే శబ్దంతో అన్వయం ఉండడానికి వీలున్నా నిక్షిప్తాగారం అన్న సమాసపదంలో ఏకదేశంగా ఉన్న అగార అనే శబ్దంతో అన్వయించడం వ్యాకరణ విరుద్ధం. కనుక రికార్డుల నిక్షిప్తాగారం అనడంకన్నా 'రికార్డుల అగారం' (రికార్డుల గృహం) అంటే ఏ చిక్కూ ఉండదు.

## రుగ్మత :

రోగమనే అర్థంలో దీన్ని వాడుతున్నాం. ఇది తెలుగుపదం కాదు. చివర ఉన్న భావార్థకమైన తల్ (త) ప్రత్యయంవల్ల ఇది

సంస్కృత సమశబ్దమనే భ్రమ కలుగుతుంది. రుగ్మ అనే సంస్కృత శబ్దం లేదు కనుక సంస్కృతం కాని శబ్దం మీద భావార్థకమైన తల్ (త) ప్రత్యయం రావడం వ్యాకరణవిరుద్ధం.

సంస్కృతంలో 'రుగ్ణుడు' (రుజ్ + క్త=రుగ్ణ) అనే పదం ఉంది. దీనికి రోగి అని అర్థం. దీనిపై భావార్థంలో తల్ (త) ప్రత్యయం వస్తే 'రుగ్ణత' అని అవుతుంది. రోగమని దీని కర్థం. 'రుగ్ణత' అన్న పదమే వికృతిచెంది 'రుగ్మత' అయ్యిందేమో!

## రైతాంగం :

రైతు జనం అనే అర్థంలో ఇటీవల బాగా ప్రాచుర్యం పొందిన పదం.

ఇందులో రైతు- అంగం అనే రెండు పదాలు ఉన్నాయి. రైతు అనేది రయ్యత్ అనే అరబిక్ పదానికి తద్భవరూపం. అంగం అనేది సంస్కృత పదం. ఈ రెండింటికీ సంధి చేసినప్పుడు తెలుగు సంధి వస్తే రైతంగం అనీ, సంస్కృత సంధి వస్తే రైత్వంగం అనీ కావాలి. కాని, దీనికి భిన్నంగా రైతాంగం అనే విలక్షణమైన రూపం ఏర్పడింది.

యంత్రాంగం, మంత్రాంగం, రాజ్యాంగం మొదలైన అంగ శబ్దం ఉత్తర పదంగా ఉన్న పదాల్లో పూర్వపదం చివర దీర్ఘ ఆకారం కనిపిస్తుంది. దీని సాదృశ్యంతోనే రైతాంగం అనే రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది.

రైతాంగంలోని అంగశబ్దాని కర్థమేమిటో?సమాజంలో అంగంగా ఉన్న రైతులని అర్థమా? ఆలోచించాలి.

లవకుశ :

లవకుశుల చరిత్రగల నాటకాన్ని లేక సినిమాను 'లవకుశ' అనే పేరుతో వ్యవహరిస్తున్నాం.

'లవకుశ' అనే తత్సమ పదాన్ని విభక్తిరహితంగా వాడడం వ్యాకరణసమ్మతం కాదు. కనుక 'లవకుశులు' అనడం యుక్తం. లేదా లవకుశుల నుద్దేశించి రాయబడింది లేదా చిత్రీకరించబడింది అనే అర్థం చెప్పుకుంటే రఘువంశమ్, కుమారసంభవమ్, మాళవికాగ్ని మిత్రమ్ మొదలైన పదాల్లాగా 'లవకుశం' అని అనాల్సి ఉంటుంది. రఘువంశ, కుమారసంభవ, మాళవికాగ్నిమిత్ర అని ఆంగ్లపదాల మాదిరిగా విభక్తిరహితంగా 'లవకుశ' అని అనడం ఉచితం కాదు.

ఐతే, సంస్కృతంలో 'నామైకదేశే నామగ్రహణమ్' అనే ఒక న్యాయం ఉంది. అంటే, పేరులో ఏకదేశాన్ని ఉచ్చరించినా మొత్తం పేరు బోధించే అర్థాన్ని బోధిస్తుందని భావం. సత్యభామ అన్నపదంలో సత్య అన్నా, భామ అన్నా సత్యభామ అనే అర్థమే వస్తుంది. ఆవిధంగా 'లవకుశ నాటకం' అనే పేరులో ఏకదేశమైన 'లవకుశ' శబ్దాన్ని మాత్రమే ప్రయోగించినా 'లవకుశ నాటకం' అనే అర్థం వస్తుందని చెప్పుకుంటే 'లవకుశ' అన్న ప్రయోగానికి సాధుత్వం సమర్థించుకో వచ్చు.

లేఖాసాహిత్యం/లేఖారచన :

లేఖాసాహిత్యం, లేఖారచన మొదలైన సమాసాల్లో లేఖా శబ్దం ఆకారాంతంగా ప్రయుక్తమై కనిపిస్తుంది.

సంస్కృతంలో లేఖ అనే అకారాంత శబ్దం, లేఖా అనే ఆకారాంత శబ్దం - రెండూ ఉన్నాయి. లేఖ శబ్దానికి ఉత్తరం అని అర్థం. లేఖా శబ్దానికి రేఖ, (విద్యుల్లేఖా మొ॥) చిత్రరచన (లేఖావిధి) మొదలైన అర్థాలు ఉన్నాయి. లేఖాసాహిత్యం అన్నచోట ఉత్తరాలకు సంబంధించిన సాహిత్యం అని అర్థం కనుక ఈ పదంలో 'లేఖ' అని హ్రస్వఅకారాంతశబ్దాన్నే వాడాలి. కనుక లేఖసాహిత్యమన్న రూపమే వ్యాకరణసమ్మతం.

తెలుగులో 'లేఖ' అనే రూపాన్ని స్త్రీలింగ తుల్య శబ్దంగా వాడడంవల్ల సంస్కృతంలో ఇది ఆకారాంత స్త్రీలింగ శబ్దమై ఉంటుందన్న భ్రమ ఈ దోషానికి కారణం.

లేఖసాహిత్యం అన్న శబ్దంకన్నా లేఖాసాహిత్యమన్న పదమే శ్రవణ సుభగంగా ఉంది. కాని, లేఖా సాహిత్యమంటే రేఖలకు సంబంధించిన సాహిత్యం, రేఖాచిత్ర రచనకు సంబంధించిన సాహిత్యమనే అర్థాలు రావడంవల్ల శ్రవణసుభగం కాకపోయినా లేఖసాహిత్యమనే పదాన్ని వాడడమే యుక్తం.

**వంశావళి :**

ఒక వంశంలో పుట్టినవాళ్ళ సముదాయం అనే అర్థంలో ఈపదం వాడుకలో ఉంది.

ఇందులో వంశ, ఆవళి అనే రెండు పదాలున్నాయి. ఈ పదానికి వంశాల సముదాయం అని అర్థమే వస్తుంది కాని 'వంశంలో పుట్టిన వాళ్ళ సముదాయం' అనే అర్థం రాదు. వంశ శబ్దానికి వంశంలో పుట్టిన వాళ్ళనే అర్థం లేదు కదా! కనుక 'వంశావళి' అనే బదులు 'వంశ్యావళి' అని అనడం యుక్తం. వంశ్యులంటే వంశంలో పుట్టిన వాళ్ళని అర్థం కనుక వంశ్యావళి అనే పదం ఉద్దిష్టార్థాన్ని ఇవ్వగలుగుతుంది. ఉచ్చా

రణలో వంశ్యావళిలోని 'య' లోపించి క్రమంగా "వంశావళి" గా వికృతి చెంది ఉండవచ్చు.

**వయోపరిమితి :**

సంస్కృతంలో వయస్ శబ్దం సకారాంతం. సకారానికి క, ప వర్ణాలు పరంగా ఉన్నపుడు విసర్గ ఆదేశంగా వస్తుంది. కనుక 'వయఃపరిమితి' అని అనాలి. నాదాక్షరాలు పరంగా ఉన్నపుడు మాత్రమే సకారాంతశబ్దంలోని అస్ ఓకారంగా మారుతుంది. ఉదా : వయోవృద్ధులు, వయోధర్మము మొ॥ వయస్+పరిమితి అనేచోట నాదాక్షరం లేదు కనుక అస్ ఓకారంగా మారి వయోపరిమితి అని కావడానికి వీలులేదు. వయఃపరిమితి అనే అవుతుంది.

**వర్తకవాణిజ్యాలు :**

ఇందులో వర్తక, వాణిజ్య అనే రెండు శబ్దాలున్నాయి. వాణిజ్య అనేది సంస్కృత పదం. వర్తక మనే పదం సంస్కృతంలో ఉన్నా దానికి వాణిజ్యమనే అర్థం లేదు. కనుక ఇది సంస్కృత భాషా పదమై ఉండదు. సంస్కృతం కాని పదానికీ, సంస్కృత పదానికీ ద్వంద్వ సమాసం రావడం ఇందులోని అసంబద్ధత.

అంతేకాక ఇందులోని రెండు పదాలకూ వ్యాపారమనే అర్థమే కనుక ఏదో ఒక పదం ప్రయోగిస్తే సరిపోతుంది. రెండింటినీ ప్రయోగించడం పునరుక్తి దోషమౌతుంది.

**వర్ధంతి :**

'గొప్పవాడు మరణించిన రోజు' అనే అర్థంలో ఈ పదం ఇటీవల బాగా వ్యాప్తిలోకి వచ్చింది. ఈ పదాన్ని ప్రచారంలోకి తెచ్చినవాళ్ళు పత్రికారచయితలు. గాంధీ మహాత్ముడు చనిపోయిన

నాటినుండి ఈ పదం వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది. పత్రికారచయితలు ఈ పదాన్ని సృష్టించడానికి ఆధారమేమిటో, వాళ్ళకి పదం ఎలా తోచిందో తెలియదు. ఇది తెలుగు పదం కాదు. సంస్కృతపదమై ఉండాలి- కాని, సంస్కృతంలో కూడా ఈ పదం ఎక్కడా కనిపించదు. వాచస్పత్యాది సంస్కృత నిఘంటువుల్లోకానీ, అమరకోశాది కోశాల్లోకానీ ఈ పదం లేదు వృధ్ ధాతువు ఆత్మనేపది కనుక దీనిపై శతృ ప్రత్యయం రాదు కనుక వర్ధంతీ అనే శబ్దం ఏర్పడడానికి వీల్లేదు. జయంతీ శబ్ద సాదృశ్యంతో ఈ పదం ఏర్పడి ఉంటుందని సమర్థించుకున్నా దీనికి 'గొప్పవాడు మరణించిన రోజు' అనే అర్థం చెప్పడానికి ఆధారాలేమీ లేవు.

భారతీయుల్లో పుట్టినరోజు పండుగను జరుపుకునే ఆచారమే కాని మరణించిన గొప్పవారి మరణదినాన్ని జరుపుకునే అచారం లేదు. ఈ ఆచారం ఆధునికంగా వచ్చింది పాశ్చాత్య నాగరికతా ప్రభావంతో. కనుక సంస్కృతంలో ఈ అర్థంలో ఈ పదం ఉంటడానికి వీల్లేదు. ఈ విధంగా శబ్దసాధుత్వంలోనూ, అర్థసాధుత్వం లోనూ అనుచితంగా కనిపించే ఈ పదం వాడుకలోకి ఎలా వచ్చిందో పరిశీలిద్దాం.

సంస్కృతంలో "వర్ధాపనం" అనే పదం ఉంది. ఆయుస్సు వృద్ధి చెందడానికి పుట్టినరోజున చేసుకునే కర్మకాండ అని అర్థం. ధర్మశాస్త్రాలు కూడా ఈ కర్మకాండ విధానాన్ని 'వర్ధాపన విధి' అనే పేర వివరించడం కనిపిస్తుంది వర్ధంతి అనే పదం వ్యాకరణరీత్యా అసాధువే ఐనా దీనికి వర్ధాపన శబ్దంతో సాదృశ్యం ఉంది. కనుక ఈ పదం బ్రతికి ఉన్నవాని పుట్టినరోజుకే పేరు కావచ్చు కాని గొప్పవాడు మరణించిన రోజుకు పేరు కావడానికి వీలు లేదు.

జయంతికి పేరు కావలసిన వర్ధంతి శబ్దం విపరీత లక్షణచే మరణించిన దినం అనే అర్థాన్ని బోధిస్తుందని సమర్థించుకోవలసి ఉంటుంది.

**వర్షాచలం :**

రాజులు మొదలైనవాళ్ళు తమ నాశ్రయించినవాళ్ళకు సంవత్సరానికోసారి ఇచ్చే గ్రాసం అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది.

ఈ శబ్దంలో వర్ష, అచల అనే రెండు పదాలున్నాయి. వర్ష శబ్దానికి సంవత్సరమనే అర్థం ఉన్నా అచల శబ్దానికి గ్రాసం అనే అర్థం లేదు. కనుక ఈ శబ్దానికి పైన చెప్పుకున్న అర్థాన్ని బోధించే శక్తి లేదు. కనుక పై అర్థంలో ఈ శబ్దాన్ని వాడడం యుక్తం కాదు. 'వర్షాశనం' అని వాడడం యుక్తం. వర్షాశనం (వర్ష+అశనం) అంటే వర్షానికోసారి ఇచ్చే గ్రాసం అనే అర్థం వస్తుంది. వర్షాశనమనే పదమే వర్షాచలంగా వ్యవహారంలో మారి ఉంటుంది.

**వస్తువ :**

వస్తుశబ్దం ఉకారాంతమైన సంస్కృత శబ్దం. అమహద్వాచకం. కనుక ప్రథమైక వచనంలో 'వు' వర్ణకం చేరితే తెలుగులో వస్తువు అని కావాలి. కాని వాడుకలో 'వస్తువ' అనే రూపం కూడా వినిపిస్తుంది. ప్రథమైక వచనంలోనే కాక అన్ని విభక్తుల్లోనూ 'వ' కారంతో కూడిన రూపాలు కనిపిస్తాయి.

**వాంగ్మూలము :**

ఇందులో వాక్, మూలం అనే రెండు శబ్దాలు ఉన్నాయి. వీటికి సంధి చేసినపుడు కకారం ఙకారంగా మారి వాఙ్మయం మొదలైన పదాల మాదిరిగా 'వాఙ్మూలం' అని కావాలి. కాని పత్రికల్లో నిత్యం వాంగ్మూలమనే అసాధు రూపమే దర్శనమిస్తుంది. శబ్ద వ్యుత్పత్తి తెలియకపోవడం ఇలాంటి దోషాలకు కారణం, వాంగ్మూలమనే మాదిరిగా 'వాంగ్మయ' మనే పదం ఇంకా వాడుకలో రానందుకు సంతోషించాలి.

**వాదన :**

వాదించడమనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న పదం.

ప్రేరణార్థకమైన వద్ ధాతువుపై భావార్థంలో ల్యుట్ (ఇది 'అన' గా మారుతుంది.) ప్రత్యయం వస్తే ఈ రూపం ఏర్పడుతుంది. అప్పుడు దీనికి శబ్దింపజేయడమనే అర్థం వస్తుంది. ఉదా: వీణావాదనమ్, మృదంగవాదనమ్ మొ॥ వాదించడమనే అర్థం రాదు. ఈ అర్థంలో 'వాదన' శబ్దానికి బదులు 'వాదం' అని వాడితే సరిపోతుంది. వద్ ధాతువుపై భావార్థంలో ఘఞ్ (అ) ప్రత్యయం రాగా ఈ రూపం ఏర్పడుతుంది. దీనికి చెప్పడం, వాదించడం అని అర్థాలు.

**వాద్యకారిణి :**

పత్రికా భాషలో ఈ పదం ఎక్కువగా వాడుకలో ఉంది. వాద్య విద్యలో నిపుణురాలనేది ప్రయోక్త ఉద్దేశించిన అర్థం. కాని ఈ పదం ఆ అర్థాన్ని ఇస్తుందా! చిత్రకారిణి, శిల్పకారిణి మొదలైన శబ్దాలు ఉన్నాయి. వీటికి చిత్రాలను సిద్ధం చేసేది, శిల్పాలను సిద్ధం చేసేది అనే అర్థాలు కదా! అలాగే 'వాద్యకారిణి' అనే పదానికి కూడా వాద్యాలను సిద్ధం చేసేది అనే అర్థమే వస్తుంది కాని వాద్యవిద్యలో నిపుణురాలనే అర్థం రాదు.

కనుక ఈ అర్థంలో వాద్యకారిణి అని అనడం యుక్తం కాదు. వాద్యజ్ఞ అనో, వాద్యవిదుషి అనో అంటే సరిపోతుంది.

**వారసత్వం :**

బానిసత్వం లాగా తెలుగువాడుకలో బాగా స్థిరపడిపోయిన శబ్దం.

త్వ అనేది సంస్కృతంలో భావార్థక ప్రత్యయం. ఇది కేవలం సంస్కృత పదాలపై మాత్రమే చేరాలి. కాని ఇక్కడ వారసుడనే పర్షియన్ శబ్ద భవమైన వారస శబ్దంపైన చేరడం గమనించాల్సిన అంశం. 'వారస' శబ్దం సంస్కృత శబ్దమన్న భ్రమతో 'త్వ' ప్రత్యయం చేర్చడం జరిగి ఉంటుంది వారసుడన్న పదం వారిస్ అనే పర్షియన్ శబ్దానికి తద్భవం.

## వార్త :

నన్నయ భారతంలో నారదుడు ధర్మరాజును రాజ నీతి విషయాలను గురించి అడిగే సందర్భంలో ఈ కింది పద్యం కనిపిస్తుంది.

వార్తయంద జగము వర్తిలుచున్నది
యదియు లేనినాడ యఖిల జనులు
నంధకారమగ్నులగుదురు గావున
వార్త నిర్వహింపవలయు పతికి" (సభా. 1-51)

ఈ పద్యంలోని 'వార్త' అనే పదానికి చాలా మంది తెలుగు పండితులు సమాచారం (News) అనే అర్థాన్ని చెప్పి సమన్వయించిన సందర్భాలు గమనించవచ్చు. ముఖ్యంగా వార్తాపత్రికలను గురించి, జర్నలిజం గురించి వ్యాఖ్యానించే సందర్భంలో పై పద్యం ఉదాహరించడం కూడా కనిపిస్తుంది. పై పద్యంలోని 'వార్త' అనే పదానికి వృత్తి, జీవనోపాయం అని అర్థం కాని సమాచారం, News అని కాదు. ఈ పద్యానికి మూలమైన "వార్తాయాం సంశ్రితస్తాత లోకోఽయం" అనే శ్లోకానికి నీలకంఠుడు వ్యాఖ్యానం చేస్తూ "వార్తా కృషిర్వాణిజ్యం పాశుపాల్యం కుసీదం చేతి చతుర్విధా" - అని పేర్కొన్నాడు. వ్యవసాయం, వ్యాపారం, పశుపాలన, వడ్డీవ్యాపారం - అని వార్త

నాలుగు విధాలుగా ఉంటుందని దీనికర్థం. ఇక్కడ వార్త అంటే జీవనోపాయం, వృత్తి అనే కదా అర్థం!

## వార్ధక్యం :

ముసలితనమనే అర్థంలో ప్రచురంగా వాడబడుతున్న పదం.

వృద్ధస్య భావః (వృద్ధుని గుణం) అనే అర్థంలో వృద్ధ శబ్దంపై త్వ, తల్ (త) ప్రత్యయాలు వస్తే వృద్ధత్వం, వృద్ధత అనే రూపాలు ఏర్పడుతాయి. భావార్థంలో 'ద్వంద్వమనోజ్ఞాదిభ్యశ్చ' (5-1-733 అష్టాధ్యాయి) అనే సూత్రంచేత వుఞ్ (అక) ప్రత్యయం వస్తే వార్ధకం అనే రూపం ఏర్పడుతుంది. (వృద్ధ+వుఞ్>వృద్ధ+అక>వార్ధ+అక=వార్థక) వృద్ధ శబ్దం మనోజ్ఞాది గణంలో పఠింపబడకున్నా మనోజ్ఞాది గణం ఆకృతిగణం కనుక దీన్ని ఈ గణంలో చేర్చుకోవచ్చు. ఇలా ముసలితనమనే అర్థంలో వృద్ధ శబ్దంపై వృద్ధత్వం, వృద్ధత, వార్థకం అనే మూడు రూపాలు మాత్రమే ఏర్పడడానికి వీలుంది. కనుక వార్ధక్యమనే పదం వ్యాకరణ సమ్మతం కాదు. సంస్కృతంలో ఈ పదం ఎక్కడా కనిపించదు. తెలుగులో మాత్రమే వ్యవహారంలో ఉంది.

ఐతే ఒక విధంగా ఈ రూపాన్ని సమర్థించుకునే అవకాశం ఉంది. "చాతుర్వర్ణ్యాదిభ్యః స్వార్థే ఉపసంఖ్యానమ్" అనే వార్తికం చతుర్వర్ణ మొదలైన శబ్దాలపై స్వార్థంలో ష్యఞ్ (య) ప్రత్యయాన్ని విధిస్తుంది. వార్ధక శబ్దాన్ని చాతుర్వర్ణ్యాది గణంలో చేర్చుకొని దీనిపై స్వార్థంలో ష్యఞ్ ప్రత్యయం (య) చెప్పుకుంటే వార్ధక్యం అనే రూపం ఏర్పడుతుంది. ఐతే చాతుర్వర్ణ్యాదిగణం ఆకృతిగణం కాదు మరి!

## విచక్షణారహితం :

ఆలోచనారహితంగా అనే అర్థంలో దీన్ని ప్రయోగిస్తున్నాం. విచక్షణా అనేది విచక్షణ శబ్దానికి స్త్రీలింగ విశేషణ రూపం. ఈ పదా

నికి నేర్పు కలిగిన స్త్రీ అని అర్థం. కనుక విచక్షణారహితం అంటే 'నేర్పు కలిగిన స్త్రీలు లేనిది' అనే అర్థమే వస్తుంది. 'వైచక్షణ్యం కలాసు చ' మొదలైన ప్రయోగాల్లో విచక్షణ శబ్దానికి నేర్పుకలవాడనే అర్థం చెప్పుకుంటున్నాం కదా!

విచక్షణ శబ్దానికి విశేషంగా చెప్పడమనే మరో అర్థం కూడా చెప్పుకునే వీలుంది.

విపూర్వక చక్ష్‌ధాతువుపై భావార్థంలో ల్యుట్ (అన) ప్రత్యయం వస్తే ఈ అర్థం ఏర్పడడానికి వీలుంది. అప్పుడు కూడా విచక్షణా రహితం అంటే 'విశేషించి చెప్పడం లేనటువంటి' అనే అర్థమే వస్తుంది కాని ఆలోచనారహితంగా అనే అర్థం రాదు. అంతేకాక ఈ అర్థంలో విచక్షణా అనే స్త్రీలింగరూపం కూడా వ్యాకరణవిరుద్ధమే.

## విచ్ఛిన్నధోరణులు/విచ్ఛిన్నకరధోరణులు :

విచ్ఛిన్నం చేసే ధోరణులు అనే అర్థంలో ఈ పదాలకు పత్రికా రంగంలో బాగా వాడుక ఉంది. విచ్ఛిన్న ధోరణులనే పదానికి విచ్ఛిన్నమైన ధోరణులు అనే అర్థమే వస్తుంది కాని, విచ్ఛిన్నం చేసే ధోరణులు అనే అర్థం రాదు. విచ్ఛిన్నకరములైన ధోరణులు అనే అర్థంలో కరశబ్దానికి లోపం చెప్పి మధ్యమపదలోపి సమాసం కూడా చెప్పడానికి వీలులేదు- విచ్ఛిన్నకర అనే సమాసం ఏర్పడడానికి వీలు లేదు కనుక. విచ్ఛిత్తి కలిగించే ధోరణులు అనే అర్థంలో విచ్ఛిత్తికర ధోరణులనో, విచ్ఛేదకర ధోరణులనో, విచ్ఛేదక ధోరణులనో అనడం యుక్తం. విచ్ఛిన్న ధోరణులనే పదం ప్రయోక్త ఉద్దేశించిన అర్థంలో అసాధువే.

ఇలాగే విచ్ఛిన్నమే ధ్యేయం మొదలైన వాక్యాల్లో ధర్మివాచక మైన విచ్ఛిన్న శబ్దాన్ని వాడడం కనిపిస్తుంది. కాని ధర్మవాచకమైన 'విచ్ఛిన్నత' శబ్దాన్ని వాడడం యుక్తం.

## విదేశీ :

విదేశీ వస్తువులు, విదేశీ వ్యాపారం మొదలైన పదాల్లో ఈ పదం కనిపిస్తుంది.

ఇందులోని విదేశీ శబ్దం విదేశానికి సంబంధించిన అనే అర్థంలో వాడబడింది. 'విదేశీ' శబ్దం విదేశానికి సంబంధించిన అనే అర్థంలో సాధువు కాదు ఈ అర్థంలో 'విదేశీయ' అనేది సాధువు కనుక విదేశీ వస్తువులు, విదేశీ వ్యాపారం మొదలైనచోట్ల విదేశీ శబ్దానికి మారుగా విదేశీయశబ్దాన్ని వాడడమే వ్యాకరణసమ్మతం.

విదేశి అనే శబ్దానికి విదేశం కల అనే అర్థముంది. కనుక విదేశానికి సంబంధించిన అనే అర్థంలో ఈ పదాన్ని వాడడం కొంత సముచితంగా కనిపించినా అప్పుడు విదేశి వస్తువులు ఇత్యాదిగా విదేశి శబ్దాన్ని హ్రస్వాంతంగానే ప్రయోగించాల్సి ఉంటుంది.

విదేశి శబ్దంలాగే స్వదేశి శబ్దం కూడా వాడుకలో ఉంది. దీన్ని స్వదేశీయ అని వాడడం యుక్తం.

## విద్యుత్కోత :

పత్రికారంగంలో బాగా వాడుకలో ఉన్న పదం.

తత్సమంగా మారని కేవల సంస్కృత శబ్దం దేశ్య శబ్దంతో సమసించగూడదు. అలా సమసించిన శబ్దాలను వ్యాకర్తలు వైరిసమాసాలుగా పేర్కొన్నారు. విద్యుత్ శబ్దం తత్సమంగా మారకుండా కోత అనే దేశ్యశబ్దంతో సమసించడం ఇందులోని అనౌచిత్యం. విద్యుత్కొరత కూడ ఇలాంటి పదమే.

విద్యుత్ శబ్దాన్ని విద్యుత్తు అని తత్సమంగా మార్చుకొని 'విద్యుత్తు కోరత' అంటే ఏ దోషమూ ఉండదు.

విద్యుత్కోత మాదిరిగా 'జలకోత' అనే పదం వ్యవహారంలోకి రానందుకు సంతోషించాలి.

## విద్యుదీకరణం :

Electrification అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా ఈపదం వాడుకలో ఉంది. పత్రికారచన ద్వారా ఈ పదం వ్యాప్తిని పొందింది.

అభూత తద్భావం (అంతకుముందు లేకుండా ఇప్పుడు జరిగింది) అనే అర్థంలో నామవాచకాలపైనా, విశేషణాలపైనా కృ, భూ ధాతువుల కృదంత రూపాలు (కరణం, భవనం మొ॥) చేరుతాయి. అప్పుడు పూర్వపదం చివర ఉండే అవర్ణం ఈకారంగా మారి మానవీకరణం, మతాంతరీకరణం మొదలైన శబ్దాలు ఏర్పడతాయి. (మానవ+కరణం>మానవీ+కరణం=మానవీకరణం) ఇలాంటి రూపాలను చ్వి ప్రత్యయాంత రూపాలని అంటారు. వీటిలో కృదంతరూపాలు పరంగా ఉన్నప్పుడు పూర్వపదం చివర వచ్చే ఈకారం పూర్వపదం అకారాంతంగా ఉన్నప్పుడే వస్తుంది. విద్యుత్ శబ్దం అకారాంతం కాదు కనుక దీనికి కరణ అనే కృదంత రూపం పరంగా ఉన్నప్పుడు ఈకారం రావడానికి వీలులేదు. కనుక విద్యుదీకరణం అని అనరాదు. విద్యుత్కరణం అని అనాలి.

విద్యుత్కరణమనే పదం కూడా అంత యుక్తమైందిగా కనిపించదు. ఎందుకంటే దీనికి విద్యుత్తుగా చేయడమనే అర్థమే. మనం వాడుతున్నది విద్యుత్సహితంగా - విద్యుత్వంతంగా చేయడమనే అర్థంలో. కనుక ఈ అర్థంలో వైద్యుతీకరణం అనేది సముచితమైన ప్రయోగం. వైద్యుతం అంటే విద్యుత్సంబంధం కలది అని, వైద్యుతీకరణం అంటే విద్యుత్సంబంధం కలదిగా చేయడమని అర్థం.

**విద్వత్తు :**

తెలుగు నాలుకలపై బాగా నలిగిన మాట. వైదుష్యమనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాం.

దీన్ని 'విద్వత్' శబ్దానికి తత్సమరూపంగా భావించవలసి ఉంటుంది. విద్వత్ శబ్దానికి తత్సమరూపం విద్వాంసుడు. విద్వత్తు అని కాదు. ఒకవేళ 'విద్వత్తు' అనే శబ్దాన్ని 'విద్వత్' శబ్దానికి తత్సమంగా భావించినా విద్వాంసుడనే అర్థం కలిగిన విద్వత్ శబ్దం నుండి ఏర్పడిన విద్వత్తు అనే శబ్దానికి వైదుష్యం అనే అర్థం రావడానికి వీలులేదు. విద్వత్తు అనే తత్సమరూపం ఏర్పడడానికి వీలు లేక పోవడం, ఏర్పడినా దానికి విద్వాంసుడనే అర్థం కాక వైదుష్యమనే అర్థాన్ని కల్పించడం ఈ పదంలో కనిపించే అనౌచిత్యాలు.

విద్వత్ శబ్దానికి వైదుష్యమనే అర్థం ఉందన్న భ్రమ ఈ ప్రయోగానికి కారణమై ఉంటుంది. లేదా విద్వత్ శబ్దంపై భావార్థంలో తల్ (త) ప్రత్యయంరాగా ఏర్పడిన విద్వత్త అనే రూపమే పొరపాటున విద్వత్తు అని వ్యవహరింపబడుతున్నదేమో?

**విద్వత్పూర్ణమైన :**

వైదుష్యంతో నిండిన అనే అర్థంలో కొందరి వాడుకలో వినిపిస్తుంది.

విద్వత్ శబ్దానికి విద్వాంసుడనే అర్థమే కాని వైదుష్యమనే అర్థం లేదు చూ: విద్వత్తు; కనుక విద్వత్పూర్ణమైన అనే పదానికి విద్వాంసులతో నిండిన అనే అర్థమే వస్తుంది. వైదుష్యంతో నిండిన అనే అర్థం రాదు. ఈ అర్థంలో విద్వత్తాపూర్ణమనో, వైదుష్యపూర్ణమనో ప్రయోగించడం సముచితం.

వైదుష్యమనే అర్థంలో విద్వత్తు అనే పొరపాటు వాడుక ఆధారంగా ఈ రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది.

**విధివంచకులు :**

అమధ్య ఈనాడు పత్రికలోనో, ఆంధ్రప్రభ పత్రికలోనో 'విధి వంచకులను సమాదరించడం మానవతా లక్షణం' అన్న శీర్షికతో ఒక వార్త ప్రచురింపబడింది.

విధివంచకులంటే విధిని మోసగించే వాళ్ళని అర్థం. విధిని మోసగించే వాళ్ళను సమాదరించడం మానవతా లక్షణం ఎలా అవుతుంది? విధిచేత వంచింపబడిన వాళ్ళను సమాదరించడం కదా మానవతా లక్షణం! కనుక ఇక్కడ వాడవలసిన పదం వంచితులనే కాని వంచకులని కాదు. వంచితులు అంటే మోసగింపబడినవాళ్ళని అర్థం. వంచిత, వంచక శబ్దాల అర్థభేదం తెలియకపోవడం ఈ దోషానికి కారణం.

**విలేఖరి :**

పత్రికారచయిత అనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాం.

'వి' ఉపసర్గపూర్వక లిఖ్ ధాతువుపై కర్త్రర్థంలో ణ్వుల్ (అక) ప్రత్యయం వస్తే విలేఖకుడు అని కావాలి. (దీనికి రాసేవాడని అర్థం.) విలేఖరి అని కాదు. జూదరి, కల్లరి మొదలైన తెలుగు శబ్దాల సాదృశ్యం కారణంగా విలేఖరి అనే పదం ఏర్పడి వ్యాప్తిలోకి వచ్చి ఉంటుంది. ఏమైనా తెలుగు నామవాచకాలపై మత్వర్థంలోచేర్చే 'అరి' ప్రత్యయాన్ని సంస్కృత శబ్దంపైన-అందులోనూ ధాతువుపైన-చేర్చి 'విలేఖరి'ని సృష్టించడం వ్యాకరణ విరుద్ధం. లేఖకుడన్నట్లుగా విలేఖకుడంటే సరిపోతుంది.

**విలీనం :**

ఈ పదం తప్పేమీ కాదు. కాని ప్రయోగించవలసిన రీతిలో ప్రయోగించనప్పుడు ఏ సాధు శబ్దమైనా తప్పే అవుతుంది. 'అజిత్ వర్గం విలీనంపై స్వామి' అన్న వాక్యం తీసుకోండి. ఇందులోని విలీనం అనే పదం విశేషణం. కాని విలీనత అనే నామవాచకార్థంలో వాడ బడింది. కనుక ఈ సందర్భంలో 'విలీనం' అనే ప్రయోగం సముచితం కాదు. అంటే ధర్మవాచకం వాడవలసినచోట ధర్మివాచకం వాడడం జరిగిందన్నమాట. విలీనత అని వాడితే సరిపోతుంది.

**వివక్షత :**

భేదభావం అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది.

సంస్కృతంలో వివక్ష అంటే చెప్పాలనే కోరిక అని అర్థం. (వక్తుమిచ్ఛా వివక్షా) కాని తెలుగులో ఈ పదానికి భేదభావమనే అర్థం వచ్చింది. అర్థ విపరిణామంచేత ఈ కొత్త అర్థాన్ని సరిపుచ్చుకున్నా భావార్థకమైన వివక్షా శబ్దంపై మళ్ళీ భావార్థంలో తల్ (త) ప్రత్యయం వచ్చి వివక్షత అని ఏర్పడడం వ్యాకరణవిరుద్ధం.

**వివేకవర్ధని :**

'వివేకవర్ధని' సాధువా, 'వివేకవర్దిని' సాధువా అనే సందేహం జిజ్ఞాసువులకు కలుగుతుంటుంది. కనుక ఈ శబ్దాల స్వరూపాన్ని పరిశీలిద్దాం.

వివేకం వర్ధయతి (వివేకాన్ని పెంపొందించేది) అనే అర్థంలో ప్రేరణార్థకమైన వృధ్ ధాతువుపై కర్త్రర్థంలో 'నందిగ్రహి పచాదిభ్యో ల్యుణిన్యచః (3-1-134 అష్టాధ్యాయి) అనే సూత్రంచే ల్యు (అన) ప్రత్యయం వస్తే వివేకవర్ధన' అనే రూపమేర్పడుతుంది — అనంద

వర్ధన అనే పదంలాగా. దీనికి స్త్రీలింగంలో టాప్ (ఆ) ప్రత్యయం వచ్చి 'వివేకవర్ధనా' అని అవుతుంది. ల్యు ప్రత్యయంలో టవర్ణం ఇద్వర్ణంగా లేదు కనుక స్త్రీలింగంలో జీప్ (ఈ) ప్రత్యయం కాక టాప్ (ఆ) ప్రత్యయమే వస్తుందన్నమాట కనుక వివేకాన్ని వర్ధింప జేసేది అనే అర్థంలో తెలుగులో 'వివేకవర్ధన' అని అవుతుంది.

ప్రేరణార్థకమైన వృధ్ ధాతువుపై కర్త్రర్థంలో ణిని (ఇన్) ప్రత్యయం వస్తే వర్ధిన్ అని అవుతుంది. ఇది నకారాంతం కనుక స్త్రీలింగంలో 'ఋన్నేభ్యో ఙీప్' (4-1-5) అనే సూత్రం చేత జీప్ (ఈ) ప్రత్యయం వస్తే వర్ధినీ అవుతుంది. దీనికి వివేక శబ్దంతో షష్ఠీ సమాసం చేసినపుడు 'వివేక వర్ధినీ' అనే రూపం ఏర్పడుతుంది. అమృతవర్షిణీ మొదలైన రూపాలు ఇలాంటివే.

ఈ విధంగా స్త్రీలింగంలో, ల్యుప్రత్యయం వచ్చినపుడు టాప్ (ఆ) ప్రత్యయం వచ్చి 'వివేక వర్ధనా' అని, ణిని (ఇన్) ప్రత్యయం వచ్చినపుడు జీప్ ప్రత్యయం వచ్చి వివేకవర్ధినీ అనే రూపాలు ఏర్పడుతాయి.

పై నిరూపణవల్ల ల్యు (అన) ప్రత్యయం వచ్చినపుడు వివేక వర్ధనీ అనే జీప్ ప్రత్యయంతో కూడిన రూపం సాధువు కాదని తెలుస్తుంది.

ఐతే ఈ రూపానికి సాధుత్వం చెప్పుకోవడానికి మార్గమేమైనా ఉందా ఆలోచిద్దాం. 'కరణాధికరణయోశ్చ' (3-3-117 అష్టాధ్యాయి) అనే ఒక సూత్రం ఉంది. ఇది కరణార్థంలోనూ, అధికరణార్థంలోనూ ధాతువుపై ల్యుట్ ప్రత్యయం విధిస్తుంది. వర్ధ్యతే అనేన (దీనిచే వృద్ధి పొందింపబడుతుంది) లేదా వర్ధతే అనేన (దీనిచే వృద్ధి పొందుతుంది) అనే అర్థాల్లో వృధ్ ధాతువుపై ఈ సూత్రంచేత ల్యుట్ ప్రత్యయం

(అన) వచ్చి వర్ధన అని అవుతుంది. ల్యుట్ ప్రత్యయంలో టకార మిద్వర్ణంగా ఉన్నది కనుక 'టిడ్ఢాణఞ్' (4-1-15) అనే సూత్రంచేత స్త్రీలింగంలో ఙీప్ (ఈ) ప్రత్యయం వచ్చి వర్ధనీ అని కావచ్చు. తరువాత వివేక శబ్దంతో సమాసం వచ్చి 'వివేక వర్ధనీ' అనే రూపం ఏర్పడుతుంది. ఈ విధంగా 'వివేకవర్ధని' అనే శబ్దానికి కూడా సాధుత్వాన్ని సాధించుకోవచ్చు.

## విస్తీర్ణం :

దీని విస్తీర్ణమెంత? మొదలైన వాక్యాల్లో వైశాల్యమనే అర్థంలో ఈ పదం ప్రచురంగా వినబడుతుంది.

విస్తీర్ణం అనే పదం ధర్మివాచకం. విశాలమైనదని అర్థం. వైశాల్యమనే భావార్థంలో విస్తీర్ణత అని అనాలి. ఉదా: దీని విస్తీర్ణత ఎంత? మొ॥ ధర్మివాచక (విశేషణ) మైన పదాన్ని ధర్మవాచకం (abstract noun) గా వాడుతున్నామన్నమాట.

## వృద్ధాప్యం :

ముసలితనమనే అర్థంలో బాగా ప్రాచుర్యం పొందిన పదం. ఈ పదం వ్యవహారంలోనే కనిపిస్తుంది కాని ప్రాచీన కావ్యాల్లో ఎక్కడా కనిపించదు.

వృద్ధ శబ్దంపై భావార్థంలో త్వ, తల్ (త) ప్రత్యయాలు వస్తే వృద్ధత్వం, వృద్ధత అనే రూపాలు ఏర్పడుతాయి. భావార్థంలోనే వుఞ్ (అక) ప్రత్యయం వచ్చినపుడు వార్ధకం అనే రూపం కూడా ఏర్పడు తుంది. ఇలా ముసలితనమనే అర్థంలో ఈ మూడు పదాలను వాడ వచ్చు. కాని వృద్ధాప్యమనే పదం తెలుగులో ఎట్లా వాడుకలోకి వచ్చిందో పరిశీలించదగ్గ అంశం. ఇందులో వృద్ధ, ఆప్య అన్న రెండు శబ్దా

లున్నట్లుగా కనిపించినా 'అప్య' అన్నదానికి అర్థమేమిటో? మూల మేమిటో? తెలియదు.

వృద్ధాప్య శబ్దానికి వర్ధాపన శబ్దంతో ఏమైనా సంబంధముందో ఆలోచించాలి. వర్ధాపనమంటే జన్మదినంనాడు చేసుకునే కర్మకాండ విధి అని అర్థం. అనేక వర్ధాపన విధులు జరిగిన దశ అని అర్థం చెప్పుకుంటే వృద్ధత్వమనే అర్థంలో ఈ ప్రయోగాన్ని సమర్థించడానికి వీలౌతుంది.

**వేగవంతగతి :**

వేగం కలిగిన గమనమనే అర్థంలో ఈ పదం కొందరి వాడుకలో వినిపిస్తుంది.

వేగవంతమంటే వేగం కలిగిన అని అర్థం. దీనికి వేగవత్ అనేది ప్రాతిపదిక అంటే మూలశబ్దమన్నమాట. సమాసంలో పూర్వ పదాలుగా వాడే శబ్దాలను ప్రాతిపదిక రూపాలుగానే వాడాలి. కనుక ఈ శబ్దాన్ని 'వేగవంతగతి' అని కాక 'వేగవద్గతి' అని అనాల్సి ఉంటుంది. వ్యస్తంగా ప్రయోగించదలచుకున్నపుడు మాత్రం వేగ వంతమైన గతి అని ప్రయోగించవచ్చు. సమాసంలో వేగవంతగతి అని ప్రయోగించడం వ్యాకరణవిరుద్ధం.

**వేలాది :**

వేలాది జనం, వేలాది రూపాయలు మొదలైన ప్రయోగాల్లో ఈ పదం కనిపిస్తుంది.

వేలాది అంటే వేలకొద్ది అని అర్థం. ఆది పదానికి మొదలు, మొదలైన అని అర్థాలు. వేలాది అంటే వేలు మొదలైన లేక వేలు

మొదలుగల అని అర్థం. రెండో అర్థం తీసుకుంటే వేలకొద్ది అనే అర్థం కొంతవరకు పొసగుతున్నా వేలాది జనం, వేలాది రూపాయలు అనే సమాసాలు ఏర్పడడం వ్యాకరణవిరుద్ధమే.

## వైయాకరణి :

వ్యాకరణం చదివినవాడు, ఎరిగినవాడు అనే అర్థంలో 'తదధీతే తద్వేద' (4-2-59) అనే సూత్రంచే అణ్ (అ) ప్రత్యయం వచ్చి వైయాకరణ అనే శబ్దం ఏర్పడుతుంది. ఇది అకారాంత శబ్దం. కనుక తెలుగులో దీనికి వైయాకరణుడనే రూపమే కాని వైయాకరణి అనే ఇకారాంతరూపం ఉండదు.

## వైయ్యాకరణుడు :

వ్యాకరణం చదివినవాడు, ఎరిగినవాడు అనే అర్థంలో 'తదధీతే తద్వేద' (4-2-59) అనే సూత్రంచే అణ్ ప్రత్యయం చేరినపుడు వకారంమీద ఐకారం ఆగమంగా చేరి వైయాకరణుడనే రూపం ఏర్పడుతుంది (వ్యాకరణ+అ>వ్+ఐ+యాకరణ+అ= వైయాకరణ) ఈ ప్రక్రియలో యకారానికి ద్విత్వం వచ్చే ప్రసక్తి లేదు. అందువల్ల వైయ్యాకరణుడనే పదం వ్యాకరణ సమ్మతం కాదు. వైయాకరణుడనేదే సాధువు.

ఉచ్చారణలో యకారానికి ద్విత్వం ఉన్నట్లుగా భ్రమించడమే ఈ దోషానికి కారణం.

## వైరుధ్యం :

విరుద్ధస్య భావః (విరుద్ధమైన దానిలో ఉండే గుణం) అని దీని వ్యుత్పత్తి. ఇది 'విరుద్ధ' అనే విశేషణ శబ్దం నుండి భావార్థంలో ష్యఞ్ (య) ప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. (విరుద్ధ+య>

వైరుద్ధ+య>వైరుద్ద్+య = వైరుద్ధ్య) విరుద్ధ శబ్దంలోని చివరి సంయుక్త వర్ణంలో ధ వర్ణంతోపాటు 'ద' వర్ణం కూడా ఉంది. కనుక విరుద్ధ శబ్దంనుండి ఏర్పడ్డ శబ్దంలో కూడా ధ వర్ణంతోపాటు 'ద' వర్ణం కూడా ఉండాలి. కనుక ఈ శబ్దాన్ని 'వైరుధ్యం' అని కాకుండా 'వైరుద్ధ్యం' అని రాయడం వ్యాకరణసమ్మతం.

## వ్యతిరేకత :

విరుద్ధత అనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాం. వ్యతిరేక మనే పదం భావార్థం కనుక దీనికే విరుద్ధత అనే అర్థం వస్తుంది. అప్పుడు వ్యతిరేక శబ్దంపై మళ్ళీ భావార్థంలో తల్ (త) ప్రత్యయం చేర్చి 'వ్యతిరేకత' అని వాడడం వ్యాకరణసమ్మతం కాదు. భావార్థక పదం మీద మళ్ళీ భావార్థంలో ప్రత్యయం రాకూడదు కదా! కనుక వ్యతిరేకత బదులు వ్యతిరేకమంటే సరిపోతుంది.

వ్యతిరేకమనే పదం భావార్థకంకాక విశేషణమనే భ్రమతో భావార్థంలో తల్ (త) ప్రత్యయం చేర్చి వ్యతిరేకత అనే శబ్దాన్ని కల్పించడం జరిగి ఉంటుంది.

తల్ (త) ప్రత్యయంతో కూడిన రూపాన్ని ప్రయోగించదలచి నప్పుడు 'వ్యతిరేకిత' అని అనవచ్చు. వ్యతిరేకి అనేది ధర్మివాచకం కనుక దానిపై భావార్థంలో తల్ (త) ప్రత్యయం రావడంలో అభ్యం తరం లేదు.

## వ్యవస్థాపకదినం :

స్థాపింపబడిన దినం అనే అర్థంలో ఈ పదం ఇటీవల వాడుక లోకి వచ్చింది. ఉదా: తెలుగు విశ్వవిద్యాలయ వ్యవస్థాపక దినం మొ॥

ఇందులో వ్యవస్థాపక, దినం అనే రెండు పదాలున్నాయి. వ్యవస్థాపక శబ్దం కర్త్రర్థకం కనుక దానికి దినశబ్దంతో అన్వయం చెప్పినపుడు స్థాపన చేసిన దినం అనే అర్థం వస్తుంది. అంటే దినమే స్థాపన చేసిందని తాత్పర్యమన్నమాట. ఈ అర్థం అసందర్భంగా ఉంది. కనుక వ్యవస్థాపనదినమనో, స్థాపనదినమనో అంటే యుక్తంగా ఉంటుంది- వీటికి వ్యవస్థాపనం చేసిన రోజు, స్థాపనం చేసిన రోజు అని అర్థాలు కనుక.

**శక్తివంతులు :**

శక్తి కలవారనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం. సంస్కృతంలో నామవాచకాలపై కలవాడు, కలది అనే అర్థంలో మతుప్ అనే ప్రత్యయం వస్తుంది. ఉదా :- శక్తిమత్, బుద్ధిమత్, ధీమత్ మొ॥ వీటిని తత్సమాలుగా వాడినప్పుడు శక్తిమంతుడు, బుద్ధిమంతుడు, ధీమంతుడు మొదలైన మకారంతో కూడిన రూపాలు ఏర్పడతాయి.

అవర్ణాంత శబ్దాలకు, మకారం ఉపధగా ఉన్న శబ్దాలకు మతుప్ ప్రత్యయం పరంగా ఉన్నపుడు వీటిలోని మకారం వకారంగా మారుతుంది. (చూ : మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః 8-2-9) అట్లాగే అవర్ణం ఉపధగాగల సకారాంత శబ్దాలకు పరమైన మతుప్ ప్రత్యయంలోని మకారం వకారంగా మారుతుంది. ఉదా :

అకారం ఉపధగాగల శబ్దాలు :- జ్ఞాన+మత్ = జ్ఞానవత్; విద్యా+మత్=విద్యావత్.

మకారం ఉపధగాగల శబ్దాలు :- లక్ష్మి + మత్=లక్ష్మీవత్; చమూ+మత్=చమూవత్.

అవర్ణం ఉపధగాగల శబ్దాలు :- యశస్+మత్ = యశస్వత్; భాస్+మత్=భాస్వత్.

శక్తి శబ్దం ఇకారాంతం కనుక మతుప్‌లోని మకారం వకారంగా మారే నియమాలేవీ ఇక్కడ ప్రవర్తించవు. కనుక శక్తిమాన్ అనే చోట మకారం వకారంగా మారదు. అందువల్ల శక్తిమంతులనే రూపమే వ్యాకరణసమ్మతం. శక్తివంతులనేది కాదు.

**శతాబ్దం :**

వంద సంవత్సరాల సముదాయం అనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం. (శతానాపబ్దానాం సమాహారః అని ఈ సమాసానికి విగ్రహవాక్యం)

ద్విగురేకవచనం (2-4-1 అష్టాధ్యాయి) అనే సూత్రంచేత సమాహారార్థకమైన ద్విగువు ఏకవచనంలోనూ, 'అకారాంతోత్తరపదో ద్విగుః స్త్రియామిష్టః' అనే వార్తికంచేత అకారాంత శబ్దం ఉత్తర పదంగా గల ద్విగువు స్త్రీలింగంలోనూ ఉంటుంది. ద్విగోః (4-1-21 అష్టాధ్యాయి) అనే నియమం ప్రకారం అకారాంత శబ్దం ఉప పదంగా గల ద్విగువుపై స్త్రీలింగంలో జీప్ ప్రత్యయం రావాలి. ఈ నియమాల ప్రకారం సమాహారార్థక ద్విగుసమాసమైన శతాబ్ద శబ్దానికి ఏకవచనమూ, అకారాంతోత్తర శబ్దం ఉత్తరపదంగాగల ద్విగు సమాసం కనుక దీనిపై స్త్రీలింగమూ, జీప్ (ఈ) ప్రత్యయమూ రాగా 'శతాబ్దీ' అనే రూపం ఏర్పడుతుంది. తెలుగులో తత్సమంగా 'శతాబ్ది' అని అవుతుంది.

స నపుంసకమ్ (2-4-17 అష్టాధ్యాయి) అనే సూత్రం ప్రకారం సమాహారార్థకమైన ద్విగువు నపుంసక లింగంలో ఉండాలి కనుక సమాహారార్థంలో శతాబ్దం అనే నపుంసకలింగ రూపం కూడా ఉండ వచ్చుకదా అనే ఆశంక కలుగవచ్చు. కాని నపుంసక లింగాన్ని విధించే సూత్రానికి 'అకారాంత శబ్దం ఉత్తరపదంగా గల ద్విగుసమాసశబ్దాలకు

స్త్రీలింగాన్ని విధించే వార్తికం అపవాదం కనుక స్త్రీలింగమే వచ్చి 'త్రిలోకీ' మొదలైన పదాలవలె 'శతాబ్దీ' అనే రూపం ఏర్పడుతుంది.

పంచపాత్రం, త్రిభువనమ్ మొదలైనవి కూడా అకారాంత శబ్దాలు ఉత్తర పదాలుగా కల ద్విగు సమాసాలే కదా! వాటిపై నపుంసక లింగం వచ్చినట్లుగా శతాబ్ద శబ్దంపై కూడా నపుంసక లింగం వచ్చి శతాబ్దం అని ఏర్పడవచ్చు కదా అని మళ్ళీ ఆశంక కలుగవచ్చు. కాని 'పాత్రాదిభ్యః ప్రతిషేధో వక్తవ్యః' అనే వార్తికంచే పాత్రాది అకారాంత పదాలు ఉత్తర పదాలుగా గల ద్విగు సమాసాలకు స్త్రీలింగం నిషేధింపబడింది. పాత్రాదుల్లో అబ్దశబ్దం లేదు. కనుక దీనికి స్త్రీలింగ నిషేధం ఉండదు. ఇట స్త్రీలింగమే వచ్చి 'శతాబ్దీ' అని అవుతుంది. కనుక తెలుగులో శతాబ్దం అని వాడడం యుక్తం కాదు. ఇతర భారతీయభాషలన్నింటిలోనూ శతాబ్దీ అని వాడడమే కనిపిస్తుంది.

## శక్తిజనితం :

బ్రాహ్మీపిటావారి అడ్వర్టైజ్‌మెంటులో "వ్యాధి నిరోధకం - శక్తిజనితం" అనే రెండు సమాసపదాలు కనిపిస్తాయి. వీటిలో శక్తి జనితమన్న పదానికి "శక్తిని జనింపజేసేది" అనే అర్థం ప్రయోక్తకు ఉద్దిష్టమైనట్లుగా భావించవచ్చు. కాని శక్తిజనితమన్న పదానికి శక్తిచేత కలిగింపబడింది అనే అర్థమేకాని శక్తిని కలిగింపజేసేది అనే అర్థం రాదు. శక్తిచేత కలిగింపబడింది అనే అర్థం ఇక్కడ పొసగదు. శక్తిని కలిగింపజేసేది అనే అర్థమే ఇక్కడ యుక్తం. ఈ అర్థంలో శక్తి జనకం అనే ప్రయోగం వ్యాకరణసమ్మతం.

**శాశ్వితం :**

ఎల్లప్పుడు అనే అర్థం కలిగిన శశ్వత్ శబ్దంపై అణ్ ప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. (శశ్వత్ + అ > శాశ్వత్ + అ = శాశ్వత) సమస్త కాలాలకు సంబంధించినదని అర్థం. శశ్వత్ అనే మూలశబ్దం లోని 'శ్వ' వర్ణంలో అకారమే ఉంది కనుక దానినుండి ఏర్పడిన శాశ్వత శబ్దంలో కూడా అకారమే ఉండాలి. కనుక శాశ్వితం అనే ఇకారంతో కూడిన రూపం తప్పు. శాశ్వతం అన్న రూపమే వ్యాకరణ సమ్మతం.

**శాస్తి :**

శిక్ష అనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న పదం.

శాస్ ధాతువుపై భావార్థంలో క్తిన్ (తి) ప్రత్యయం వస్తే ఏర్ప డిన రూపం. శాస్ ధాతువుపై క్తిన్ ప్రత్యయం చేరినపుడు శాస్‌లోని ఆకారం ఇకారంగా మారుతుంది. (చూ : శాస ఇదఙ్ హలోః 6-4-34) అప్పుడు సంధిలో సకారం షకారంగానూ, తకారం టకారంగానూ మారి 'శిష్టి' అనే రూపం ఏర్పడుతుంది. (శాస్ + తి; శిస్ + తి > శిష్ + తి > శిష్ + టి = శిష్టి) కాని తెలుగు వ్యవహారంలో శాస్తి అనే రూపమే బాగా వాడుకలోకి వచ్చి 'శిష్టి' అనే సాధురూపం మరుగున పడింది.

**శిరచ్ఛేదం :**

ఇందులో శిరస్, ఛేదం అనే రెండు శబ్దాలున్నాయి. వీటిని కలిపినపుడు సంధిలో సకారం శకారంగా మారి శిరశ్ఛేదం అని కావాలి. (చూ : స్తోః శ్చునా శ్చుః 8-4-40) శిరస్ అనేది సకా రాంత శబ్దం. ఇందులోని సకారం చకారంగా మారే అవకాశం లేదు. కనుక శిరచ్ఛేదం అనే రూపం వ్యాకరణసమ్మతం కాదు.

అకారాంత శబ్దాలమీద ఛకారం పరంగా ఉన్నప్పుడు తుగా గమమూ, శ్చుత్వమూ వచ్చి వృక్షచ్ఛాయ, తరుచ్ఛాయ మొదలైన రూపాలు ఏర్పడతాయి. శిరశ్శబ్దం కూడా అకారాంతమనే భ్రమవల్ల ఈ రూపాల సాదృశ్యంతో 'శిరచ్ఛేదం' మొదలైన రూపాలు వాడుక లోకి వచ్చి ఉంటాయి.

## శివంకరుడు :

శివం కరోతీతి శివంకరః. శుభం కలిగించేవాడని అర్థం. శివ శబ్దంపై కృధాతువు చేర్చినపుడు కర్త్రర్థంలో ఏర్పడే రూపం ప్రియంవద వశంవద, లలాటంతప, విహంగమ, ఇరమ్మద మొదలైన శబ్దాల మాదిరిగా శివంకర శబ్దం ఏర్పడినట్లుగా కనిపిస్తుంది. ఈ శబ్దాల్లోని అనుస్వారం (ఇది ముమాగమం) ఖకార మిద్వర్ణంగా ఉన్న ఖచ్ మొదలుగా గల ప్రత్యయం అంతమందున్న పదం పరంగా ఉన్న పుడే వస్తుంది. (చూ: ఖిత్యనవ్యయస్య. 6-3.66) ప్రియ, వశ, లలాట మొదలైన శబ్దాలపై ఉన్న ధాతువుపై ఖకారమిద్వర్ణంగా ఉన్న ప్రత్యయాలు - ఖశ్, ఖచ్ మొదలైనవి - విధింపబడ్డాయి. కనుక అవి చివర ఉన్న పదాలు పరంగా ఉన్నప్పుడు పూర్వ శబ్దాలపైన ముమాగమం వచ్చి, అది అనుస్వారంగా మారి ప్రియంవద, వశం, వద, లలాటంతప మొదలైన రూపాలు ఏర్పడతాయి. కాని, శివ శబ్దం పూర్వపదంగా ఉన్న కృధాతువుపై ఖకారమిద్వర్ణంగా ఉన్న ప్రత్యయమేమీ వ్యాకరణంలో విధింపబడలేదు కనుక శివ శబ్దంపై ముమాగమం వచ్చి 'శివంకర' అనే రూపం ఏర్పడదు.

ఇట్లాగే శుభంకర, వశంకర, నాశంకర మొదలైన పదాలు కూడా వ్యాకరణ సమ్మతాలు కావు. వీటిలో శివంకర అనేది వైదిక శబ్దం. 'క్వచిద్వైదికా అపి శబ్దా లోకే ప్రయుజ్యంతే' అనే న్యాయాన్నిబట్టి

వైదిక పదాలు కూడా లోకవ్యవహారంలో ప్రయోగించవచ్చు కనుక శివంకర మొదలైన శబ్దాల ప్రయోగాన్ని సమర్థించవచ్చు.

**శీతాకాలం :**

చలికాలమనే అర్థంలో వాడబడుతున్న తత్సమపదం.

శీత శబ్దం హ్రస్వ - అకారాంత శబ్దం. కనుక శీతకాలం అనే అనాలి కాని శీతాకాలం అని కాదు. ఆకారాంతమైన 'వర్షా' శబ్దంతో ఏర్పడిన 'వర్షాకాలం' అనే శబ్ద సాదృశ్యంతో 'శీతాకాలం' అనే దీర్ఘంతో కూడిన రూపం-వానాకాలంలాగా-వాడుకలోకి వచ్చిఉంటుంది. తత్సమపదాల్లో పదమధ్యలో ఎట్టి మార్పూ కలుగరాదు కనుక శీతా కాలమనేది వ్యాకరణసమ్మతం కాదు.

**శోభస్కరం :**

శోభను కలిగించేది అనే అర్థంలో కొందరీ పదాన్ని వాడడం కనిపిస్తుంది.

సంస్కృతంలో శోభా శబ్దం ఆకారాంతం. దానిపై కృదాతు రూపం చేర్చినపుడు 'శోభాకరం' అని అవుతుంది. శోభస్కరం అని కాదు. శోభస్ అనే సకారాంతశబ్దం లేదు కదా!

శ్రేయస్కరం, యశస్కరం మొదలైన పదాల సాదృశ్యాన్ని బట్టి శోభస్కరమనే పదాన్ని కల్పించి ఉంటారు.

**శోభాయమానం :**

శోభించేది అనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న పదం.

శోభా ఇవ ఆచరతి శోభాయతే అనే వ్యుత్పత్తినిబట్టి శోభవలె కనిపించేది శోభాయమానమని అర్థం కనుక శోభాయమానంగా ఉంది

అనే వాక్యంలో శోభ మాదిరిగా ఉన్నది అనే అర్థమే వస్తుంది. కాని శోభించేదిగా ఉన్నది అనే అర్థంరాదు. శోభించేది అనే అర్థమే ఇక్కడ యుక్తమైంది. కనుక ఈ అర్థంలో శోభాయమానమని కాక శోభమానమనే పదమే ఉచితమైంది. శోభమానమంటే ప్రకాశించేది అని అర్థం.

**షడ్జమస్వరాలు :**

ఈ మధ్యే ఈ పేరుతో ఒక గ్రంథం ప్రచురింపబడింది. సప్త స్వరాల్లో షడ్జం అనేది ఒక స్వరం. మయూరస్వరాన్ని షడ్జ స్వరమని అంటారు. (షడ్జం మయూరో వదతి అని అమరం) దీన్ని షడ్జమ స్వర మనడం పొరపాటు.

పంచమ, మధ్యమ స్వరాల్లోని మకార సాదృశ్యంవల్ల షడ్జం షడ్జమమై ఉంటుంది.

**షష్ఠమం :**

షష్ఠమ ప్రకరణం, షష్ఠమాశ్వాసం మొదలైన పదాల్లో కొందరి వాడుకలో ఈ పదం వినబడుతుంది. ఆరవది అని దీనికర్థం. షష్ శబ్దంపై పూరణార్థంలో 'తస్య పూరణే డట్' (5-2-48 అష్టాధ్యాయి) అనే సూత్రంచే డట్ (అ) ప్రత్యయమూ, 'షట్ కతి కతిపయ చతురాం థుక్' (5-2-51 అష్టాధ్యాయి) అనే సూత్రంచే థుగాగమమూ రాగా 'షష్ఠ' అనే రూపం ఏర్పడుతుంది. (షష్+ అ>షష్+థ్+ అ=షష్+ఠ్+అ=షష్ఠ) పంచన్, సప్తన్ మొదలైన నకారాంత సంఖ్యావాచక పదాలపైనే మకారం ఆగమంగా విధింపబడింది. కనుక షకారాంతమైన షష్ శబ్దంపై మకారాగమం రాదు. అందువల్ల షష్ఠమ అనే రూపం వ్యాకరణసమ్మతం కాదు.

షష్ శబ్దానికి పూర్వమందుండే పంచమ శబ్దం, పరమందుండే సప్తమ, అష్టమ శబ్దాలు - వీటి సాదృశ్యంవల్ల షష్ఠమ శబ్దం వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది.

**షష్ఠమాంకనాటకం :**

ఆరంకాలుగల నాటకం అనే అర్థంలో ఈ పదాన్ని వాడడం కనిపిస్తుంది. ఇందులోని 'షష్ఠమ' అనే పదం వ్యాకరణ సమ్మతం కాదని పైన నిరూపింపబడింది. ఒకవేళ దాన్ని సాధువుగా భావించి గ్రహించినా దానికి ఆరవ అంకం కలిగిన నాటకం అనే అర్థమే వస్తుంది కాని ఆరంకాలు గలిగిన నాటకం అనే అర్థం రాదు. ఆరంకాలు కలిగిన నాటకం అనే అర్థంలో 'షడంక నాటకం' అని ప్రయోగించవలసి ఉంటుంది.

**సంగత్వం :**

సంబంధం, సహవాసం అనే అర్థాల్లో కొందరి వాడుకలో ఈ పదం కనిపిస్తుంది.

సంగం అంటేనే సంబంధం, సహవాసం అని అర్థాలు. భావార్థకమైన సంగ శబ్దంపై మళ్ళీ భావార్థంలో త్వ ప్రత్యయం చేర్చి సంగత్వం అని వాడడం వ్యాకరణ నియమ విరుద్ధం. సంగం అంటేనే సరిపోతుంది. లేదా సంగిత్వం అని ప్రయోగించవచ్చు. సంగం కలవాడు సంగి. అతనిలోని గుణం సంగిత్వం.

**సంచయిక :**

తపాలా శాఖ వాళ్ళు ఇటీవల 'సంచయిక' అనే పేరుతో ఒక పొదుపు కార్యక్రమాన్ని ప్రారంభించినారు. సమ్ ఉపసర్గ పూర్వకమైన 'చి' (చిఞ్ చయనే) అనే ధాతువునుండి ఈ రూపం ఏర్పడుతుంది. దీనికి సంచయనం చేసేది, పోగుచేసేది అని అర్థం. ఐతే ఈ అర్థంలో సమ్ పూర్వక చి ధాతువుపై కర్త్రర్థంలో ణ్వుల్ (అక) ప్రత్యయం, తరువాత ఆదివృద్ధి, అయాదేశమూ రాగా 'సంచాయక' అని ఏర్పడుతుంది. స్త్రీలింగంలో సంచాయికా అని అవుతుంది. కారికా, నాయికా,

స్మారికా, ధావికా మొదలైనవి ఇలాంటి రూపాలే కనుక సంచాయికా అనే వృద్ధి వచ్చిన రూపమే సాధువు కాని 'సంచయికా' అనేది సాధువు కాదు.

## సంవత్సరీకం :

మృతులైన వారికి ప్రతి సంవత్సరం మరణ దివసంనాడు చేసే కర్మ అనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది.

సంవత్సరానికి సంబంధించింది అనే అర్థంలో సంవత్సర శబ్దంపై ఠక్ (ఇది 'ఇక'గా మారుతుంది) ప్రత్యయమూ, ఆదివృద్ధీ వచ్చి 'సాంవత్సరికం' అని కావాలి. (సంవత్సర+ఠక్>సంవత్సర+ఇక>సాంవత్సర+ఇక>సాంవత్సర్+ఇక=సాంవత్సరిక) సంవత్సరీకం అన్న పదంలో ఆదివృద్ధి రాకపోవడం, రేఫమీది ఇకారం దీర్ఘం కావడం వ్యాకరణ విరుద్ధం. కనుక సాంవత్సరికం అని ప్రయోగించడం యుక్తం. ఠక్ (ఇక) ప్రత్యయం చేరిన పదాల్లో ఇకారాన్ని దీర్ఘంగా ఉచ్చరించడమనే పద్ధతి ఎందుకోగాని తెలుగువ్యవహారంలో ఎక్కువగా కనిపిస్తుంది. ఉదా :- యాత్రీకులు, గోత్రీకులు, సంబంధీకులు మొ॥

## సంస్కృతీవైభవం/సంస్కృతీసంప్రదాయాలు :

సంస్కృతి అనేది Culture అనే అర్థంలో ఇటీవలి కాలంలో వాడుకలోకి వచ్చిన పదం.

సమ్ ఉపసర్గ పూర్వక 'కృ' ధాతువుపై భావార్థంలో క్తిన్ (తి) ప్రత్యయం రాగా 'సంస్కృతి' అనే రూపం ఏర్పడుతుంది. క్తిన్(తి) ప్రత్యయంలోని 'తి' హ్రస్వ ఇకారాంతమైన ప్రత్యయం కనుక ఆ ప్రత్యయం చేరిన సంస్కృతి శబ్దం కూడా హ్రస్వ ఇకారాంతంగానే

ఉండాలి. 'సంస్కృతీ' అని దీర్ఘ ఈకారాంతంగా ఉండడానికి వీల్లేదు. అందువల్ల సంస్కృతీవైభవం, సంస్కృతీ సంప్రదాయాలు మొదలైన పదాల్లో 'సంస్కృతీ' అని ఈకారాంతంగా వాడడం వ్యాకరణ సమ్మతం కాదు. సంస్కృతి సంప్రదాయాలు, సంస్కృతివైభవం అనడం యుక్తం.

## సకాలం :

సరైన సమయం అనే అర్థంలో ఈ సమాస పదం వాడుతున్నాం. ఉదా: సభ సకాలంలో ప్రారంభమైంది మొ॥

కాలేన సహ వర్తతే అనే వ్యుత్పత్తినిబట్టి సకాలం అనే పదానికి కాలంతో కూడింది అనే అర్థమే వస్తుంది కాని, సరైన సమయం అనే అర్థం రావడానికి వీలులేదు. తెలుగులో ఈ పదానికి ఈ అర్థం ఎలా వచ్చిందో ఆలోచించాలి.

## సపరివారసమేతంగా :

'బంధుమిత్ర సపరివారసమేతంగా వివాహానికి వచ్చి మమ్మానందింపజేయగలరు' అనే వాక్యం మామూలుగా పెండ్లి పత్రికల్లో కనిపిస్తుంటుంది. ఇందులో 'సపరివారసమేతంగా' అనే పదం తప్పు. ఇందులోని 'స', 'సమేతం' అనే రెండు పదాలూ సహార్థకాలే. అంటే కూడిన అనే అర్థం కలవే. ఐనప్పుడు సపరివారంగా అనో, పరివారసమేతంగా అనో అంటే సరిపోతుంది. ఏకార్థకాలైన స, సమేత శబ్దాలను రెండింటిని వాడడం తప్పు. బంధుమిత్ర సపరివారసమేతంగా అనే సమాసాన్ని సబంధుమిత్రపరివారంగా అనో, బంధుమిత్ర పరివారసమేతంగా అనో అంటే ఏ దోషమూ ఉండదు.

**సఫలీకృతులగు :**

ఫలవంతులగు అనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం.

సఫలీకృతులు అనేది తత్సమపదం. ఇందులో సఫల, కృతులు అనే రెండు పదాలున్నాయి. సఫలులంటే ఫలితంతో కూడినవాళ్ళనీ, కృతులు అంటే చేయబడిన వాళ్ళని అర్థం. కనుక సఫలీకృతులు అనే పదానికి ఫలితంతో కూడిన వాళ్ళుగా చేయబడిన వాళ్ళు అనే అర్థం వస్తుంది. దానికి మళ్ళీ అయ్యారు అనే పదం చేరిస్తే 'ఫలితంతోకూడిన వాళ్ళుగా చేయబడిన వాళ్లైనారు' అనే అర్థం వస్తుంది. ఈ విధంగా చెప్పడం ద్రవిడప్రాణాయామంలాగా ఉంది. ఇంత వక్రంగా చెప్పడంకంటె 'సఫలులయ్యారు' అంటే సులభంగా ఉంటుంది.

**సమర్థవంతంగా :**

నిపుణంగా అనే అర్థంలో బాగా వాడుకలో కనిపించే పదం.

సమర్థ శబ్దంపై మతుప్ (మత్) ప్రత్యయం వచ్చి మకారం వకారంగా మారి సమర్థవంతం అనే రూపం ఏర్పడాలి. అప్పుడు దీనికి శబ్ద వ్యుత్పత్తి ననుసరించి - మతుప్ ప్రత్యయం కలవాడు/కలది అనే అర్థాల్లో వచ్చింది కనుక - దీనికి సమర్థులు కలది అనే అర్థమే వస్తుంది కాని సామర్థ్యం కలది, సమర్థమైనది అనే అర్థం రాదు. వ్యాకరణ రీత్యా సమర్థవంతుడనే పదం సాధువే ఐనా సమర్థుడు అనే అర్థంలో మాత్రం అసాధువే. ఈ అర్థంలో సమర్థుడు, సామర్థ్యవంతుడు అనే పదాలు సాధువులు. కనుక సమర్థంగా, సామర్థ్యంతో అనడం యుక్తం.

**సమిష్టి :**

సమస్తం అనే అర్థంలో వాడుకలో ఉన్న పదం. సమ్ పూర్వక అంజ్ ధాతువుపై భావార్థంలో క్తిన్ (తి) ప్రత్యయం చేరగా సమష్టి అనే రూపం ఏర్పడుతుంది. (సమ్+అంజ్+తి>సమ్+అజ్+తి= సమష్టి) అంజ్ ధాతువులోని అకారాన్ని ఇకారంగా మార్చి 'సమిష్టి' అని వాడడం పొరపాటు. వ్యష్టి (వి+అంజ్+తి) అనే రూపంలో అంజ్ ధాతువులోని అకారం ఇకారంగా మారక అకారంగానే ఉన్నట్టుగా సమష్టి అనే పదంలో కూడా మకారం మీద అకారమే ఉండాలి కాని ఇకారం ఉండగూడదు. సమష్టి అనడమే యుక్తం.

**సయోధ్య :**

పూర్వమున్న అభిప్రాయభేదాలు తొలగిపోయి మళ్ళీ ఏర్పడిన స్నేహభావం అనే అర్థంలో ఇటీవల ఈ పదం వ్యవహారంలోకి వచ్చింది. 'వారిద్దరికీ సయోధ్య కుదిరింది' మొదలైన వాక్యాల్లో ఈ పదాన్ని మనం వింటున్నాం.

అయోధ్య మాదిరిగా ఈ పదం వినడానికి బాగానే ఉందికాని దీనికి పై అర్థాన్ని బోధించే శక్తి ఉన్నట్లుగా కనిపించదు. అంతేకాక ఈ రూపం ఏర్పడడం కూడా సమంజసంగా కనిపించదు. యోద్ధుం శక్యా యోధ్యా, న యోధ్యా అయోధ్యా అని అయోధ్యా శబ్దానికి వ్యుత్పత్తి చెప్పవచ్చు. దీని ప్రకారం యుద్ధం చేయడానికి సాధ్యం కానిదని అర్థం. ఈ విధంగా సయోధ్యా శబ్దానికి వ్యుత్పత్తి చెప్పడానికి వీల్లేదు. సహశబ్దం యోధ్య శబ్దంతో సమసించదు. ఒకవేళ సమసించినా యోధ్యయా సహ వర్తతే అనే విగ్రహవాక్యాన్ని బట్టి యుద్ధం చేయ డానికి యోగ్యమైన దానితో కలిసి ఉన్నది అనే అర్థమే వస్తుంది. కాని సమరసభావం అనే అర్థం రాదు.

అయోధ్య అనే పదం సాదృశ్యంతో సయోధ్య అనే పదం కల్పితమై ఉంటుంది.

**సంబంధీకులు :**

సంబంధం కలవారనే అర్థంలో వాడబడుతున్న పదం.

కలవారనే అనే అర్థంలో సంబంధ శబ్దంపై ఇన్ ప్రత్యయం (అత ఇనితనౌ 5.2.115) వస్తే సంబంధిన్ అనే శబ్దం ఏర్పడుతుంది. దీనికి సంబంధి అని తత్సమ రూపం. కనుక సంబంధం కలవారనే అర్థంలో తెలుగులో సంబంధులు అని అనాలి.

సంబంధ శబ్దం కృదంతం (సమ్+బంధ్+అ=సంబంధ) కనుక దానిపై ఠన్ ప్రత్యయం (ఇది ఇకగా మారుతుంది.) రావడానికి వీలులేదు. ఒకవేళ ఠన్ ప్రత్యయం వచ్చినా సంబంధికులనే రూపమే కాని సంబంధీకులు అనే రూపం ఉండదు.

**సక - శేరుకాలు :**

కశేరుకం అంటే వెన్నెముక అని, సకశేరుకాలు అంటే వెన్నెముకతో కూడినవి అని అర్థం. ఇది వ్యాకరణసమ్మతమైన పదమే కాని, దీని ఉచ్చారణ కొందరిలో సక-శేరుకాలు అని తప్పుగా వినిపిస్తుంది. క దగ్గర ఆపి సక - శేరుకాలు అని ఉచ్చరించినపుడు ఈ రెండు పదాలకూ అర్థమేమీ ఉండదు. కనుక దీన్ని స - కశేరుకాలు అని స దగ్గర కొద్దిగా ఆపి ఉచ్చరించడం యుక్తం. అప్పుడు రెండు పదాలూ అర్థవంతాలై కశేరుకాలతో కూడినవి అనే అర్థం వస్తుంది.

ఇట్లే అకశేరుకాలు అనే పదాన్ని అక - శేరుకాలు అని కాక అ - కశేరుకాలు అని ఉచ్చరించడం యుక్తం.

**సన్మానం :**

గౌరవం (honour) అనే అర్థంలో ఈ పదం బాగా వాడుకలో ఉంది.

ఇందులో సత్, మానం అని రెండు పదాలున్నాయి. సత్ అంటే మంచిది. మానమంటే గౌరవం కనుక సన్మానమనే పదానికి మంచి గౌరవమనే అర్థం వస్తుంది ఈ పదం వ్యాకరణరీత్యా తప్పేమీ కాదు. కాని గౌరవం అనే అర్థంలో సంస్కృతంలో 'సన్మాన' పదంకన్నా 'సమ్మాన' పదం బాగా ప్రసిద్ధమైంది. ఇది సమ్ పూర్వక మాన ధాతువు నుండి ఏర్పడ్డ పదం. హిందీ మొదలైన భారతీయ భాషల్లో కూడా సమ్మాన పదానికే ఎక్కువ వాడుక ఉంది. కనుక గౌరవమనే అర్థంలో సన్మానం అనే పదంతోపాటు సమ్మాన పదం కూడా వాడ వచ్చు. సమ్మాన పదానికి నేటి తెలుగులో అసలు వాడుక లేకపోవడం గమనించదగ్గ అంశం.

## సన్యాసం :

ఇందులో సమ్, న్యాస అనే రెండు శబ్దాలున్నాయి. వీటికి సంధి చేసినపుడు సమ్‌లోని మకారం పరసవర్ణాదేశంచే నకారంగా మారుతుంది. అపుడు సన్న్యాస అనే శబ్దం ఏర్పడుతుంది. (సమ్+న్యాస>సన్+న్యాస>సన్న్యాస) పరసవర్ణాదేశంచే మకార స్థానంలో వచ్చిన నకారమూ, న్యాస శబ్దంలో ఉన్న నకారమూ సన్న్యాస శబ్దంలో ఉండాలి. కనుక ఒకే నకారంతో కూడిన సన్యాస శబ్దం వ్యాకరణసమ్మతం కాదు.

## సభికుడు :

'సభికా ద్యూత కారకాః' అని అమరకోశకారుడు సభిక శబ్దానికి జూదగాడనే అర్థాన్ని పేర్కొన్నాడు. భానోజీ దీక్షితుడు రచించిన అమరసుధా వ్యాఖ్యానంలో సభ అంటే ద్యూత గృహమనీ, అది ఆశ్రయంగా కలవాడు సభికుడని అర్థం చెపుతూ సభా శబ్దంపై ఠన్ ప్రత్యయం (ఇది ఇకగా మారుతుంది) చే సభికుడన్న రూపం ఏర్పడి

నట్లుగా పేర్కొన్నాడు. సభ అంటే సభాగృహమనే అర్థం ఉన్నా అది ఆశ్రయంగా కలవాడు అనే అర్థంలో సభికుడనే రూపం ఏర్పడినట్లుగా వ్యాఖ్యాత చెప్పలేదు. అమరకోశకారుడు కూడా సభ్యులనే అర్థంలో సభాసదులు, సభాస్తారులు, సభ్యులు, సామాజికులు అనే నాలుగు పదాలనే పేర్కొన్నారు. "సభాసదః సభాస్తారాః సభ్యాః సామాజికాశ్చ తే" (అమరకోశం. 2-7-16) సభికులన్న పదాన్ని పేర్కోలేదు. కనుక సభికులన్న పదం వ్యాకరణ రీత్యా సాధురూపమే ఐనా జూదగాడనే అర్థంలోనే ప్రసిద్ధం. 'అయమస్మాకం పూర్వసభికో మాథుర ఇత ఏవాగచ్ఛతి' అని మృచ్ఛకటిక ప్రయోగం.

సభ్యులన్న అర్థంలో దీన్ని ప్రయోగించకూడదు.

**సముఖం :**

'ఎదురు' అనే అర్థంలో వాడబడుతున్నపదం.

ముఖేన సహ వర్తతే అనే వ్యుత్పత్తినిబట్టి సముఖం అనే దానికి ముఖంతో కూడింది - నోరు కలది - అంటే మాటకారి అనే అర్థం వస్తుంది. ఎదురు అనే అర్థం రాదు. 'ఎదురు' అనే అర్థంలో 'సమ్ముఖమ్' అని వాడాలి. ముఖస్య సమీపే సమ్ముఖమ్ అని వ్యుత్పత్తి. ముఖం ఎదుట అని అర్థం. తరువాత ఎదుట అనే అర్థంలో సంకోచాన్ని పొందింది. ఇందులో సమ్, ముఖ అనే రెండు పదాలున్నాయి. కనుక దీన్ని సమ్ముఖం అని అనాలి. 'కామం న తిష్ఠతి మదాననసమ్ముఖీ సా.' అని శాకుంతలం (1-31) లోనూ, 'రురోధ సమ్ముఖీనో హి' అని రఘువంశం (15.17) లోనూ సమ్ముఖపదమే కనిపిస్తుంది.

సమ్ముఖమే తెలుగు వ్యవహారంలో సముఖమై కావ్యాల్లోకి కూడా ఎక్కింది. 'కొనిపోయి సముఖంబునఁ బెట్టిన' అని జైమిని భారతప్రయోగం.

సరళి :

మార్గం, రీతి, విధానం అనే అర్థాల్లో ఈ పదాన్ని వాడుతున్నాం.

సంస్కృతంలో మార్గమనే అర్థంలో 'సరణి' అనే పదం ఉంది కాని 'సరళి' అనే పదం లేదు. సంస్కృత భాషలోనే 'సరళి' అనే పదం ఎక్కడా కనిపించదు. ఏ నిఘంటువులోనూ ఈ పదం లేదు. ఈ పదం తెలుగులో ఎలా ఏర్పడిందో ఆలోచించాలి.

సరిసమానం :

ఇందులోని సరి, సమానం అనే రెండు పదాలకూ అర్థం ఒక్కటే. కనుక సరి అన్నా, సమానమన్నా చాలు. సరి సమానం అనడం పునరుక్తి.

సవిమర్శనాత్మక :

విమర్శనాత్మక అంటేనే విమర్శన ప్రధానమైన, విమర్శతో కూడిన అనే అర్థాలు వస్తున్నప్పుడు మళ్ళీ సహార్థకమైన 'స' శబ్దం చేర్చడం వ్యాకరణ సమ్మతం కాదు. 'స' శబ్దాన్ని చేర్చినపుడు సవిమర్శన అంటే సరిపోతుంది. విమర్శతో కూడిన అనే అర్థం వస్తుంది. ఆత్మక అవసరం లేదు. కనుక ఈ పదాన్ని సవిమర్శన అనో, విమర్శనాత్మక అనో అంటే సరిపోతుంది.

సశాస్త్రీయం :

శాస్త్రానికి సంబంధించింది శాస్త్రీయం. అంటే శాస్త్ర బద్ధమని అర్థం. ఈ అర్థంలో శాస్త్రీయంగా అంటే సరిపోతుంది. దీనికి కూడిన అనే అర్థం కలిగిన 'స' అనే పదాన్ని చేర్చడం అనవసరం. 'స' చేర్చినపుడు శాస్త్రానికి సంబంధించిన దానితో కూడిందనీ, శాస్త్రంతో కూడిన దానికి సంబంధించిందనీ అర్థాలు ఏర్పడతాయి. ఈ అర్థాలు శాస్త్ర బద్ధ

మనే అర్థంలో పొసగవు. కనుక శాస్త్రీయమనే పదాన్ని వాడడమే యుక్తం.

## సహాయం :

'నీ సహాయం కావాలి' మొదలైన వాక్యాల్లో సహకారం అనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం. ఇది సంస్కృత పదం. సంస్కృతంలో దీనికి సహాయంగా ఉండేది (helpfull) అని అర్థం. అంటే అది ధర్మివాచకమన్నమాట. కనుక దీన్ని 'నీవు సహాయుడవు కావాలి' అనే విధంగా ప్రయోగించాలి. ధర్మ (భావ) వాచకంగా వాడాల్సినప్పుడు 'సాహాయ్యం' (help) అనాలి. ఉదా: నీ సాహాయ్యం కావాలి. అంటే తెలుగులో ధర్మివాచకమైన సహాయ శబ్దాన్ని ధర్మవాచకంగా వాడుతున్నామన్నమాట.

## సహాయసహకారాలు :

సహాయం అన్నా సహకారమన్నా ఒకే అర్థం కనుక ఏదో ఒక పదం వాడితే సరిపోతుంది.

ఇందులో మరో అనౌచిత్యం కూడా ఉంది. సహాయ అనే పదం ధర్మివాచకమని పైన చెప్పుకున్నాం. ద్వంద్వ సమాసంలో సహాయ అని ధర్మివాచకం కాక సాహాయ్యం అని ధర్మవాచకం వాడడం యుక్తం. సాహాయ్యమనే పదం వాడినా సాహాయ్య, సహకార శబ్దాలు రెండింటికీ ఒకే అర్థం కనుక పునరుక్తిదోషం కలుగుతుంది.

కనుక సాహాయ్యమనో, సహకారమనో వాడడం సముచితం.

## సహేతుపూర్వకంగా :

హేతుబద్ధంగా అనే అర్థంలో కొందరి వాడుకలో వినిపిస్తున్న పదం.

హేతుపూర్వకంగా అని అంటేనే హేతుబద్ధంగా అనే అర్థం వస్తున్నపుడు మళ్ళీ దానికి సహార్థకమైన 'స' చేర్చడం అనవసరం. అయుక్తం కూడా - సశాస్త్రీయం లాగా. సహార్థకమైన 'స'ను ప్రయోగించ దలచుకున్నప్పుడు పూర్వ శబ్దం అనవసరం. అయుక్తం, సహేతుకం అంటే సరిపోతుంది.

అంటే స శబ్దాన్ని ప్రయోగించినపుడు పూర్వశబ్దాన్నీ, పూర్వ శబ్దాన్ని ప్రయోగించినపుడు 'స' శబ్దాన్నీ ప్రయోగించడం వ్యాకరణ విరుద్ధ మన్నమాట. అందువల్ల సహేతుకం అనో, హేతు పూర్వకంగా అనో అనడం యుక్తమన్నమాట. చూ : సశాస్త్రీయం.

## సహోదరి/సోదరి :

తోబుట్టువైన స్త్రీ అనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న పదాలు.

వీటిలో సహ, ఉదర అనే రెండు పదాలున్నాయి. సహ తుల్యే ఉదరే జాతః అని వ్యుత్పత్తి. తుల్యగర్భంలో జన్మించినవాడని అర్థం. 'సహ' శబ్దానికి 'స' ఆదేశం వికల్పంగా వచ్చి సహోదరుడు, సోదరుడు అనే రూపాలు ఏర్పడతాయి వీటికి స్త్రీలింగంలో 'నాసికోదరౌష్ఠ జంఘా దంత కర్ణ శృంగాచ్చ. 4-2-55 (నాసికా, ఉదర, ఓష్ఠ, జంఘా, దంత, కర్ణ, శృంగ అనే శబ్దాలు ఉపసర్జనాలుగా అంతమందున్న పదాలపై స్త్రీలింగంలో ఙీష్ (ఈ) ప్రత్యయం వికల్పంగా వస్తుంది) అనే సూత్రంచేత ఙీష్ (ఈ) ప్రత్యయం వికల్పంగా వస్తే సహోదరీ, సోదరీ అనే రూపాలతో పాటు సహోదరా, సోదరా అనే రూపాలు కూడా ఏర్పడతాయి. కాని దీనికి అపవాదంగా 'సహనఞ్ విద్యమానపూర్వాచ్చ (4-1-57) అనే సూత్రం ఉంది. దీనికి సహ, నఞ్, విద్యమాన శబ్దాలు పూర్వమందు గల శబ్దాలపై ఙీష్ (ఈ) ప్రత్యయం రాదని అర్థం. కనుక దీనిచే సహోదర, సోదర శబ్దాలపై ఙీష్ (ఈ) నిషేధింపబడింది కనుక సహోదరీ, సోదరీ అనే రూపాలు

ఏర్పడవు. టాప్ (ఆ) ప్రత్యయమే వచ్చి సహోదరా, సోదరా అనే రూపాలే ఏర్పడతాయి. కనుక తెలుగులో స్త్రీలింగంలో సహోదర, సోదర అనే రూపాలే వ్యాకరణసమ్మతాలు.

## సాంప్రదాయక :

సాంప్రదాయక రీతి, సాంప్రదాయక పద్ధతి మొదలైన పదాల్లో సంప్రదాయానికి సంబంధించిన అనే అర్థంలోనూ, 'ఇది సాంప్రదాయకం కాదు' మొదలైన ప్రయోగాల్లో సంప్రదాయమనే అర్థంలోనూ ఈ పదాన్ని వాడడం కనిపిస్తుంది.

మొదటి అర్థంలో ఈ పదం ఎంతవరకు సాధువో పరిశీలిద్దాం. సంప్రదాయ శబ్దంపై సంబంధించిన అనే అర్థంలో ఠక్ (ఇది 'ఇక'గా మారుతుంది.) వస్తే ఆది వృద్ధి వచ్చి సాంప్రదాయిక అని కావాలి - సాంప్రదాయక అని కాదు.

ఇక రెండవ అర్థంలో కూడా ఈ పదప్రయోగం యుక్తంగా కనిపించదు. సంప్రదాయ శబ్దంపై స్వార్థంలో అణ్ ప్రత్యయం వస్తే సాంప్రదాయం అని కావచ్చు. సంప్రదాయమంటే ఏ అర్థమో సాంప్రదాయమన్నా అదే అర్థం. దీనిపై మళ్ళీ స్వార్థంలో 'క' ప్రత్యయం చేర్చితే సాంప్రదాయక రూపం ఏర్పడవచ్చు. కాని ఒకే శబ్దంపై స్వార్థంలో రెండు పర్యాయాలు తద్ధితప్రత్యయాలు రావడం వ్యాకరణ నియమ విరుద్ధం. కనుక సంప్రదాయమనే అర్థంలో సాంప్రదాయక మనడం యుక్తం కాదు.

## సాక్ష్యం :

సాక్షి (Witness) అనేది ధర్మివాచకం. సాక్షిలో ఉండే ధర్మం సాక్ష్యం. ఇది ధర్మవాచకం. దీనికి Evidence అని అర్థం. సాక్షి శబ్దాన్ని వాడినప్పుడు 'దీనికి ఎవరు సాక్షి?' ఇత్యాదిగానూ, సాక్ష్య

శబ్దాన్ని వాడినప్పుడు 'దీనికెవరు సాక్ష్యమిచ్చినారు' ఇత్యాదిగానూ ప్రయోగించాలి. కాని తెలుగులో సాక్షి అనే ధర్మివాచకం వాడాల్సిన చోట సాక్ష్యం అనే ధర్మవాచకాన్ని వాడడం కనిపిస్తుంది. ఉదా:- దీనికి ఎవరు సాక్ష్యం మొ॥ ఇక్కడ సాక్ష్య శబ్దం బదులు సాక్షి శబ్దం వాడడం యుక్తం. సాక్ష్య శబ్దాన్నే వాడదలచుకుంటే 'దీనికెవరు సాక్ష్యమిచ్చినారు' అని ప్రయోగించాలి.

## సామాగ్రి :

వస్తు సముదాయమనే అర్థంలో ఈ పదానికి వాడుక ఉంది.

చాతుర్య, పాండిత్య, ఔచిత్య, సాహిత్య మొదలైన భావార్థక శబ్దాలకు చాతురి, పాండితి, ఔచితి, సాహితి మొదలైనవి రూపాంతరాలు. ఇలాగే సామగ్ర్య శబ్దానికి సామగ్రి అనేది భావార్థంలో రూపాంతరం. ఆదివృద్ధి వల్ల సమగ్ర శబ్దంలోని సకారంమీది అకారం దీర్ఘాక్షరంగా మారుతుంది కాని మకారంమీది అకారం దీర్ఘంగా మారే వీలులేదు. కనుక సామాగ్రి అనే రూపం సాధువు కాదు. సామగ్రి అని అనాలి.

## సాయంత్రం :

సాయంకాలమనే అర్థంలో బాగా ప్రాచుర్యం పొందిన శబ్దం.

పై అర్థంలో సంస్కృతంలో సాయం, సాయంకాలః అనే పదాలు వాడుకలో ఉన్నాయి. సాయం అనేది అవ్యయం. దీన్ని తెలుగులో తత్సమంగా వాడుకోం. సాయంకాలః అనే పదాన్ని సాయంకాలం అని తత్సమ శబ్దంగా వాడుకోవచ్చు. సాయంత్రం అనే పదం సంస్కృతంలో కనిపించదు. తెలుగులోకి ఈ పదం ఎలా వచ్చిందో ఆలోచించాలి. బహుశః సాయంతనం అనే పదంనుండి పుట్టిందేమో! అయితే దీనికి సాయంకాలంలో పుట్టిన, ఏర్పడిన అని అర్థం. సాయంకాలం అని కాదు.

**సారస్వతపరిషత్తు/సాహిత్యపరిషత్తు :**

పరిషత్తంటే సభ అని అర్థం. సారస్వత శబ్దంతో దీనికి షష్ఠీ సమాసం చెప్పుకోవాలి. అప్పుడు దీనికి సారస్వతము యొక్క పరిషత్తు అనే అర్థం వస్తుంది. ఈ అర్థం సముచితంగా కనిపించదు.

కనుక ఇక్కడ సారస్వత శబ్దానికి వాచ్యార్థం కాక లక్షణచే సారస్వతారాధకులనో, సారస్వత ప్రియులనో అర్థం చెప్పుకోవాలి. అప్పుడు సారస్వతారాధకుల లేక సారస్వత ప్రియుల పరిషత్తు అనే అర్థం వచ్చి సమాసంలోని దోషం తొలగిపోతుంది.

సాహిత్య పరిషత్తు, సాహిత్య సమితి, సారస్వత సమితి మొదలైన పదాలు కూడా ఇలాంటివే.

**సార్వజనీన/సార్వజనీనత :**

సర్వజనులకూ హితమైంది అనే అర్థంలో 'సర్వజనాత్ ఠఞ్ ఖశ్చ' (6-4-169) అనే వార్తికంచే సర్వజన శబ్దంపై ఖ ప్రత్యయం వచ్చి, దానికి 'ఈన' అనేది ఆదేశంగా వస్తే 'సర్వజనీన' అనే రూపం ఏర్పడుతుంది. దీనిపై భావార్థంలో తల్ (త) ప్రత్యయం వచ్చి 'సార్వజనీనత' అని అవుతుంది. సర్వజన శబ్దంపై చేరిన 'ఖ' ప్రత్యయంలో ఆదివృద్ధి రావడానికి మూలమైన ఞకారం కానీ, ణకారం కానీ, కకారం కానీ ఇద్వర్ణంగా లేదు కనుక ఈ శబ్దంలోని సకారం మీది అకారానికి ఆదివృద్ధి రావడానికి వీలు లేదు. కనుక సార్వజనీన, సార్వజనీనత అనే రూపాలు వ్యాకరణ సమ్మతాలు కావు. సర్వజనీన, సర్వజనీనత అని అనాలి. సార్వజనిక, సార్వజనికత - వీటి సాదృశ్యంతో సార్వజనీన, సార్వజనీనత అనే రూపాలు వాడుకలోకి వచ్చి ఉంటాయి.

**సాహిత్యకుడు :**

సాహిత్యం చదువుకున్నవాడు అనే అర్థంలో ఈ పదానికి బాగా వాడుక ఉంది.

ఇలాంటి పదాలు భాషలో లేకపోలేదు ఉదా: క్రమకుడు (క్రమం చదువుకున్నవాడు), పదకుడు (పదం చదువుకున్నవాడు), శిక్షకుడు (శిక్ష చదువుకున్నవాడు), మీమాంసకుడు (మీమాంస చదువుకున్న వాడు) మొదలైనవి. 'క్రమాదిభ్యో వుణ్' (4-2-61) అనే సూత్రంచేత క్రమ మొదలైన శబ్దాలపై దాన్ని చదువుకున్నవాడు లేక ఎరిగినవాడు అనే అర్థంలో వున్ ప్రత్యయం (ఇది అకగా మారుతుంది) విధింపబడింది. క్రమాది గణంలో క్రమ, పద, శిక్షా, మీమాంసా అనే నాలుగు పదాలు మాత్రమే ఉన్నాయి. ఇది ఆకృతి గణం కూడా కాదు. కనుక వీటి మీద మాత్రమే 'వున్' (అక) ప్రత్యయం రావాలి. ఇతర పదాల మీద రాగూడదు. కనుక సాహిత్య శబ్దం మీద వున్ ప్రత్యయం వచ్చి సాహిత్యకుడనే రూపం ఏర్పడడానికి వీలులేదు. సంస్కృత సాహిత్యంలో ఈ శబ్దానికి వాడుక ఎక్కడా కనిపించదు. మీమాంసక మొదలైన శబ్దాల సాదృశ్యంతో ఈ రూపం వాడుకలోకి వచ్చి ఉంటుంది.

## సిరిసంపదలు :

సిరి అన్నా సంపద అన్నా ఒకే అర్థం. ఏకార్థకాలైన ఈ శబ్దాలను సమాసంచేసి ప్రయోగించడం పునరుక్తి అవుతుంది. సిరి సంపత్తులు అనే పదం కూడా ఇలాంటిదే.

## సుగ్రాహ్యం :

సులభంగా గ్రహించదగింది అనే అర్థంలో వాడుకలో ఉన్న పదం.

ఈషత్, దుస్, సు అనేవి ఉప పదాలుగా ఉన్నపుడు సులభంగా/కష్టంగా చేయదగింది అనే అర్థంలో ధాతువుపై ఖల్ (అ) ప్రత్యయం విధింపబడింది. (చూ : ఈషద్దుస్సుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖల్. 3-3-126) కనుక సుపూర్వకమైన గ్రహ్ ధాతువుపై ఖల్ (అ)

ప్రత్యయం వచ్చి సుగ్రాహం అనే రూపం ఏర్పడుతుంది. సుగ్రాహ్యం రూపం సాధువు కాదు.

ఇట్లే దుర్గ్రహమనే రూపమే సాధువు. దుర్గ్రాహ్యమనే రూపం ఏర్పడదు.

## సుజ్ఞేయం :

సులభంగా తెలుసుకోదగింది అనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం.

జ్ఞేయం అంటే తెలుసుకోదగింది అనీ, 'సు' అంటే సులభంగా అనీ అర్థాలు. కనుక సుజ్ఞేయం అంటే సులభంగా అర్థం చేసుకోదగింది అనే అర్థం రావచ్చుకదా అనే శంక రావచ్చు. కాని ఈషత్, దుస్, సు అనే పదాలు సమాసంలో పూర్వపదాలుగా ఉన్నపుడు సులభంగా/కష్టంగా చేయదగింది అనే అర్థంలో ఆకారాంత ధాతువులపై యుచ్ (ఇది 'అన'గా మారుతుంది) ప్రత్యయం వచ్చి సుజ్ఞానం అని అవుతుంది. (ఆతో యుచ్ 3-3-128) సుజ్ఞేయం అని కాదు. ఇట్లే దుర్జ్ఞేయం అని కూడా అనరాదు. దుర్జ్ఞానం అని అనాలి.

## సునాయాసం :

ఆయాసం లేకుండా, సులభంగా అనే అర్థాల్లో ఎక్కువ ప్రాచుర్యం పొందిన పదం.

ఇందులో సు, అనాయాసం అని రెండు పదాలున్నట్లుగా కనిపిస్తుంది. అనాయాసం అంటే ఆయాసం లేకపోవడం. సు అంటే మరీ, మిక్కిలి అని అర్థం. కనుక దీనికి మరీ - ఏమాత్రమూ ఆయాసం లేకపోవడమని అర్థం చెప్పవచ్చు. ఐతే సు+అనాయాసం అనే పదాలు సంధిలో 'సునాయాసం' కావడం వ్యాకరణ నియమ విరుద్ధం. కనుక అనాయాసమంటే సరిపోతుంది.

## సున్నితత్వం :

భావార్థంలో వచ్చే 'త్వ' ప్రత్యయం కేవలం సంస్కృత పదాల పైనే చేరాలి. తెలుగు పదాలపై త్వ ప్రత్యయం చేరి సున్నితత్వం అని ఏర్పడడం వ్యాకరణవిరుద్ధం.

సున్నితం అనే పదం సంస్కృతమన్న భ్రమతో దానిపై 'త్వ' ప్రత్యయం చేర్చడం జరిగి ఉంటుంది.

## సురభిళమయం :

సువాసనతో నిండిందనే అర్థంలో వాడుతున్న పదం. సురభి అంటే సువాసన, సువాసన కలది అని అర్థాలు. కనుక ఇది ధర్మి వాచకం ధర్మవాచకం కూడా, సురభిళం అంటే సువాసన కలది అని అర్థం. ఇది ధర్మివాచకం, కనుక సురభిళమయం అనే పదానికి 'సువాసన కలవాటితో నిండింది'అనే అర్థమే వస్తుంది కాని సువాసనతో నిండిందనే అర్థం రాదు. ఈ అర్థంలో సురభిమయం అనో, సౌరభ్య మయం అనో అనడమే యుక్తం.

## సుస్వాగతం :

అతిథులను సాదరంగా ఆహ్వానించడమనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న పదం.

ఇందులోని స్వాగతం అనే పదంలో సు, ఆగతం అని రెండు పదాలున్నాయి. దీనికి మంచి ఆగమనమని శబ్దార్థం. అతిథుల విశేష ఆగమనాన్ని పురస్కరించుకొని చేసే ఆహ్వానాన్ని స్వాగతం అని అంటున్నాం. ఈ పదంలోనే 'మంచి' అనే అర్థాన్ని సూచించే 'సు' అనే పదం ఉన్నపుడు మళ్ళీ 'సు' చేర్చి సుస్వాగతం అనడం యుక్తం కాదు. స్వాగతం అంటేనే చాలు.

**సేకరణ :**

ఇది సేకరించు అనే తెలుగు ధాతువునుండి భావార్థంలో ల్యుట్ (ఇది అనగా మారుతుంది) ప్రత్యయం రాగా ఏర్పడిన రూపంగా కనిపిస్తుంది. కాని సంస్కృత ధాతువులపై మాత్రమే చేరే ల్యుట్ (అన) ప్రత్యయం తెలుగు ధాతువైన 'సేకరించు' ధాతువుపై చేరడం యుక్తం కాదు - ప్రేరేపణ పదంలాగా.

సేకరించు అనేది సంస్కృత ధాతువనే భ్రమవల్ల ఈ రూపం ఏర్పడి ఉంటుంది. లేదా స్వీకరణ అనే సంస్కృత రూపమే తెలుగులో 'సేకరణ' అని తద్భవశబ్దంగా మారిందేమో?

**సైద్ధాంతికపరంగా :**

సిద్ధాంతపరంగా అనే అర్థంలో వాడబడుతున్న పదం. ఇందులోని 'సైద్ధాంతిక' అన్నపదం తద్ధితాంతం సిద్ధాంతాలకు సంబంధించింది అని అర్థం. కనుక సైద్ధాంతికపరంగా అంటే సిద్ధాంతాలకు సంబంధించిన వాటి పరంగా అనే అర్థమే వస్తుంది కాని సిద్ధాంతాల పరంగా అనే అర్థం రాదు. కాని ఇక్కడ వక్త ఉద్దేశం సిద్ధాంతాల పరంగా అనే. కనుక ఈ అర్థంలో సిద్ధాంతపరంగా అనో సైద్ధాంతికంగా అనో అనడం యుక్తం. కాని సైద్ధాంతికపరంగా అనడం యుక్తం కాదు.

**సోదరి :** చూ: సహోదరి.

**సౌందరనందం :**

అశ్వఘోషుడు రచించిన కావ్యానికి సౌందరనందం అని పేరు. సుందరీనందౌ అధికృత్య కృతో గ్రంథః అని దీని విగ్రహం సుందరీ నందుల నుద్దేశించి రాయబడిన గ్రంథమని భావం. అప్పుడు కిరాతార్జునీయం మొదలైన శబ్దాల మాదిరిగా సుందరీనందీయం అని కావలసి

ఉంటుంది. సౌందరనందం అని కాదు. సౌందరనందం అనే పదానికి ఈ విధంగా విగ్రహం చెప్పాల్సి ఉంటుంది. సుందర్యాః అయం సౌందరః, సౌందరశ్చ అసౌ నందశ్చ సౌందరనందః, సౌందరనంద మధికృత్య కృతో గ్రంథః సౌందరనందః - సుందరికి సంబంధించిన వాడు సౌందరుడు, సౌందరుడైన నందనుడు సౌందరనందనుడు. సౌందరనందుణ్ణి ఉద్దేశించి రాయబడిన గ్రంథం సౌందరనందం అని ఈ విగ్రహవాక్యం తాత్పర్యం. దీని ప్రకారం సుందరీనందుల చరిత్ర అనే అర్థం కాక సుందరీవశగతుడైన నందుని చరిత్ర అనే అర్థం వస్తుంది. అప్పుడు కూడా సౌందరనంద అనేది వృద్ధ ప్రాతిపదికం కనుక 'వృద్ధాచ్ఛః' (4-12-114) అనే సూత్రంచేత దీనిపై 'ఛ' ప్రత్యయం (ఇది 'ఈయ'గా మారుతుంది) వచ్చి 'సౌందరనందీయం' అని కావలసి ఉంటుంది. రఘువంశం మొదలైన శబ్దాల మాదిరిగా అభేదోపచారంతో సౌందరనందం అనే పదాన్ని సాధించుకోవచ్చు. ఏమైనా సుందరీనందీయ మనే పదమే ఈ అర్థంలో వ్యాకరణ సమ్మతం. సౌందరనందమనే పదాన్ని ప్రౌఢప్రయోగంగానే భావించాలి.

## సౌభ్రాత్రృత్వం :

'మంచి సోదర భావం' అనే అర్థంలో నిత్యమూ వాడుకలో వినబడే శబ్దం.

ఈ శబ్దం సుభ్రాతృ శబ్దం నుండి ఏర్పడింది. సుభ్రాతృ అంటే మంచి సోదరుడని అర్థం. అతనిలో ఉండే గుణం అనే అర్థంలో సుభ్రాతృ శబ్దంపై 'త్వ' ప్రత్యయం వచ్చి సుభ్రాతృత్వం అని ఏర్పడుతుంది. సుశబ్దంలోని ఉకారానికి ఆదివృద్ధిచే ఔకారం రావాలంటే పరమందు చేరిన ప్రత్యయంలో ఞ, ణ, క వర్ణాలలో ఏదైనా ఒకటి ఇద్వర్ణంగా ఉండాలి. త్వ ప్రత్యయంలో అలాంటి ఇద్వర్ణమేమీ లేదు. కనుక సు శబ్దంలోని ఉకారానికి వృద్ధి రాక సుభ్రాతృత్వం అనే అవుతుంది. సౌభ్రాతృత్వం అని కాదు.

ఐతే సుభ్రాతృ శబ్దంపై భావార్థంలో అణ్ ప్రత్యయం వచ్చి సౌభ్రాత్రం అనే రూపం ఏర్పడుతుంది. దీనికి కూడా మంచి సోదర భావమనే అర్థం ఈ రూప సాదృశ్యంతో సౌభ్రాతృత్వం అనే చోట ఆదివృద్ధి వచ్చి సౌభ్రాతృత్వం అని ఏర్పడి ఉండవచ్చు.

## సౌహార్ద్రం :

స్నేహభావమనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నారు. ఇది మిత్రుడనే అర్థం కలిగిన సుహృచ్ఛబ్దంపై ఏర్పడిన రూపం. సుహృత్తులో ఉండే గుణం అనే అర్థంలో అణ్ ప్రత్యయమూ, ఉభయపదవృద్ధీ వస్తే సౌహార్దం అనే రూపం ఏర్పడుతుంది. (సుహృద్+అణ్ > సౌహార్ద్+అ=సౌహార్ద) హృద్‌లోని ఋకారం వృద్ధిచే ఆర్‌గా మారి హార్ద్ అని అవుతుంది. ఇందులో దకారంమీద రేఫ వచ్చే ప్రసక్తిలేదు. కనుక సౌహార్దమనే రూపమే సాధువు. సౌహార్ద్రం కాదు.

## స్తిమితం :

స్తిమితం లేని మనిషి, మతి స్తిమితం పోయింది మొదలైనచోట్ల స్థిరత్వం అనే అర్థంలో వాడుతున్నాం. స్తిమితమనేది ధర్మివాచకం. కనుక దీనికి నిశ్చలమైనది, స్థిరమైనది అనే అర్థమే కాని స్థిరత్వం, నిశ్చలత్వం అనే అర్థం రాదు. కనుక స్తిమితం లేని మనిషి, మతి స్తిమితం పోయింది మొదలైన వాక్యాల్లో స్తిమితత్వం అనే ధర్మవాచకాన్ని వాడడం వ్యాకరణసమ్మతం. ధర్మవాచకం వాడాల్సినచోట ధర్మివాచకం వాడుతున్నామన్నమాట.

## స్థాయీభావం :

తెలుగు అలంకారికుల్లో ఈ పదం బాగా వాడుకలో ఉంది. 'స్థాయీ భావః' అనే సంస్కృత ప్రయోగంలో స్థాయీ, భావః అనే రెండు పదాలూ ప్రథమావిభక్త్యంతమైన పదాలు. వ్యస్తపదాలు.

ఈ రెండింటినీ తెలుగులో తత్సమంగా వ్యస్తంగా స్థాయీభావమని ప్రయోగించడానికి వీల్లేదు. సమాసంగానే ప్రయోగించాలి. అప్పుడు స్థాయీ అనే ప్రథమావిభక్త్యంతమైన పదానికి ప్రాతిపదికయైన 'స్థాయిన్' శబ్దాన్ని (ఇందులోని నకారం తరువాత లోపిస్తుంది) పూర్వ పదంగా ప్రయోగించాలి. అప్పుడు స్థాయిభావః అనే సమాసరూపం ఏర్పడుతుంది. తెలుగులో దీన్ని తత్సమంగా వాడినప్పుడు స్థాయి భావమని అవుతుంది. స్థాయీ భావః అనే వ్యస్తమైన ప్రయోగంలో స్థాయీ అనేది ప్రథమాంతం కనుక దాన్ని అట్లాగే తెలుగులో ప్రయో గించడానికి వీలు లేదు. మరి సమాసంగా ప్రయోగిస్తే సమాసంలో పూర్వపదంగా ప్రాతిపదికే ఉండాలి కనుక 'స్థాయిభావ' అని కావాలి. కనుక మొత్తంమీద స్థాయీభావం అనే ప్రయోగం తెలుగులో ఏర్పడ డానికి వీలు లేదు.

## స్పర్శాసుఖం :

స్పర్శ శబ్దం సంస్కృతంలో అకారాంత పుంలింగ శబ్దం. ఆకారాంత స్త్రీలింగశబ్దం కాదు. సమాసంలో ప్రాతిపదిక రూపాన్నే పూర్వపదంగా ప్రయోగించాలి కనుక హ్రస్వ అకారాంత ప్రాతిపదిక యైన 'స్పర్శ' శబ్దాన్ని పూర్వపదంగా ప్రయోగించినపుడు 'సర్శ సుఖం' అనే అవుతుంది కాని స్పర్శాసుఖం అని కాదు.

## స్మరణిక :

స్మరింపజేసేది అనే అర్థంలో ఇటీవల వ్యాప్తిలోకి వచ్చినపదం. ప్రధానంగా స్మృత్యంకితాలైన ప్రత్యేక సంచికలకు 'స్మరణిక' అని నామకరణం కనిపిస్తుంది. ఈ పదం వ్యాకరణ సమ్మతంగా కనిపించదు. స్మృ ధాతువుపై కర్త్రర్థంలో ణ్వుల్ ప్రత్యయం, దానికి అకాదేశం స్మృ లోని ఋవర్ణానికి వృద్ధిచే 'ఆర్' అనే ఆదేశం, స్త్రీలింగంలో 'ఆ' ప్రత్యయం-'అక'లోని అకారానికి ఇకారాదేశం, వచ్చి 'స్మారికా' అని

అవుతుంది. (స్మృ + ణ్వుల్ > స్మృ + అక > స్మార్ + అక > స్మార్ + అక + ఆ > స్మార్ + ఇక + ఆ > స్మారికా) కనుక స్మరింపజేసేది అనే అర్థంలో 'స్మారిక' అనే అనాలి. స్మరణ శబ్దం ధాతువు కాదు కనుక దానిపై ణ్వుల్ ప్రత్యయం వచ్చి స్మరణిక అనే రూపం ఏర్పడదు.

## స్వతంత్రం :

'దేశానికి స్వతంత్రం వచ్చింది' అనే వాక్యప్రయోగాన్ని మనం తరచుగా వింటుంటాం. ఇక్కడ స్వతంత్రం అన్న పదం independance అన్న అర్థంలో వాడబడింది. కాని ఈ అర్థంలో స్వాతంత్ర్యం అని అనాలి. స్వతంత్రం అనకూడదు. స్వతంత్రం అనేది ధర్మివాచకం. దీనికి independant అని అర్థం. దీని నుండి ఏర్పడిన ధర్మవాచకం స్వాతంత్ర్యం అని. దీనికి independance అని అర్థం. కనుక దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది అని అనాలి కాని దేశానికి స్వతంత్రం వచ్చిందనడం పొరపాటు. ఇలా అంటే దేశానికి independant వచ్చింది అని అన్నట్లు. స్వతంత్ర శబ్దాన్ని ప్రయోగించినపుడు దేశం స్వతంత్రమైంది అని అనవచ్చు.

## స్వల్పకాలిక :

స్వల్పకాలంలో ఉన్న అనే అర్థంలో వాడబడుతున్న పదం. స్వల్పకాల శబ్దంపై 'తత్ర భవః' (అక్కడ ఉన్నది) అనే అర్థంలో ఠఞ్ ప్రత్యయం (ఇది ఇకగా మారుతుంది), ఆదివృద్ధి వచ్చి స్వాల్ప కాలిక అని కావాలి. స్వల్పకాలిక అనే ఆదివృద్ధి రాని రూపం వ్యాకరణ సమ్మతం కాదు. ఐతే స్వల్పకాల శబ్దంపై కాక కాలశబ్దంపై ఠఞ్ ప్రత్యయం చేర్చి కాలిక అనే రూపాన్ని సాధించుకొని దానికి స్వల్ప శబ్దం చేర్చుకుంటే స్వల్పకాలిక అనే రూపం ఏర్పడవచ్చు కదా అనే సందేహం రావచ్చు. కాని స్వల్ప శబ్దానికి తద్ధితార్థ రహితమైన కేవల కాల శబ్దంతోనే అన్వయం కాని తద్ధితార్థ సహితమైన కాలిక శబ్దంతో

కాదు. కనుక స్వల్పకాల శబ్దంపైనే ఠఞ్ (ఇక) ప్రత్యయం చేర్చాలి. అప్పుడు ఆదివృద్ధిచే సార్వకాలికం మొదలైన రూపాల మాదిరిగా స్వాల్పకాలిక అనే రూపమే ఏర్పడుతుంది.

## స్వాప్నికుడు :

స్వప్నావస్థలో ఉన్నవాడు అనే అర్థంలో ఈ పదం వాడబడు తుంది అంటే స్వప్న శబ్దంపై మత్వర్థంలో (కలవాడు అనే అర్థంలో) ఠక్ (ఇక) ప్రత్యయం వచ్చి ఈ రూపం ఏర్పడినట్లుగా భావించాలి.కాని, మత్వర్థంలో స్వప్న శబ్దంపై ఠక్ (ఇక) ప్రత్యయం రావడానికి వీలు లేదు- స్వప్న శబ్దం కృదంతం కనుక. సంబంధించినవాడనే అర్థంలో రావచ్చు. అందువల్ల స్వప్నం కలవాడు, స్వప్నావస్థలో ఉన్నవాడు అనే అర్థాల్లో స్వాప్నికుడని వాడడం యుక్తం కాదు. స్వాప్నికజగత్తు మొదలైన పదాల్లో స్వప్నానికి సంబంధించిన అని అర్థం కనుక స్వాప్నిక శబ్దప్రయోగం యుక్తమే.

స్వప్న శబ్దంపై కలవాడనే అర్థంలో 'అత ఇనిఠనౌ'(5-2-115) అనే సూత్రంచే ఠన్ ప్రత్యయం (ఇది ఇకగా మారుతుంది.) వచ్చినా ఆదివృద్ధి రాదు కనుక స్వప్నికుడనే రూపమే ఏర్పడుతుంది. అసలు కృదంతాలపై ఠన్ ప్రత్యయం రాదు కనుక స్వప్న అనే కృదంతంపై మత్వర్థంలో ఠన్ ప్రత్యయం వచ్చి 'స్వప్నిక' అనే రూపం కూడా ఏర్పడడానికి వీల్లేదు.

## స్వాయంభువు :

స్వయంభూ శబ్దంపై అపత్యార్థంలో అణ్ ప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. ఐతే స్వయంభూశబ్దంపై అణ్ ప్రత్యయం వచ్చి నపుడు 'భూ'లోని ఊకారానికి గుణమూ, అవాదేశమూ, ఆదివృద్ధీ రాగా

స్వాయంభవుడు అని కావాలి. (స్వయంభూ + అణ్ > స్వయంభో + అ < స్వయంభవ్ + అ = స్వాయంభవ) కాని మహాభారతాదుల్లో స్వాయం భువుడనే ప్రయోగమే కనిపిస్తుంది.

**హంతకుడు :**

చంపేవాడు అనే అర్థంలో ధారాళంగా వాడుకలో ఉన్న పదం.

హన్ ధాతువుపై కర్త్రర్థంలో ణ్వుల్ ప్రత్యయం (ఇది 'అక'గా మారుతుంది.) రాగా ఏర్పడిన రూపంగా భావించాలి. కాని హన్ ధాతువుపై ణ్వుల్ ప్రత్యయం వచ్చినపుడు 'హనస్తోఽచిణ్ణలోః' 7-3-32 (చిణ్, ణల్ ప్రత్యయాలు తప్ప తక్కిన ఞకార, ణకారాలు ఇద్వర్ణాలుగా ఉన్న ప్రత్యయాలు పరంగా ఉన్నపుడు హన్ ధాతువులోని నకారానికి తకారం ఆదేశంగా వస్తుంది.) అనే సూత్రంచే హన్‌లోని నకారం తకారంగా మారి తరువాత 'హో హంతేర్ ఞ్ణిన్నేషు 7-3-54. (ఞకారం, ణకారం ఇద్వర్ణంగాగల ప్రత్యయమూ, నకారమూ పరంగా ఉన్నపుడు హన్ ధాతువులోని హకారానికి కుత్వం వస్తుంది.) అనే సూత్రంచే హకార స్థానంలో కవర్గాదేశమూ, ఆ తరువాత ఆదివృద్ధీ వచ్చి ఘాతకుడు అనే రూపం ఏర్పడుతుంది. (హన్ + ణ్వుల్ > హన్ + అక > హత్ + అక > ఘత్ + అక > ఘాత్ + అక = ఘాతక) వ్యాకరణ నియమాల ప్రకారం హంతకుడనే రూపం ఏర్పడడానికి వీలు లేదు.

హన్ ధాతువుపై కర్త్రర్థంలో తృచ్ ప్రత్యయం కూడా రావచ్చు. అపుడు 'హంతృ' అనే రూపం ఏర్పడి ప్రథమైక వచనంలో హంత అని కావచ్చు. దీనిపై స్వార్థంలో 'క' ప్రత్యయం వచ్చి 'హంతక' శబ్దం ఏర్పడవచ్చు కదా అంటే వీల్లేదు. స్వార్థంలో రావలసిన 'క' ప్రత్యయం 'హంతృ' అనే ప్రాతికపదిక మీదే రావాలి కాని 'హంత' అనే ప్రథమాంతం మీద రాగూడదు. అపుడు హంతృకుడనే అవుతుంది కాని హంతకుడని కాదు

కనుక చంపేవాడనే అర్థంలో ఘాతకుడు, హంత అనే పదాలే వ్యాకరణసమ్మతాలు.

మరి తెలుగులో ఈ 'హంతకుడు' ఎలా ప్రవేశించినట్లు? అంటే కర్త్రర్థక పదాలు సాధారణంగా పాచక, లేఖక, పాఠక, గాయక, నాయక ఇత్యాదిగా అక ప్రత్యయాంతాలుగానే అధికంగా ఉంటాయి కనుక వాటి సాదృశ్యంతో హంతక శబ్దం వాడుకలోకి వచ్చి ఉంటుంది. లేదా అంతమొందించేవాడనే అర్థం కలిగిన 'అంతక' శబ్దం హంతకుడుగా మారిందేమో!

**హత్య :**

చంపడం అనే అర్థంలో బాగా ప్రహతమైన పదం.

ఇది హన్ ధాతువుపై భావార్థంలో క్యప్ ప్రత్యయమూ, నకారానికి తకారాదేశమూ రాగా ఏర్పడిన రూపం. (హన్ + క్యప్ > హన్ + య > హత్ + య > హత్ + య + ఆ = హత్యా) హన్ ధాతువులోని నకారానికి తకారాదేశం, హన్ ధాతువు వ్యస్తంగా ఏకపదంగా ఉన్నప్పుడు కాకుండా ఏదైనా ఒక సుబంతం ఉపపదంగా ఉన్నపుడే రావాలి అని వ్యాకరణ నియమం. (హనస్త చ; హన్ధాతోః సుబంతే ఉపపదే అనుపసర్గే భావే క్యప్ ప్రత్యయో భవతి, తకారశ్చాం తాదేశః ఉదా:- బ్రహ్మహత్యా, అశ్వహత్యా మొ॥) ఏ ఉపపదమూ లేనప్పుడు హత్య అనే రూపం ఏర్పడదు. అంటే బ్రహ్మహత్య ఇత్యాదిగా ఉపపద సహితంగానే హత్యా శబ్దాన్ని ప్రయోగించవచ్చు కాని కేవల హత్యా శబ్దాన్ని వ్యస్తంగా ప్రయోగించరాదన్నమాట. కనుకనే అమర కోశకారుడు మరణార్థక పదాలను పేర్కొంటూ వాటిలో 'హత్యా' శబ్దాన్ని నిర్దేశించలేదు. (చూ : 2-8-112, 115) హన్ ధాతువు రూపాన్ని వ్యస్తంగా ప్రయోగించదలచినపుడు 'వధ' అని అనాలి. (హన్ + అప్ > హన్ + అ > వధ్ + అ = వధ).

**హనుమంతాది :**

హనుమంతుడు మొదలుగాగల అని అర్థం. ఇది సంస్కృత సమాస పదం. సంస్కృత సమాసంలోని పూర్వపదాన్ని ఎప్పుడూ ప్రాతిపదికగానే ప్రయోగించాలి. హనుమంతుడనే దానికి హనుమత్ అనేది ప్రాతిపదిక కనుక దానికి సమాసంలో ఆది అనే పదం చేర్చినపుడు 'హనుమదాది' అని అవుతుంది. (హనుమత్ + ఆది = హనుమదాది) హనుమంతాది అని కాదు.

తెలుగులోని హనుమంతుడనే పదాన్ని ప్రాతిపదికగా భ్రమించడం హనుమంతాది అనే రూపాన్ని కల్పించుకోవడానికి హేతువు కావచ్చు.

# మరికొన్ని ప్రయోగాలు

**అనేకమంది :**

కేవల సంస్కృత పదానికి - అంటే తత్సమంగా మారని సంస్కృత శబ్దానికి తెలుగు శబ్దంతో సమాసం రాదు. అలా సమసించిన పదాలను వ్యాకర్తలు వైరిసమాసాలన్నారు. అనేక అనే సంస్కృత శబ్దం తత్సమంగా మారకుండా తెలుగు శబ్దంతో సమసించడం ఇందు లోని అనౌచిత్యం. 'చాలామంది' అంటే ఈ దోషం తొలగిపోతుంది.

**అభాగిని :**

దురదృష్టవంతురాలనే అర్థంలో - ముఖ్యంగా పత్రికల్లో, నవలల్లో, కథల్లో బాగా వినబడే పదం.

భాగిని అంటే భాగం (పాలు) కలిగిన స్త్రీ. కనుక అభాగిని అంటే భాగంలేని స్త్రీ అనే అర్థం వస్తుంది కాని, భాగ్యంలేని స్త్రీ అనే అర్థం రాదు.

భాగ్యంలేని స్త్రీ అనే అర్థంలో 'అభాగ్య' అని అనడం యుక్తం. (న విద్యతే భాగ్యం యస్యాః సా అభాగ్యా అని విగ్రహం.)

**ఉజ్వాలం :**

ఉత్, జ్వాలం అనే రెండు పదాలకు సంధి చేసినపుడు తకారం జకారంగా మారి 'ఉజ్జ్వల' అనే రూపం ఏర్పడుతుంది. అంటే-ఇందులో తకారస్థానంలో వచ్చిన జకారం, జ్వాలశబ్దంలో ఉన్న జకారం -

ఈ రెండు జకారాలూ శబ్దంలో ఉండాలన్నమాట. కనుక ఉజ్వల అనే ఒక జకారంతో కూడిన రూపం సాధువు కాదు. రెండు జకారాలతో కూడిన 'ఉజ్జ్వల' అన్నరూపమే సాధువు.

## ఉత్పాదకవ్యయం :

కర్మాగారాల్లో వస్తువులను తయారు చేయడానికయ్యే ఖర్చు అనే అర్థంలో పత్రికారచయితలు బాగా వాడుతున్నపదం.

ఉత్పాదకమంటే ఉత్పాదనం చేసేది అని అర్థం. కనుక ఉత్పాదక వ్యయమనే దానికి ఉత్పాదనచేసే వ్యయమనే అర్థం వస్తుంది కాని ఉత్పాదనకయ్యే వ్యయం అనే అర్థం రాదు. వ్యయమే ఉత్పాదన చేసేది కాదా! ఉత్పాదనకోసం అయ్యేది వ్యయం. అందువల్ల ఉత్పాదకవ్యయమనికాక ఉత్పాదనవ్యయమనడం యుక్తం.

## కార్యవర్గం :

ఆంగ్లంలోని executive body అనే పదానికి సమానార్థకంగా వాడబడుతున్న పదం.

వర్గం అంటే సముదాయం. కార్య శబ్దానికి పనులని అర్థం. కనుక బంధువర్గం, శత్రువర్గం మొదలైన పదాల్లో మాదిరిగా దీనికి కార్యముల సముదాయం అనే అర్థం వస్తుంది కాని కార్యకర్తల సముదాయం అనే అర్థం రాదు. కనుక దీన్ని కార్యనిర్వాహక వర్గం అంటే ఉచితంగా ఉంటుంది.

కార్య నిర్వాహకమైన వర్గం కార్యవర్గం అని కర్మధారయ సమాసంగా గ్రహిస్తే దీన్ని శాక పార్థివాది గణంలో చేర్చుకొని సమాసంలో నిర్వాహక శబ్దానికి లోపం చెప్పి మధ్యమపదలోపి సమాసంగా సమర్థించుకోవచ్చు. అసమ్మతి వర్గం, సలహా సంఘం, చర్చా సంఘం మొదలైన పదాలను కూడా ఇలాగే సమర్థించుకోవాలి.

## జపతపాదులు :

తపస్ శబ్దం సకారాంతం. దీనికి సంధిలో హ్రస్వ అకారం తప్ప తక్కిన అచ్చులు పరంగా ఉన్నపుడు సకారానికి లోపం వచ్చి తప ఆదులు అనే రూపం ఏర్పడుతుంది. ఇక్కడ సవర్ణ దీర్ఘం వచ్చి తపాదులు అనే రూపం ఏర్పడడానికి వీల్లేదు. కనుక జప తప ఆదులు అనే రూపమే వ్యాకరణ సమ్మతం చూ : మనోల్లాసం.

## తేజోప్రభ :

శ, ష, సలు తప్ప తక్కిన నాదాక్షరాలు పరంగా ఉన్నప్పుడే సకారాంత శబ్దాల్లోని చివరి సకారం ఓకారంగా మారుతుంది. ఉదా : వయోభేదం, వయోజనులు మొ॥ పరుషాక్షరాలు పరమైనపుడు మాత్రం సకారం విసర్గగా మారుతుంది. ఉదా: వయఃపరిమితి మొ॥ తేజస్+ప్రభ అనేచోట పరుషాక్షరం పరంగా ఉంది కనుక సకారం ఓకారం కాకుండా విసర్గగా మారి తేజఃప్రభ అనే అవుతుంది. తేజోప్రభ అని కాదు. తేజోప్రభ అనే పేరుతో సూర్యాపేట నుండి ఒక పత్రిక వెలువడుతుంది.

## దగ్ధకాండ :

దౌర్జన్యంతో పెద్ద ఎత్తున కాల్చివేయడం (arson) అనే అర్థంలో పత్రికల ద్వారా బాగా వాడుకలోకి వచ్చిన పదం

దమనకాండ, మారణకాండ, హత్యాకాండ, దౌర్జన్యకాండ మొదలైన శబ్దాలు ఇలాంటివే. ఇక్కడ 'కాండ' శబ్దానికి నింద్యమైన, చెడ్డనైన అనే అర్థాన్ని చెప్పుకోవాలి అప్పుడు గర్హ్యమైన దమనం, గర్హ్యమైన మారణం ఇత్యాదిగా అర్థాలు వస్తాయి. అంటే ఇలాంటి పదాల్లో పూర్వపదం భావార్థకంగా ఉన్నప్పుడే ఈ అర్థం వస్తుంది. కనుక దమనకాండ మొదలైన శబ్దాల మాదిరిగా దహనకాండ అని భావార్థక

శబ్దంతో ప్రయోగించడం యుక్తం. 'దగ్ధ' అనే విశేషణంతో ప్రయోగించడం యుక్తం కాదు. దగ్ధకాండ అనేదానికి దహింపబడిన కాండ అనే అర్థమే వస్తుంది. ఈ అర్థానికి అంతగా ఔచిత్యం కనిపించదు.

అలాగే దగ్ధపర్వం అనే పదాన్ని దహనపర్వం అనడం యుక్తం.

## దుస్థితి :

ఇందులో దుస్, స్థితి అనే రెండు శబ్దాలున్నాయి. వీటికి సంధి చేయగా ఏర్పడిన రూపంలో కూడా రెండు సకారాలు ఉండాలి. అప్పుడీ పదాన్ని 'దుస్స్థితి' అనే విధంగా రాయాలన్నమాట. సంయుక్త వర్ణంలో ఉన్న థకారం కారణంగా రెండు సకారాలున్న విషయం నిస్సారం మొదలైన పదాల్లోలాగా స్పష్టంగా తెలియకపోవడం ఈ దోషానికి కారణం.

దుస్‌లోని సకారం విసర్గగా కూడా మారే అవకాశం ఉంది. కనుక దీనిని దుఃస్థితి అనే విధంగాకూడా రాయవచ్చు.

## నవమి :

డా॥ గోపీగారు రచించిన వ్యాస సంపుటి పేరు. ఇందులో తొమ్మిది వ్యాసాలున్నాయి. తొమ్మిదింటి సమాహారం అనే అర్థంలో వ్యాస కర్త దీనికి పేరు పెట్టినట్టుగా భావించవచ్చు. కాని, నవమ శబ్దానికి స్త్రీలింగ రూపమైన 'నవమి' శబ్దానికి తొమ్మిదవది అనే అర్థమే వస్తుంది కాని తొమ్మిది వ్యాసాల సముదాయం అనే అర్థం రాదు. ఈ అర్థం రావాలంటే నవకం అని అనాలి. నవమి అనగూడదు. చూ: పంచమి.

## నిస్స్వార్థ :

ఇందులో నిస్+స్వార్థ అనే రెండు పదాలున్నాయి కనుక దీన్ని నిస్స్వార్థ అని రాయడం యుక్తం.

## నాగరకుడు/నాగరికుడు :

'నాగరకుడు' సాధువా? నాగరికుడు సాధువా? అనే సందేహం చాలామందికి కలుగుతుంది. కనుక ఈ శబ్దాల వ్యుత్పత్తిని, అర్థ విశేషాలను పరిశీలిద్దాం.

నిందార్థమూ, సామర్థ్యార్థమూ గమ్యమానమైనపుడు నగర శబ్దంపై 'నగరాత్కుత్సన ప్రావీణ్యయోః' 4-2-128. అనే సూత్రంచే వుఞ్ ప్రత్యయం (ఇది 'అక'గా మారుతుంది.) వచ్చి, నాగరక అనే శబ్దం ఏర్పడుతుంది. (నగర+వుఞ్>నగర+అక>నాగర+అక= నాగరక) కనుక నాగరకుడంటే నగరాల్లో ఉండే దొంగ (నిందార్థం) అనీ, నగరాల్లో ఉండే శిల్పి అనీ అర్థాలు వస్తాయి.

నిందార్థం లేనపుడు నగర శబ్దంపై వుఞ్ ప్రత్యయం రాక అణ్ ప్రత్యయం వచ్చి 'నాగర' అనే శబ్దం ఏర్పడుతుంది. దీనికి నగరంలో ఉండేవాడనీ, విదగ్ధుడనీ అర్థాలు. 'నాగరం ముస్తకే శుంఠ్యాం విదగ్ధే నగరోద్భవే' అని మేదిని.

నగర శబ్దంపై 'తత్ర నియుక్తః' (అక్కడ నియోగింపబడిన వాడు) తత్ర అధికృతః (అక్కడ అధికారం కలవాడు) రక్షతి (దాన్ని రక్షించేవాడు) అనే అర్థాల్లో నగర శబ్దంపై ఠక్ (ఇది ఇకగా మారుతుంది). ప్రత్యయం వస్తే నాగరిక అని అవుతుంది. దీనికి నగర రక్షణాధికారం కల ఉద్యోగి అనే అర్థం వస్తుంది. City Police Commissioner అన్నమాట.

పై వివరణను బట్టి వ్యాకరణరీత్యా నగర శబ్దం నుండి ఏర్పడే రూపాలను, వాటి అర్థాలను ఈ విధంగా క్రోడీకరించవచ్చు.

| | | |
|---|---|---|
| 1. | నాగరకుడు | 1. నగరంలో ఉండే దొంగ. (నిందార్థం)<br>2. నగరంలో ఉండే శిల్పి. (ప్రావీణ్యార్థం) |
| 2. | నాగరుడు | నగరంలో ఉండేవాడు. |
| 3. | నాగరికుడు | 1. నగరంపై అధికారం కలవాడు.<br>2. నగరాన్ని రక్షించేవాడు.<br>3. నగరంలో రక్షణకై నియోగింపబడే వాడు. |

దీన్నిబట్టి నాగరుడనే పదానికి మాత్రమే నగరంలో ఉండే వాడనే అర్థం ఉన్నట్లుగ తెలుస్తుంది. కాని, Monier Williams నిఘంటువు నాగరక, నాగిరిక శబ్దాలకు - రెండింటికీ నగరంలో ఉండే వాడు, నమ్రత కలవాడు, తెలివి కలవాడు, మోసం చేసేవాడు, నగర రక్షణాధికారి అనే అర్థాలను పేర్కొన్నది. పాణినీయం ప్రకారం నాగ రకుడన్న పదానికే నిందార్థకమైన మోసగాడనే అర్థాన్ని, ప్రావీణ్యార్థక మైన తెలివిగలవాడనే అర్థాన్ని చెప్పుకోవడానికి వీలున్నా నాగరిక శబ్దానికి ఈ అర్థాలను చెప్పడానికి వీల్లేదు. ఐతే, వ్యవహారంలో నాగ రిక శబ్దానికి తెలివిగలవాడు, విదగ్ధుడు అనే అర్థంలో వాడుక కని పిస్తుంది. వాచస్పత్యంలో నాగరక, నాగర అనే శబ్దాలున్నాయి కాని నాగరిక శబ్దం లేదు.

నగరంలో ఉండేవాడనే అర్థంలో నగర శబ్దంపై నాగరిక శబ్దం ఏర్పడినట్లుగా పాణినీయంలో కనిపించదు. నాగర శబ్ద మొక్కటే ఈ అర్థంలో ఏర్పడుతుంది.

ఐనా నాగరక, నాగరిక శబ్దాలకు రెండింటికీ నగరంలో ఉన్న వాడు అనే అర్థం మౌలికం కనుక నగరవాసి అనే అర్థంలో వీటిని వాడడం యుక్తమే. ఈ శబ్దాలనుండి భావార్థంలో నాగరకత, నాగరి కత అనే రూపాలు ఏర్పడవచ్చు.

**నిశ్వాస :**

బయటికి వదిలే శ్వాస అని అర్థం. ఇందులో నిస్+శ్వాస అనే రెండు పదాలున్నాయి. వీటిలో 'నిస్' అనే ఉపసర్గకు 'బయటికి' అని అర్థం. ఈ రెండు పదాలకు సంధిచేసినపుడు నిస్‌లోని సకారం శకారంగా మారి నిశ్శ్వాస అని అవుతుంది. (నిస్+శ్వాస > నిశ్+శ్వాస = నిశ్శ్వాస) సకార స్థానంలో వచ్చిన శకారం, శ్వాసలోని శకారం - ఈ రెండు శకారాలు శబ్దంలో ఉంటాయన్న మాట. కనుక దీన్ని 'నిశ్శ్వాస' అని రెండు శకారాలతో రాయాలి. నిశ్వాస అని ఒకే శకారంతో రాయడం పొరపాటు.

నిస్‌లోని సకారం విసర్గగాకూడా మారవచ్చు కనుక 'నిఃశ్వాస' అని కూడా రాయవచ్చు.

**పంచమి :**

కట్టమంచి రామలింగారెడ్డిగారి వ్యాససంపుటి పేరు. ఇది, రెడ్డిగారు మరణించిన తరువాత శ్రీ గ. శ్రీ.న ఆచార్యగారిచే పరిష్కరించబడి ఆంధ్ర విశ్వవిద్యాలయం పక్షాన ముద్రింపబడింది. దీనికి పేరు రెడ్డిగారే పెట్టినారో లేదా ఆచార్యగారు పెట్టినారో తెలియదు. ఇందులో రంగ నాథ రామాయణం మొదలైన అంశాలపై ఐదు వ్యాసాలున్నాయి. కనుక దీనికి పంచమి అనే పేరు పెట్టినట్లుగా భావించవచ్చు. కాని, పంచమ శబ్దానికి స్త్రీలింగ రూపమైన 'పంచమి' శబ్దానికి 'ఐదవది' అనే అర్థమే వస్తుంది కాని ఐదింటి సముదాయమనే అర్థం రాదు. ఈ అర్థం రావాలంటే 'పంచకం' అనాలి. పంచమి అనగూడదు. చూ : నవమి.

## బహుభార్యాత్వం :

చాలామంది భార్యలు కలిగి ఉండడమనే అర్థంలో ఈ పదం వాడుకలో ఉంది.

బహ్వ్యః భార్యాః యస్య సః బహుభార్యః. చాలామంది భార్యలు కలవాడు బహుభార్యుడు. ఇది బహుౖవ్రీహి సమాసం. భార్యా శబ్దం ఆకారాంత స్త్రీలింగమే ఐనా బహుౖవ్రీహిలో ఉపసర్జనం (అౖప్రధానం) కనుక 'గోస్త్రియో రుపసర్జనస్య 1-2-48) ఉపసర్జన (అౖప్రధాన)మైన గోశబ్దానికీ, స్త్రీ ౖప్రత్యయాంతం అంతమందున్న ౖప్రాతిపదికకూ ౖహస్వం వస్తుంది) అనే సూౖత్రంచే భార్యా శబ్దంలోని చివరి దీర్ఘానికి ౖహస్వం వచ్చి 'బహుభార్యః' అని అవుతుంది. కనుక బహుభార్యునిలో ఉండే గుణం అనే అర్థంలో బహుభార్యత్వం అని కావాలి కాని బహు భార్యాత్వం అని కాదు.

బహుౖవ్రీహిలో బహుభార్యా శబ్దంపై కప్ (క) పత్యయం వస్తే బహుభార్యాకుడు అని అవుతుంది. దీనికి చాలామంది భార్యలు కల వాడని అర్థం. దీనిపై భావార్థంలో 'త్వ' ౖప్రత్యయం వస్తే బహుభార్యా కత్వం అని అవుతుంది. చాలామంది భార్యలు కలిగి ఉండడం అని అర్థం. కనుక చాలామంది భార్యలు కలిగి ఉండడమనే అర్థంలో బహు భార్యత్వం, బహుభార్యాకత్వం అనే రూపాలే సాధువులు.

బహుభార్యల్లో ఉండే గుణం-అంటే అనేక భార్యలుగా ఉండడం అనే అర్థంలో బహు భార్యాత్వం అనే శబ్దం సాధువే కావచ్చు కాని, బహుభార్యలు కలిగి ఉండడమనే అర్థంలో మాౖత్రం అసాధువే.

## మహద్భాగ్యం :

మహద్భాగ్యమంటే గొప్పవాళ్ళ భాగ్యమనే అర్థం. గొప్ప భాగ్యం అనే అర్థం రాదు. ఈ అర్థంలో మహాభాగ్యం అనేది సాధురూపం. చూ. మహదానందం.

**ముఖ్యఅతిథి :**

Chief guest అనే అర్థంలో ఇటీవల వాడుకలోకి వచ్చిన పదం.

ఏక పదంలో ఉన్న ప్రకృతి ప్రత్యయాలకు, ధాతూపసర్గలకు, సమాసంలో ఉన్న పదాలకు సంధి తప్పకుండా చేయాలని, వాక్యంలో మాత్రమే సంధి వివక్షాధీనమనీ కింది నియమం తెలుపుతుంది.

"సంహితైకపదే నిత్యా నిత్యా ధాతూపసర్గయోః
నిత్యా సమాసే వాక్యే తు సా వివక్షామపేక్షతే"

దీన్నిబట్టి ముఖ్య అతిథి అనే సమాసపదంలో సంధి తప్పకుండా చేయాలి అప్పుడు ముఖ్యఅతిథి అని విసంధిగా కాక సభాధ్యక్షుడు, అధ్యక్షోపన్యాసం, కీలకోపన్యాసం మొదలైన వాటిలాగా "ముఖ్యాతిథి" అని సంధిచేసిన రూపాన్నే ప్రయోగించాలన్నమాట.

**రతీమన్మథులు/రతీదేవి :**

రతి శబ్దం హ్రస్వ ఇకారాంత స్త్రీలింగ శబ్దం. దాన్ని సమాసంలో పూర్వపదంగా చేర్చినపుడు 'రతి' అని హ్రస్వాంతంగానే ఉండాలి. 'రతిమన్మథులు/రతిదేవి' అనాలన్నమాట. కాని వ్యవహారంలో రతీమన్మథులు/రతీదేవి అనే వ్యాకరణ సమ్మతం కాని రూపాలే వాడుకలో ఉన్నాయి.

శచీదేవి, గౌరీదేవి, సరస్వతీదేవి, లక్ష్మీదేవి మొదలైన శబ్దాల్లో శచీ మొదలైన దీర్ఘాంత శబ్దాల సాదృశ్యంవల్ల 'రతి' శబ్దం రతీ శబ్దంగా మారి ఉంటుంది.

**లోకాయుక్త :**

ప్రభుత్వాధికారులపైనా, ప్రజాప్రతినిధులపైనా వచ్చే ఆరోపణలను విచారించి ప్రభుత్వానికి తన నిర్ణయాన్ని తెలియజేసే న్యాయాధికారిని 'లోకాయుక్త' అని అంటున్నాం.

ఇది అకారాంతమైన సంస్కృత శబ్దం. దీన్ని తెలుగులోకి తెచ్చుకునేప్పుడు 'లోకాయుక్తుడు' అని అవుతుంది - రాముడు, కృష్ణుడు మొదలైన అకారాంత శబ్దాల మాదిరిగా. ఉత్వమూ, డు ప్రత్యయమూ చేర్చకుండా అకారాంత శబ్దాలను రామ, కృష్ణ అని ప్రథమైక వచనంగా వాడం కదా! న్యాయాధికారిణి స్త్రీ ఐనపుడు 'లోకాయుక్త' అనే శబ్దం సాధువు కావచ్చు. కాని, పుంలింగంలో మాత్రం లోకాయుక్త అనే వ్యవహారం విలక్షణంగా ఉంది.

## వైభోగం :

విభవం, వైభవం అనే అర్థాల్లో వాడబడుతున్న పదం.

వైభోగమన్న పదం సంస్కృతంలో కనిపించదు. వైభవమన్న పదమే తెలుగులో వైభోగంగా మారిందేమో? లేక విశిష్టమైన భోగం, విభోగం కావచ్చు. దీనిపై స్వార్థంలో అణ్ ప్రత్యయం చెప్పుకొని వైభోగం అనే రూపం సాధించుకోవచ్చు.

## షష్ఠిపూర్తి :

అరవై సంవత్సరాలు నిండడం అనే అర్థంలో ఈ పదం పత్రికల్లో ఎక్కువగా కనిపిస్తుంది.

సంస్కృతంలో షష్టి, షష్ఠి అనే రెండు రూపాలున్నాయి. షష్టి అంటే అరవై అని, షష్ఠి అంటే ఆరవది అని అర్థం. ('షష్ఠ' అనే శబ్దానికి షష్ఠి అనేది స్త్రీలింగరూపం కనుక.) కనుక అరవై సంవత్సరాలు నిండడం అనే అర్థంలో 'షష్టిపూర్తి' అనే అనాలి కాని షష్ఠిపూర్తి అని అనరాదు.

షష్టి, షష్ఠి శబ్దాల అర్థం సరిగా తెలియకపోవడం ఈ పొరపాటుకు కారణం.

# అనుబంధం

## భావార్థంలో అణ్ (అ) ప్రత్యయం చేరిన రూపాలు

సూ: "హాయనాంత యువాదిభ్యోఽణ్"(అష్టాధ్యాయి 5-1-133)

హాయన శబ్దమంతమందుగల శబ్దాలపై, యువన్ మొదలైన శబ్దాలపై భావార్థంలో అణ్ (అ) ప్రత్యయం వస్తుంది.

| | |
|---|---|
| యువన్ - యౌవనం | వృషల - వార్షలం |
| పురుష - పౌరుషం | కుశల - కౌశలం |
| భ్రాతృ - భ్రాత్రం | చపల - చాపలం |
| స్థవిర - స్థావిరం | నిపుణ - నైపుణం |
| సుహృద్ - సౌహృదం | పిశున - పైశునం |
| దుర్హృద్ - దౌర్హృదం | కుతూహల - కౌతూహలం |
| సుభ్రాతృ - సౌభ్రాత్రం | మిథున - మైథునం |
| దుర్భ్రాతృ - దౌర్భ్రాత్రం | కితవ - కైతవం |

## భావార్థంలో, కర్మార్థంలో అణ్ ప్రత్యయంచేరిన రూపాలు

సూ :- "ఇగంతాచ్చ లఘుపూర్వాత్" (అష్టాధ్యాయి 5-1-131)

ఇ, ఉ, ఋ, ౡ లు అంతమందుగల లఘ్వక్షర పూర్వకమైన శబ్దంపై భావార్థంలోనూ, కర్మార్థంలోనూ అణ్ ప్రత్యయం వస్తుంది.

| | |
|---|---|
| శుచి - శౌచం | విభు - వైభవం |
| ముని - మౌనం | గురు - గౌరవం |
| పటు - పాటవం | అణు - ఆణవం |
| లఘు - లాఘవం. | |

## భావార్థంలో ఇమనిచ్ (ఇమ) ప్రత్యయం చేరిన రూపాలు

సూ :- "పృథ్వాదిభ్య ఇమనిజ్వా" (అష్టాధ్యాయి 5-2-122) పృథు మొదలైన శబ్దాలపై భావార్థంలో ఇమనిచ్ (ఇమ) ప్రత్యయం వికల్పంగా వస్తుంది.

| | |
|---|---|
| పృథు - ప్రథిమ | స్వాదు - స్వాదిమ |
| మృదు - మ్రదిమ | హ్రస్వ - హ్రసిమ |
| మహత్ - మహిమ | దీర్ఘ - ద్రాఘిమ |
| పటు - పటిమ | ప్రియ - ప్రేమ |
| తను - తనిమ | ఋజు - ఋజిమ |
| లఘు - లఘిమ | క్షిప్ర - క్షేపిమ |
| బహు - బహిమ | క్షుద్ర - క్షోదిమ |
| సాధు - సాధిమ | అణు - అణిమ |
| బహుళ - బంహిమ | స్థిర - స్థేమ |
| గురు - గరిమ | ఉరు - వరిమ |
| చండ - చండిమ | |

సూ :- "వర్ణదృఢాదిభ్యః ష్యఞ్ చ (అష్టాధ్యాయి 5-1-123) వర్ణవాచక శబ్దాలపై, దృఢ మొదలైన శబ్దాలపై ఇమనిచ్ ప్రత్యయమూ, ష్యఞ్ ప్రత్యయమూ వస్తుంది.

**వర్ణవాచకాలు :**

| | |
|---|---|
| శుక్ల - శుక్లిమ | రక్త - రక్తిమ |
| కృష్ణ - కృష్ణిమ | |

**దృఢాదులు :**

| | |
|---|---|
| దృఢ - ద్రఢిమ | జడ - జడిమ |
| కృశ - క్రశిమ | మధుర - మధురిమ |
| లవణ - లవణిమ | వక్ర - వక్రిమ |
| శీత - శీతిమ | తరుణ - తరుణిమ |
| తామ్ర - తామ్రిమ | దీర్ఘ - ద్రాఘిమ |
| ఉష్ణ - ఉష్ణిమ | |

## అతిశయార్థంలో ఇష్ఠన్ (ఇష్ఠ) ప్రత్యయం చేరిన రూపాలు

సూ : ప్రియ, స్థిర, స్ఫి, రోరు, బహుళ, గురు, వృద్ధ, తృప్ర, దీర్ఘ, బృందారకాణాం ప్ర, స్థ, స్ఫ, వ,ర్బంహి, గ,ర్వర్షి,త్ర, బ్దాఘి, బృందాః (అష్టాధ్యాయి, 6-4-157)

ప్రియ, స్థిర, స్ఫిర, ఉరు, బహుళ, గురు, వృద్ధ, తృప్ర, దీర్ఘ, బృందారక శబ్దాలకు ఇష్ఠ, ఇమనిచ్, ఈయసున్ ప్రత్యయాలు పరంగా ఉన్నపుడు క్రమంగా ప్ర, స్థ, స్ఫ, వర్, బంహ్, గర్, వర్ష్, త్రప్, ద్రాఘ్, బృంద్ అనేవి ఆదేశాలుగా వస్తాయి.

| | |
|---|---|
| ప్రియ - ప్రేష్ఠ | గురు - గరిష్ఠ |
| స్థిర - స్థేష్ఠ | వృద్ధ - వర్షిష్ఠ |
| స్ఫిర - స్ఫేష్ఠ | తృప్ర - త్రపిష్ఠ |
| ఉరు - వరిష్ఠ | దీర్ఘ - ద్రాఘిష్ఠ |
| బహుళ - బంహిష్ఠ | బందారక - బృందిష్ఠ |

## మత్వర్థంలో లచ్ (ల) ప్రత్యయం చేరిన రూపాలు

సూ:- ప్రాణిస్థాదాతో లజన్యతరస్యామ్ (అష్టాధ్యాయి 5-2-96)

ప్రాణులయందుండే వాటిని తెలియజేసే పదంమీద మత్వర్థంలో వికల్పంగా లచ్ (ల) ప్రత్యయం వస్తుంది.

చూడా - చూడాల

సూ :- సిధ్మాదిభ్యశ్చ (అష్టాధ్యాయి 5-2-97)

సిధ్మ మొదలైన శబ్దాలపై మత్వర్థంలో వికల్పంగా లచ్ (ల) ప్రత్యయం వస్తుంది.

| | |
|---|---|
| సిధ్మ - సిధ్మల | మంజు - మంజుల |
| పాంసు - పాంసుల | గ్రంథి - గ్రంథిల |
| మాంస - మాంసల | శ్రీ - శ్రీల |
| స్నేహ - స్నేహల | ధారా - ధారాళ |
| శీత - శీతల | వర్ష్మ - వర్ష్మల |
| శ్యామ - శ్యామల | పక్ష్మ - పక్ష్మల |
| పింగ - పింగల | శ్లేష్మ - శ్లేష్మల |
| పృథు - పృథుల | పేశ - పేశల |
| మృదు - మృదుల | ఫేన - పేనల |

## మత్వర్థంలో ఇలచ్ (ఇల) ప్రత్యయంచేరిన రూపాలు

సూ :- లోమాది పామాది పిచ్ఛాదిభ్యః శనేలచః (అష్టాధ్యాయి 5-2-99)

మత్వర్థంలో లోమాదులపై శ ప్రత్యయం, పామాదులపై న ప్రత్యయం, పిచ్ఛాదులపై ఇలచ్ ప్రత్యయం వస్తాయి.

| | |
|---|---|
| పిచ్ఛ - పిచ్ఛిల | ఉరస్ - ఉరసిల |
| పంక - పంకిల | ఇటా - ఇటిల |

## స్వార్థంలో ష్యఞ్ (య) ప్రత్యయం చేరిన రూపాలు

వా : చాతుర్వర్ణ్యాదీనాం స్వార్థ ఉపసంఖ్యానమ్ (అష్టాధ్యాయి 5-1-124)

చతుర్వర్ణ మొదలైన శబ్దాలకు స్వార్థంలో ష్యఞ్ (య) ప్రత్యయం చెప్పాలి.

| | |
|---|---|
| చతుర్వర్ణాలు - చాతుర్వర్ణ్యం | సన్నిధి - సాన్నిధ్యం |
| చతురాశ్రమాలు - చాతురాశ్రమ్యం | సేన - సైన్యం |
| ఉపమ - ఔపమ్యం | షడ్గుణాలు - షాడ్గుణ్యం |
| సుఖం - సౌఖ్యం | త్రిలోకాలు - త్రైలోక్యం |
| సమీపం - సామీప్యం | త్రిస్వరాలు - త్రైస్వర్యం |

## స్వార్థంలో అణ్ (అ) ప్రత్యయం చేరిన రూపాలు

సూ : ప్రజ్ఞాదిభ్యశ్చ (అష్టాధ్యాయి 5-4-40)

ప్రజ్ఞ మొదలైన శబ్దాలపై స్వార్థంలో అణ్ ప్రత్యయం వస్తుంది.

| | |
|---|---|
| ప్రజ్ఞ - ప్రాజ్ఞుడు | మరుత్ - మారుతం |
| మనస్ - మానసం | రక్షస్ - రాక్షసుడు |
| చోర - చౌరుడు | దేవతా - దైవతం |
| శత్రు - శాత్రవుడు | బంధు - బాంధవుడు |

